# భూదాన ఆరోహణము

మూలం

నారాయణ దేశాయి

అనువాదం

లవణం

సర్వోదయ సాహిత్య ప్రచార సమితి
భూదాన కుటీరం, హైద్రాబాదు.

ప్రకాశకులు
అఖిల భారత సర్వసేవాసంఘ పక్షమున
సర్వోదయ సాహిత్య ప్రచార సమితి
సంచాలకుడు
శ్రీ రామకృష్ణ ధూత్
భూదాన కుటీరము
సుల్తాన్ బజారు, హైద్రాబాదు.

తొలి ముద్రణ : సెప్టెంబరు 1956
ప్రతులు : ఐదువేలు
వెల : పన్నెండణాలు

ముద్రణ :
అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.

# ప్రవేశిక

భూదాన ఉద్యమ పరిచయం ఒక క్రమంలోనూ, ప్రామాణికతా పూర్వకంగానూ తెలుపు పుస్తకము యొక్క అవశ్యకత చాలా కాలమునుంచి కలుగుచున్నది. పరిచయం సంక్షిప్తంగా ఉంటూ అవసరములను తీర్చునదిగానూ ఉండాలి. సరళంగానూ, ప్రవాహయుత భాషలో వ్రాసినదిగాను అయి ఉండాలిగదా. ఈ పుస్తకమువల్ల అవన్నీ తీరుతున్నవి. గత నాలుగు సంవత్సరముల వృత్తాంతము ప్రామాణికంగానూ, హృదయంగమముగానూ యిందు చిత్రించారు. వర్ణన సజీవంగా ఉంది. ఉద్యమం యొక్క సైద్ధాంతిక, తాత్విక భూమిక మరియు సామ్యయోగ విప్లవపు ప్రతిక్రియ యొక్క పరిశీలన సారగర్భితంగానూ, మూలమును తెలుపునదిగానూ ఉన్నది.

ఈ పుస్తకము కార్యకర్తలకు ఎంతగా ఉపయోగకారియో అంతగా విద్యాధికులగు నగరవాసుల అధ్యయనమునకు, గ్రామీణులకుకూడ ఉపయోగకారియై యుండుట దీని ప్రత్యేకత. కార్యకర్తల శిబిరములలోనూ, నిర్మాణ కేంద్రములలోనూ ప్రత్యేకంగా ఈ పుస్తకమును పఠించి, అధ్యయనము చేయుట అవసరము.

ఈ పుస్తక రచయిత భూదాన ఉద్యమమందు భవిష్యత్తుకు రూపురేఖలు దిద్దు యువకుడును, నిష్ఠగలిగిన కార్యకర్తయు, ప్రతిభ కలిగిన భాష్యకారుడును అయిఉన్నాడు. తమ యౌవనము యొక్క ఉత్సాహము, ప్రతిభలను భూదాన యజ్ఞమున నింపుచు, దానికి పుష్టిని చేకూరుస్తున్న యువతీ యువకులలో ఈ రచయితకు ప్రముఖ స్థానమున్నది. ఈ పుస్తకములో వ్రాసినదాని వెనుక అతని నిష్ఠ ఎంత ఉన్నదో అంతగా ప్రత్యక్ష అనుభవముకూడ ఉన్నది. భూదానయజ్ఞము యొక్క సాంగోపాంగపరిచయమును నిరంతరం సంగ్రహించేవారికి ఈ పుస్తకము అత్యంత అవసరమైనది.

మురార్‌పురా, గయ.

9-3-1955.

దాదా ధర్మాధికారి.

# ఇందు

# అధ్యయనం చేయవలసినవి





# సింహావలోకనము

## [వినోబా]

మన ఈదేశం చాల విశాలమైనది. ఇక్కడ ఉండే ఏ బాలుణ్ణైనా సరే మీరెందరన్నదమ్ములు, నీదేశవాసులు ఎందరు అని ప్రశ్నిస్తే 36 కోట్లమంది అని సమాధానం చెబుతాడు. చైనాదేశం మినహాయిస్తే మరేదేశపు పౌరులు ఇంత పెద్ద అంకెలను చెప్పలేరు. యూరపులోని దేశస్థులను ఇదే ప్రశ్న వేస్తే ఒకరు కోటిమంది అని, మరొకరు రెండుకోట్లమంది అని, వేరొకరు నాలుగుకోట్లమందిమి అని సమాధానం చెబుతారు. ఈ విధంగా అక్కడ కొద్దికొద్ది సంఖ్యలే వినవస్తాయి. కాని మనం ఎంతోమంది సోదరులము. అనంతమైనది మన వైభవము. ఇదంతా ఏమిటో మనం పరిశీలించుకోవాలి. అసంఖ్యాకంగా నదులు సముద్రంలో కలుస్తూ ఉంటాయి. సముద్రం ఏనదినీ కాదనకుండా అన్ని నదులను తనలో లీనం చేసుకుంటుంది; అలాగే ప్రపంచంలోని అన్ని జాతులను భారత భూమి ప్రేమతో ఆహ్వానించి వారిని తమలో కలుపుకుంది. అందు చేతనే ఇంత అనంతమైనది మన వైభవము. నేను ఒక ఉదాహరణ నిస్తాను. పారశీకులు ఈరాను దేశంనుంచి ఆశ్రయార్థులై యిచ్చటకు వచ్చారు. ఇక్కడ ఉండే సహృదయులగు ప్రజానీకం వారికి ఆశ్రయ మిచ్చారు. తమ ఆచార వ్యవహారములను

సారంగా వారు తమ పూజాపద్ధతులను కొనసాగించుకొనే వారు. తమ భక్తిమార్గంలో తమ ఉపాసనను సాగించేవారు. అందులో మనం వారినేమీ అడ్డుపెట్టలేదు. నేడు కూడా పార్శీ జాతివారు ఈదేశాన్ని తమ దేశమే అనుకొంటున్నారు. ఇచ్చట తాము సురక్షితంగా ఉన్నామనుకుంటున్నారు. ఒక విచిత్రమైన సంగతి చెబుతాను. ఇక్కడకు వచ్చిన పారశీకులు దేవతలను నిందిస్తూ, అసురులను ప్రశంశిస్తూ వచ్చారు ! ఐనప్పటికి ఇక్కడ ఉండేవారిలో ఏమీ తప్పుడభిప్రాయము కలుగలేదు. ఇక్కడ దేవతలను స్తుతిస్తూ, అసురులను నిందిస్తారు. పారశీకులు అసురులను స్తుతిస్తూ, దేవతలను నిందిస్తారు. వారి భాషలో అసురులు అంటే అర్థం భగవంతుడు అని. శబ్దం వ్యతిరేకమైనప్పటికి అర్థంమాత్రం ఒకటే. వారు భగవంతుని గొప్ప అసురుడు 'అహుర్—మజ్ద' అనీ, దేవతలను భ్రాంత మానవులకు కష్టములు కలిగించే భూతములు, పిశాచములు అని అంటారు. ఈ విధంగా వారు దేవతలను నిందించారు. ఐనా యిచ్చటి ప్రజలు అర్థాన్ని మాత్రం గ్రహించి శబ్దాలను సహించారు. ఇది గొప్ప విషయం. ఇక్కడ కొచ్చిన పార్శీ జాతివారు గూడ ఆక్రమణ చేదామనే ఉద్దేశంతో రాలేదు. వారు ఇక్కడ కొచ్చినప్పుడు బలప్రయోగంతో ఆశ్రయాన్ని కోరలేదు. అయినప్పటికి వారికి ఇచ్చటివారు ఆశ్రయమిచ్చారు. వారిని తమమధ్యనిముడ్చుకుని పోషించే బాధ్యత భారతదేశం స్వీకరించింది. ఇక్కడుండే ప్రజలు ఇచ్చటి జ్ఞానుల అభిప్రాయానుసారంగా వెళ్ళుతూ యుండేవారు. అందుచేతనే మనం అభివృద్ధి చెందాము.

## మహామానవుల సముద్ర మీ భారతదేశం

ప్రస్తుతం ఇక్కడ చాలా "వాదములు" సాగుతున్నవి. వాదములు చాలా రకములుగా ఉంటవి. బీహార్-బెంగాల్ వివాదం సాగింది. బీహార్ వారు తాము వేరేదేశం అవుతామని గాని, భారతదేశంనుంచి విడిపోతామనిగాని అనలేదు. అలాగే బెంగాలువారుకూడ తాము వేరే దేశ మౌతామని అనలేదు. మనమందరం భారతీయులం, భారతవాసులం, ఒకే దేశంలో ఉండాలనుకుంటున్నాం. ఇక మిగిలిన వివాదాలు చిల్లర వాదాలు. వాని వెనుక అభిమానాలు లేవు. ఈరోజుల్లో కొంత అభిమానాలు, కొంతగా కాఠిన్యం వచ్చినప్పటికి యూరపులోని దేశాలమధ్య ఉన్నటువంటి అభిమానాలుమాత్రం లేవు. ఫ్రాన్సు, జర్మనీకి మధ్య రెంటినీ వేరుచేసే కొండలేమీ లేవు. ఐనా వారికి అట్టి పర్వత శ్రేణులు అవసరమని తోచింది. ఆ రెండుదేశాలు ఒకదాని సరసన ఒకటి ఉండే దేశాలు. వాటి లిపి ఒకటి, ధర్మం ఒకటి, భాషలుకూడా చాలావరకు కలిసి ఉంటాయి. వారివారి మధ్య వివాహసంబంధాలుగూడా జరుగుతూ ఉంటాయి. ఐనప్పటికి ఫ్రాన్సు దేశస్థులు తమ చిన్నదేశం వేరుగా ఉండాలని జర్మనీ దేశస్తులు తమ చిన్నదేశం జర్మనీ వేరుగా ఉండాలని అనుకున్నారు. ఫ్రాన్సుకి, జర్మనీకి, ఇంగ్లండుకీ మధ్య జరిగిన యుద్ధాలు దేశాలకూ - దేశాలకూ మధ్యజరిగిన యుద్ధాలయ్యాయి. అవి దేశాలమధ్య జరిగిన యుద్ధాలు అనబడ్డాయి గానీ "సివిల్ వార్సు" (ఆంతరంగిక పోరాటాలు) అని అనబడ లేదు. ఐతే భారత దేశంలో జరిగిన యుద్ధాలు, మహారాష్ట్రులు

ఒరిస్సావారితోగాని, రాజపుత్రులతోగాని చేసిన యుద్ధాలు సివిల్ వార్సుగా భావింపబడ్డాయి. బయటివారూ అలాగే అను కున్నారు, మనదేశంలోని వారుగూడ అవి పరస్పరం ఆంతరంగి కంగా జరుపుకున్న పోరాటాలేనని అనుకున్నారు. ఇక్కడ జరిగిన యుద్ధాలు ఆంతరంగిక పోరాటాలని భావింపబడడం మనం గర్వించవలసిన విషయం. యూరపుకంటె ఈదేశంలో వైవిధ్యం ఏమీ తక్కువ లేదు. యూరపులో ఉన్నట్లే యిక్కడా చాలా భాషలున్నాయి. అక్కడైతే ఒకేలిపి ఉన్నది. కాని ఇక్కడ ఎన్నో లిపులున్నాయి. అక్కడ ఒకే ధర్మమున్నది. ఇక్కడ ఇన్ని భేదాలున్నప్పటికి మనం మనలను ఒకే దేశవాసుల మనుకుంటున్నాము. యూరపు దేశవాసులు తాము ఒక ఖండ వాసుల మనుకుంటున్నారు. మన దేశంలోని ప్రాంతాలతో పోల్చినప్పటికీ అచ్చటి దేశాలు ఎంతో చిన్నవిగా ఉంటాయి. ఐనప్పటికి వారు తమ భాష వేరు కనుక తమది వేరుదేశము అనుకుంటున్నారు. భారతదేశంలో అట్టి విషయం కన్పడదు. ఇచ్చటి సాంఘిక శాస్త్రంలో విశాలమైన ఆలోచన యున్నది. అందుచేతనే ఇది "మహామానవుల సముద్రము" అని రవీంద్ర నాథ్ ఠాగూరు గానం చేశారు. ఇందులోనికి ఎంతోమంది జనం వచ్చారు, ఇంకావస్తారు. మనదేశంలో వైవిధ్యం ఉంటూనే దానిమధ్య ఐక్యత యున్నది.

## ఐక్యతకు ఆంగ్లేయులు కారణం కాదు.

కొంతమంది అనుకుంటున్నట్లుగా ఈ ఐక్యతను ఆంగ్లే యులు సాధించలేదు. ఈదేశాన్ని వీరైనంత ఎక్కువగా

ముక్కలు చేయాలని వారనుకున్నారు. అందుకు ప్రయత్నించారు. వారు లంకని వేరు చేశారు, బర్మాను భౌతికంగా వేరు చేయగలరు గనుక దానినీ చేశారు. మనం వీటిని ప్రతిఘటించ లేదు. ఎందుచేతనంటే ఆ ప్రాంతీయులు వేరుగా ఉండాలను కుంటున్నారు గనుక వారు వేరుగా ఉండడం మంచిదే నను కున్నాము. ఆంగ్లేయులు హిందూ - ముస్లిముల మధ్య భేదాలను కూడా కల్పించారు. మొగల్లో ఇలాంటి భేదాలే ఉండేవిగావు. కాని వారు ఆ భేదాలను పెంచారు. దాని కారణంగా భారత దేశం రెండు ముక్కలయింది. ఇచ్చటి సభ్యత కారణంగానే మనం ఈ దేశాన్ని ఏకదేశ మనుకుంటున్నాము. ఆంగ్లేయుల కారణంగా ఇచ్చటి ప్రజలు ఇంగ్లీషు భాషను నేర్చుకున్నారని, ఆ భాషలో పరస్పరం మాట్లాడుకుంటూ ఉండడంవల్ల ఐక్యత కలిగిందని ఇచ్చటి కొందరి అభిప్రాయము. కాని ఈ అభిప్రాయము సరిగాదు. వేదకాలము నాటినుంచి మనలో ఐక్యతా భావము ఉంది. రాకపోకల సౌకర్యాలులేని ఆ కాలంలోకూడ ఐక్యత ఉండేది. ఆనాటి ఋషులు చెప్పినదానిని బట్టి హిందూ మహాసాగరంనుంచి హిమాద్రివరకు ఒకదేశంగా భావింపబడినట్లు తెలియుచున్నది. ఇక్కడ ఒక సభ్యత పెరిగింది. అసంఖ్యాకులుగా యాత్రికులు దేశంలోని ఈకొసనుంచి ఆకొసవరకు యాత్రచేస్తూ యుండేవారు. ఎంతోమంది సత్పురుషులు హిమాలయాలనుంచి కన్యాకుమారి వరకు సద్భావములను ప్రచారముచేస్తూ యుండే వారు. అందుచేతనే మన దేశంలో ఐక్యత నిర్మాణమైంది. మనకా వారసత్వం లభించింది. కనుకనే మనం శ్రీమంతులం.

## చరిత్ర మోపిన బాధ్యత

ఈ గొప్ప వారసత్వాన్ని నిలుపుకొనుటకు వివేకం కావాలి. ఆ వివేకం లేకపోయేట్లయితే మనవద్ద ఉన్న శక్తియగు వైశాల్యము, జనసంఖ్య శక్తిగాకాక బలహీనతలుగా తయారవుతాయి. అందుచేతనే ఇక్కడవచ్చే సమస్యలను ప్రేమతోనూ, శాంతి విధానాలతోనూ పరిష్కరించవలసిన బాధ్యతను ఈదేశ చరిత్ర మనమీద మోపింది. ఈ బాధ్యతను మనం నెరవేర్చలేకపోతే మనదేశ వైశాల్యం మన బలహీనత అవుతుంది. మరియు దేశ స్వాతంత్ర్యం కూడ ప్రమాదంలో పడుతుంది. ఇక్కడుండే దేశస్థులకు యిచ్చటి వైవిధ్యంలోని ఆంతర్యం అర్థం కాలేదు. కనుకనే బయటనుంచి ఈ దేశంపై దండయాత్రలు జరగ గలిగాయని ఇచ్చటి చరిత్ర నిరూపిస్తోంది. దాని కారణంగా విభేదములు పెరిగాయి. వేరుపడడం హెచ్చయింది. ఒకరికి మరొకరికి మధ్య వైరుధ్యం పెరిగింది. తత్ఫలితంగా భారతదేశం వందల కొద్ది సంవత్సరాలు బానిసత్వంలో పడియుంది.

## శాంతి, ప్రేమల ఏకైకవిధానం

కనుక మనదేశంలో శాంతి, ప్రేమల విధానమే తప్పనిసరియవుతున్నది. మనం శాంతి, ప్రేమ విధానములో మన సమస్యలను పరిష్కరించే రీతిలో భగవంతుడు ఈ నిర్మాణమును చేయడం మన అదృష్టము అని నేనంటాను. నేను దీనిని మన అదృష్టము అని ఎందుకన్నానంటే శాంతి, ప్రేమ విధానములో మన సమస్యలను మనము పరిష్కరించుకోలేకపోతే మన శక్తి,

సంపద పెరుగదు. భగవంతుని రచన ఆ విధముగా ఉన్నది. భారతదేశం సైనికశక్తిని పెంచాలని అనుకునేట్లయితే భారత దేశపు శక్తి పూర్తిగా క్షీణించిపోతుంది. దేశం బానిసయిపో తుంది. అమెరికాను గాని, రష్యానుగాని అప్పుడు ఆశ్రయించ వలసివస్తుంది. అందుచేత దేశంలోని సమస్యలు శాంతి, ప్రేమ విధానములలో పరిష్కరింపబడడం అనివార్యమగుట మన అదృష్టమని నేను అంటున్నాను.

ఈ దేశంలోని సమస్యలు శాంతివిధానంలో పరిష్కరిం చడం ఈ దేశానికి తప్పనిసరి అయినట్లే, ప్రపంచ సమస్యల పరిష్కారానికి ప్రేమ, శాంతి విధానాలను వెతకడమనునది విజ్ఞానానికి తప్పనిసరి. నేడు ఆయుధాలు మానవుని వశంలో లేవు. ఆయుధశక్తిలో ఎన్నిదోషము లున్నప్పటికీ అవి మానవుని వశంలో ఉండేట్లయితే వాటివల్ల కొంతలాభం చేకూరగలదు. కాని నేడు విజ్ఞానం ఎంతగా వికసించిందంటే, ఆకారణంగా ఆయుధశక్తి మానవుని వశంలో ఉండకుండా పోయింది. ఎవరైనా బీడీ త్రాగి ఆర్పకుండా విసిరివేస్తారనుకోండి; దానివల్ల ఇంటికి నిప్పు అంటుకోవచ్చు, ఆ నిప్పును ఆర్పేశక్తి ఆ వ్యక్తిలో ఉండదు. అతను బుద్ధిపూర్వకంగా నిప్పు పెట్టకపోవచ్చు. ఐనప్పటికి నిప్పు పెట్టడంమాత్రం జరిగింది. అతని చేతిలో నిప్పు పెట్టగలిగే శక్తి ఉన్నది, తేలికగా నిప్పు పెట్టగలరు ఐతే ఆ నిప్పు నార్ప గలిగేశక్తి మాత్రం అతనిలో లేదు. ఈ వైజ్ఞానికయుగంలో ముట్టుకున్న నిప్పువల్ల కేవలం ఆ యిల్లేకాకుండా ఆ జ్వాలల్లో దేశాలకు దేశాలు తగలడిపోతాయి. మానవత్వాన్ని, మానవ

జాతిని పూర్తిగా నిర్మూలంచేసే శక్తిని విజ్ఞానం ప్రసాదించింది. అందుచేత ప్రపంచంలోని సమస్యలు ప్రేమ, శాంతి విధానాలలో పరిష్కారం కావడమనేది ప్రపంచ ఉనికికొరకు అత్యంత అవసరము. ఒక దేశంలో కొనసాగిన రీతి, విధానమే అన్ని దేశాలలోనూ కొనసాగాలనే పట్టుదల ఉండకూడదు. ప్రతిదేశంలోనూ వేరువేరు గుణాలు ఉంటూ ఉంటాయి. అందుచేత ప్రతిదేశంలోను ఒకేరకమైన ప్రభుత్వ వ్యవస్థ, సమాజనిర్మాణము ఉండాలని మనము పట్టుపట్టలేము. ప్రతిదేశము తన పనికి అనుకూలంగా వేరువేరు విధానాలలో సమాజనిర్మాణమును చేకూర్చుకుంటారని పట్టుదలలేని ప్రవృత్తిలో మనము ఉంటే ప్రపంచంలో శాంతి ఉంటుంది. లేకపోయేట్లయితే ప్రపంచమంతటా అశాంతే ఏర్పడియుంటుంది. ఈ రోజున అంతర్జాతీయంగా భారతదేశమంటే ఏర్పడిన భావము, భారతదేశపు స్వభావము, భారతదేశపు చారిత్రాత్మక బాధ్యత- ఈ అన్నిటివల్ల మనము శాంతి విధానాన్ని అనుసరించడం తప్పనిసరి; మఱియు విజ్ఞానం కారణంగా మొత్తము ప్రపంచం శాంతి విధానాన్ని అనుసరించక తప్పదు. మన పరిస్థితుల కారణంగా మనకు, విజ్ఞానకారణంగా అదే విషయం మొత్తం ప్రపంచానికి తప్పనిసరైనది. మన సమస్యలను పరిష్కరించుకొనుటకు నేడు అందరూ శాంతి విధానాన్ని అనుసరించవలసి ఉంటుంది. నిప్పు అంటుకోకుండానూ, అంటుకున్నా ఆర్పగలిగే విధానమును చూసుకోవలసియున్నది.

## భారతీయ పరంపరకు చెందిన
## లోహియా హృదయోద్గారములు

ఇందూరులో తుపాకులు కాల్చబడ్డప్పుడు నేను ఉండబట్ట లేకపోయాను. అందుచేతనే స్వరాజ్యంలో ఈ విధంగా తుపాకి కాల్పులు జరుగకూడదని, స్వరాజ్యంలో ఉద్యమాలు సాగించే వారు కూడ హింసలు జరగనివ్వకుండా తమపై అంకుశ ముంచు కొనవలసిన బాధ్యత కలిగియున్నారని నేను అప్పుడే చెప్పాను. కాల్పులు జరుపకూడదని ప్రభుత్వం గూడ అనుకోవాలి. తిరువాన్కూరు కొచ్చిన్‌లో కాల్పులు జరిగినప్పుడు రామ మనోహర్ లోహియా ఆత్మ విహ్వాలమై విషయాన్ని విప్పి చెప్పింది. అక్కడ సోషలిస్టుపార్టీ ప్రభుత్వమే ఉన్నప్పటికి వారి అంతర్వాణి బహిర్గతమైంది. దానిపై చర్చ జరిగింది. అనుకూలం గానూ, వ్యతిరేకంగానూ జరిగిన వాదనలలోనికి నేను దిగ దలచుకోలేదు. తమ పార్టీ ప్రభుత్వమే అచట ఉన్నప్పటికి గూడ వారి హృదయంనుండి వెలువడిన మాటలు భారతీయ వాణి అని మేము భావిస్తూ వారి యెడల పూర్తి సానుభూతిని కలిగియున్నాము.

## హింస గురించిన పొరపాటభిప్రాయము

హింస వల్ల అన్ని సమస్యలు పరిష్కరింపబడ గలుగుతా యనీ, త్వరగా పరిష్కరింపబడ గలుగుతాయనీ నేడు ఒక అభి ప్రాయముంది. ఇది తప్పు డభిప్రాయము. హింసవల్ల సమస్యలన్నీ పరిష్కారము కాలేవు. త్వరగానూ పరిష్కరింపబడలేవు. సమ

స్యలు పరిష్కార మయ్యాయని మనం అనుకుంటే అది తప్పు అవుతుంది. ఒకచోట చెత్తంతాచేరి ఉండగా దాన్ని తుడిస్తే ఆలస్యమౌతుందని తుడవకుండా దానిమీదనే తివాసివేసి శుభ్ర మైనదనుకుంటాము. ప్రజలు కూర్చున్నారు. సభ ఆరంభమైంది. క్రిందనుండి తేలువచ్చి కాటువేస్తే ఇక సభ ముగుస్తుంది ! శుభ్ర పరచుటలో ఆలశ్యమౌతుందని చెత్తను కప్పివేసినంత మాత్రాన అది శుభ్రతగాదు. శుభ్రత కొరకు కొంతపనిని చేయవలసి యుంటుంది. సంస్కృతంలో ఒక సామెత యుంది. ఒకబ్బాయి గోధుమలను నాటడానికి వెళ్ళాడు. మొదటిరోజున ఒక గింజ నాటాడు. మరునాడువెళ్ళి చూచాడు. మొలకెత్తలేదు. రెండవ రోజు, మూడవరోజు, నాలుగవరోజు వెళ్ళి చూచాడు. ఐనప్ప టికి మొలవలేదు. ఆఖరికి ఐదవరోజున చూస్తే కొద్దిగాం అంకురం పైకి లేచింది. ఈమాత్రం మొలవడానికి యింతకాలం పట్టిందా అనుకుని దానిని పట్టుకుని కొంచెం పైకి లాగాడు. మరునాడు వెళ్ళిచూస్తే మొలక వాడిపోయింది. పైనుంచి లాగడంవల్ల మొలక పెరగదు. మొలక పెరగడానికి సమయం పడుతుంది. పట్టాలికూడా. తక్కువ సమయంలో ఈపని జరగాలని ప్రయ త్నిస్తే అది వ్యర్థ ప్రయత్నమే ఔతుంది. దానివల్ల మొత్తం వ్యవహారమే వ్యర్థమై పోతుంది. అందుచేత హింసవల్ల సమస్యలు త్వరగా పరిష్కార మౌతాయనుకోవడం భ్రమ.

## దేహప్రధానమగు విద్యవల్ల వచ్చిన పరిణామములు

ఈరోజున ప్రజలకు హింసమీద ఎంతగా నమ్మకం ఉన్న దంటే అన్ని సమస్యలు హింసవల్లనే పరిష్కరింపబడుతాయని

వారికి అనిపిస్తోంది. ఈఉద్దేశ్యం తప్పు. ఇంట్లోగూడ తల్లిదండ్రులు పిల్లలను కొడుతూ ఉంటారు. అంటే ప్రేమతో నచ్చచెప్పే శక్తిపైకన్న తల్లిదండ్రులకు దెబ్బలపై ఎక్కువ నమ్మకమున్నట్లు దీనివల్ల అర్థమౌతుంది. పాఠశాలలోనూ ఇదే కనబడుతోంది. పిల్లలు ఆలస్యముగావస్తే బెత్తంతో కొట్టి వారికి సరియగు కాల మునకు రావడం నేర్పుదామనుకుంటున్నారు. ఇంకాపైన జరుగు తున్న దేమిటి? పిల్లవాడు వేళకు స్కూలుకు వెళ్ళుతాడు. దానితో తమపని జరిగిందని చూడమంటారు. బెత్తం స్పర్శ పిల్లవాని శరీరానికి తగలగానే పిల్లవానికి సద్గుణాల ప్రేరణ కలిగింది! ఆవిధంగా సద్గుణాల ప్రేరణకొరకు బెత్తం స్పర్శ, లాఠీలస్పర్శ ఎంత లాభకరమో! అని అంటున్నారు. వడ్డీకొరకు పట్టుబడితే అసలే ఎగిరిపోయిందట! పిల్లల్నికొడితే వేళకైతే స్కూలుకు రావడం ప్రారంభించాడు కాని దానితో పాటుగా భయపడడంగూడ అతను నేర్చుకున్నాడు. దానివల్ల దెబ్బకు జడవమనే శిక్షణ మన మిస్తున్నట్లవుతుంది. ఈ విధంగా నిర్భ యత్వాన్ని వదలిపెట్టి వేళకు రావడం నేర్చుకున్నాడు. నిర్భ యత్వానికి ఎక్కువ విలువ వుందా లేక వేళకు రావడానికి ఎక్కువ విలువ ఉందా? మీరు ఒక దమ్మిడీ సంపాదించి రూపాయి పోగొట్టుకుంటే ఒరిగే దేమిటి? పిల్లవాడు కొద్ది రోజులు వేళకు స్కూలుకు వెళ్ళుతాడు. ఆపైన ఒత్తిడి లేకపోతే వేళకు వెళ్ళడ మనే దానిని వదిలివేయవచ్చును. అందుచేత వేళకు వెళ్ళడమనేది అతనిలో నిలిచి ఉండదు సరిగదా, పైన భయము కల్గుతోంది! ఈ రకమైన విద్యా విధానము ప్రమాదకరమైనది. ఈ రోజున

శక్తి, శాంతియుతంగా దెబ్బలు సహించే శక్తియగు యీ తితీక్ష- ఇదే నిర్భయత్వం. ఆయుధాలమీద ఆధారపడడం నిర్భయత్వానికి గాక పిరికితనానికి లక్షణమౌతుంది. అందుచేత విద్యావిధానంలో భయానికి లొంగవద్దనే తత్వాన్ని చేర్చడం చాలా అవసరం. పిల్లలికి రెండు విషయాలు చెప్పాలనుకుంటున్నాము. (1) మేము భయపడము, ఒకరిని భయపెట్టము. (2) మేము అణగబడము, ఒకరిని అణచము. గీతగూడ ఇదే విషయాన్ని చెప్పింది.

"నాయం హన్తి నహయన్తే"

ఇతను ఒకరిని చంపడు, తాను చావడు.

## మొదటి ఆవశ్యకత : అభయము

అందుచేతనే సమస్యలూ పరిష్కారం కావాలి; అశాంతి, అభిప్రాయభేదాలూ రాకుండా ఉండాలి. మనలో భయం ఉండకూడదు. మన చరిత్రకారులకు ఈ విషయము తెలుసును. అందుచేతనే మన సాంఘిక శాస్త్రంలో అభయము అనే శబ్దము ఉండెను. కాని నేడు దానికి బదులుగా 'లా అండ్ ఆర్డర్' అనే శబ్దాలు వచ్చాయి. ప్రజలలో భయం ఏర్పడినప్పటికి 'లా అండ్ ఆర్డర్' ఉంటే చాలు ననుకుంటున్నారు. ఈవిధంగా వ్యవస్థాదేవిని పరమదేవి అనుకుంటున్నాము. మనము ఆమెతో 'ఓ దేవీ! నీవు నాకు పరమదేవివి. నీవే మమ్మల్ని సంరక్షిస్తున్నావు. నీవే మాకు ఆధారము' అని అంటున్నాము. నాస్తికులు గూడా ఈ దేవిని నమ్మునంతగా ఈమెపై అందరికీ నమ్మకం

ఏర్పడింది. కమ్యూనిస్టులు తాము ఈశ్వరుని నమ్మము అని అంటున్నారు. మీరు అంతా కొలిచే దేవుని నమ్మకపోయినా మరొకరిని నమ్ముతున్నారని నేనంటున్నాను. వ్యవస్థా దేవతనైతే మీరు నముతున్నారు గదా. వవ్యస్థ చేయడంలో కొంతమందిని అంతం చేయవలసివస్తుంది అని కొందరంటారు. ఈవిధంగా పరిశుద్ధి జరుగుతూ జరుగుతూ సంఘర్షణే నశించిపోయే వ్యవస్థ ఏర్పడు తుందని వారంటున్నారు. సంఘర్షణే వారికి పరమ సత్యము! సంఘర్షణ నశించిపోతే యిక ఏమవుతుంది అని వారిని ప్రశ్నిస్తే సృష్టితో సంఘర్షణ ఆరంభమౌతుంది అని అంటున్నారు. వ్యవస్థకు ఉన్న విలువను మేమూ గుర్తిస్తున్నాము. ఇంతకుముందే మిమ్మల్ని శాంతంగా ఉండమని చెప్పాను. మీతో నెమ్మదిగా ఈవిషయము చెప్పాను. అందుకు బదులుగా కొట్టి మిమ్మలను శాంతంగాఉండమంటే మీరు శాంతంగాఉంటారు; కాని మీరేమీ వినగలిగేవారు గాదు. జ్ఞానాన్ని పొందగలిగేవారు గాదు; ఎందుకంటే ఆశాంతి బాహ్యశాంతి అవుతుందే కాని ఆంతరంగిక శాంతి కాజాలదు. హృదయంలో భయమే ఉంటుంది కనుక అది శాంతి కాజాలదు. లోపలక్షోభము సలసలా మరుగుతూ ఉంటుంది. ఆ క్షోభం బహిర్గతంకాకుండా లోపల ఉండేట్లయితే అదిచాలా ప్రమాదకరమౌతుంది. అదిగనుక బహిర్గతమైతేమరేమీ ఇబ్బంది ఉండదు. నీటి ఆవిరి లోపలే అణగబడివుంటే దాని శక్తి వల్ల ఝుక్ ఝుక్ మంటూ రైలు కదులుతుంది. క్షోభము గనుక ప్రకటమైతే దానిలో అంతశక్తి ఉండదు. దానిని మనం లోపలే అణిచిపెట్టిఉంటే దానివల్ల హెచ్చుఅనర్థంకలుగుతుంది. మిమ్మల్ని

మేము బెదరించకుండా నచ్చచెప్పబట్టే మీరు శాంతంగా ఉన్నారు. భయపెట్టి మిమ్మల్ని శాంతపరచేట్లయితే వ్యవస్థ దేని చేతిగా ఉండక వ్యవస్థారాక్షసి ఐపోతుంది. ఆ రాక్షసి పొట్టలో ఎంతో అవ్యవస్థ ఉంటుంది. రాక్షసి పొట్టలోని అవ్యవస్థకు బదులుగా బాహ్యా అవ్యవస్థే మేలు అనిపిస్తుంది. అందుచేత వ్యవస్థకన్న అభయము అత్యంత అవసరము.

## ఐక్యతా వివేకము

ఝరియా ఒక పెద్ద కురుక్షేత్రమని నేడే నాకు తెలిసింది. ఇక్కడ యుద్ధాలు కొనసాగుతున్నాయి. దుర్యోధన దుశ్శాసన మొదలగు కౌరవ పుత్రులు ఇచ్చట ఎందరున్నారో మాకు తెలియదు. కాని ఇక్కడ కూలీలు ఉంటున్నారు. వారిచేత పనిచేయించుకోవాలని, ఎట్టి స్థితిలోనైనా పనిచేయించుకోవాలని అనుకుంటున్నారు. వారినుంచి బొగ్గు తీయించాలి. గనులలోనుంచి బొగ్గు త్రవ్వించకపోతే దేశం ముఖం మాడిపోతుంది. అందుచేత వారినుంచి పనిచేయించుకోవాలి. కూలీ అంటే శ్రమశీలురని అర్థం. శ్రమశీలురున్నచోట శాంతి ఉండి తీరాలి. సోమరిపోతులుండేచోటే అశాంతి ఉంటుంది. శ్రమచేసే వాళ్ళనుంచే లక్ష్మి పుడుతుంది. కాని నేటిస్థితి ఇందుకు విపరీతంగా ఉంది. నేడు శ్రమచేసే వాళ్ళున్నచోటా రెండు పార్టీలు లేస్తున్నాయి. ఆ రెండింటి హితములు విభిన్నములనుకుంటున్నారు. ఒకటిని రెండు చేయడం, రెండును నాలుగు చెయ్యడం ఈ విధంగా ముక్కముక్కలు చేసే తెలివి ప్రపంచానికి నేడు

చక్కగా అబ్బింది. నాలుగును రెండు చేయడం, రెండును ఒకటి చేయడం ఈ వివేకం మాత్రం రాలేదు. ముక్కముక్కలు చేసే తెలివిని 'గీత' రాజసబుద్ధి అన్నది. దానివల్ల ఎన్నో చీల వలు కలుగుతున్నాయి. దీనికీ, దానికీ కలవదూ; దానికీ దీనికీ కలవదూ అని చెప్పే తెలివి అందరికీ వచ్చింది. ఐతే అందరిలోనూ ఒకే మాదిరిగా నున్న పోలికల అంశమును తీసుకుని దానిపై ఐక్యతను నిర్మించే వివేకం ఉండాలి.

## గూండాల రాజ్యం ఎందుకుంది ?

ఇక్కడ గూండాలరాజ్యం సాగుతోందని నాకు చెప్పారు. ఐతే ఎంత వెతికినా గూండాల రాజ్యంలేని స్థలం అంటూ లేదు. గూండాలనబడే గూండాలు ఒకరకం. సేనాపతులు, కార్యకర్తలు అనబడేవారు రెండవరకం గూండాలు. చదివినవిషయాలు తెలిసిన మనవంటి వారంతా పోలీసు, సైన్యాలమీద రక్షణకు ఆధారపడి ఉంటున్నాము. ఇంతకంటె అనర్థం ఏమిఉండగలుగుతుంది? ఇంత కంటె పరాధీనమైనదశ ఏదికాగలుగుతుంది. ఈపోలీసులు ఎవరు? వీరిలో ఉండే గుణాలు ఏమిటి? 36 అంగుళాల ఛాతీ గలవా రల్లా పోలీసులు కాగలుగుతారు. వారిలో ఉండవలసిన గుణమే యిది. యిట్టివారిమీదనే మనం మన దేశరక్షణ భారాన్ని అప్ప జెప్పుతున్నాము! ఆపైన ఇంక ఏమేమి చేయవలసిఉంటుందనేది మనం ఆలోచించాలి. అటు బొంబాయిలో మద్యనిషేధం జరిగిం దంటే మద్యనిషేధం సైన్యానికి వర్తించకుండా చేయాలని కోర బడింది. సైన్యానికి మద్యానికి అవకాశం కల్పించాలి అంటు

న్నారు. రావణుని సైన్యంలో అందరూ మద్యం త్రాగేవారనీ, కాని రాముని సైన్యంలో ఎవరికీ మద్యం అవసరమే కలిగేది కాదనీ మనకు తెలుసును. హనుమంతునికి మద్యం అవసరం లేక పోయెను. అందుచేత దేశరక్షకులు అనబడే సైన్యం రాజసిక మైనదా లేక సాత్వికమైనదా అని మనం ఆలోచించాలి. గూండాలకు మేము హనుమంతుని పదవి యివ్వాలనుకుంటు న్నాము. సైన్యం మనలను రక్షించేది అని అనుకుంటున్నాము. తులసీదాసు 40 హనుమంతులపెట్టు అని వ్రాసాడే గాని 40 రావణులపెట్టు అని వ్రాయలేదు! ఎందుచేతనంటే హనుమం తుని శక్తి అందరినీ రక్షించేశక్తి. రావణునిశక్తి అలారక్షించేశక్తి గాదు. హనుమంతుని శక్తి వల్లనే దేశం రక్షింపబడుతుంది గాని రావణుని శక్తివల్లగాదు. సైన్యానికి మద్యం ఇవ్వవలసిరావడం, భోగ సాధనాలు ఇవ్వడం, యుద్ధక్షేత్రంలో వారి విలాసార్థం కన్యలను పంపవలసి రావడం - ఈవిధంగా జరిగే అవినీతినికూడా నీతిఅనుకోవలసి వస్తోంది. "వార్ బేబీస్" అంటే యుద్ధంలో పుట్టిన పిల్లలు, అనే సమస్య ఒక టుందని విన్నాము. యుదం వల్ల పిల్లలు ఎలా పుడతారా అని నాకు ఆశ్చర్యం వేసింది. అక్కడ ప్రజలు మరణిస్తారు. కాని ఆధునిక యుద్ధంలో పిల్లలు జన్మిస్తారు. ఇట్టి సైన్యాలపై మనం ఆధారపడవలసి వస్తోంది. మన పవనారు ఆశ్రమాన్ని రక్షించాలంటే ఎవరు రక్షిస్తారు? పైనుంచి బాంబుపడితే తమ ధ్యానం ఎలా సాగుతుంది అని ధ్యానయోగులు అనుకుంటారు. పోలీసులు మనలను రక్షిస్తారా? ఈవిధంగా మన దేశరక్షణభారం గూండాలమీద ఆధారపడినంత

కాలం, ఈస్థితి ఇలాగే యున్నంతకాలం గూండాల రాజ్యమే సాగుతుంది. మీరు దానికి ఏ పేరు పెట్టినా అది గూండాల రాజ్యమే. పేరు మార్చినంతమాత్రాన యదార్థం పోదు. అందు చేతనే మన సమస్యలు శాంతి విధానంలో పరిష్కరింప బడాలి అని కోరుతున్నాము.

## హత్యల ద్వారానా, శాసనం ద్వారానా, హృదయం ద్వారానా?

మీరు సాగిస్తున్న భూదానయజ్ఞ కార్యక్రమం వల్ల ఆలస్య మౌతుంది గనుక శాసనం ద్వారా పని త్వరగా జరిగే టట్లు ఎందుకు చూడకూడదు అని కొంతమంది అంటున్నారు. శాసనం ద్వారా పని త్వరగా జరుగుతుంది. హత్యలు, హింసలు ద్వారా మరింత త్వరగా జరుగుతుందని వీరు అనుకుంటున్నారు. హత్యలద్వారా త్వరగా పని జరుగుతుందని నేనూ ఒప్పు కుంటున్నాను. జనవరి 26వ తేదీవలె ఏదో ఒకతేదీ నిశ్చయం చేసుకుని కూలీలంతా లేచి నిలుచుని యజమానులందరినీ ఆరోజున హత్యచేస్తే బాబా 2 సంవత్సరములనుండి చేస్తున్న పనిని వారు ఒక్కరోజులో పూర్తిచేసేవారు. ఇది జరుగగలుగు తుంది అని నేను ఒప్పుకుంటాను. ఐతే ఇదేమైనా పరిష్కార మార్గమా? చట్టంద్వారా కాలేనిది ఏముంది అని ప్రజ లను కుంటారు. చట్టం ద్వారా మీరు దయావంతులు కాగలరా? చట్టం ద్వారా మీరు ధర్మ పురుషులు కాగలరా? చిన్నపిల్లల వ్రాత చెడిపోతోందని వారు ఫౌంటెన్ పెన్‌తో వ్రాయకూడ దని బొంబాయి రాష్ట్రంలో శాసనం చేశారు. ఈ మాత్రం

కూడా మనం వివేకంతో ఆలోచించుకుని చేయలేమా ? విద్యార్థు లకు ఉపాధ్యాయులు ఈ మాత్రం గూడా నచ్చచెప్పలేరా ? ఈ రోజున ప్రతిదీ చట్టం ద్వారానే జరగాలనే గాలి వీస్తోంది. ఈ సినిమాలు ఎంతో అసహ్యంగా ఉంటున్నాయి. అవి మన పిల్లలను చెడగొడుతున్నాయి. వాటిని ఆపడానికి శాసనం రావాలని ప్రజలంటున్నారు. శాసనం అక్కరలేదని నేననడం లేదు. శాసనమైతే రావాలి. ఈ చెడు సినిమాలను ఆపండి, లేకపోతే మాపిల్లలు తప్పుదారిన పోతారు అని ఈ మధ్యనే ఢిల్లీలోని తల్లులు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. ప్రభుత్వం ఇందులో ఏమీ చేయలేదని నేననడంలేదు. ప్రభుత్వం చాలా చేయగలుగుతుంది. ఐతే అది ప్రభుత్వమై యుండాలి. అంటే అందులో వివేకం ఉండాలి. ఐతే ఇప్పుడు మా ఎదుట ఇంతమంది ఉపాధ్యాయులు, యింతమంది పాలకులు ఉన్నారు. తమ పిల్లలు తప్పుదారిన పోతున్నారని వారనుకుంటున్నప్పుడు, పిల్లలు నిర్వీర్యులు అవుతున్నారని వారికి తెలుస్తోన్నప్పుడు తమ ప్రజలలో హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు మొదలగు వారంతా ఉన్నారు గదా ! వీరంతా కలిసి వారిని ఆపలేక పోయారా ? వారు నైతికభావాన్ని ప్రచారం చేయలేరా ? మనదేశంలో ప్రాచీనకాలం నుంచి నైతికభావ ప్రచారం ఎంత గానో సాగింది. గ్రామ గ్రామంలోని ప్రజలను పరమేశ్వరుడు ఎక్కడుంటాడని ప్రశ్నిస్తే ఆయన ప్రతి దేహంలోనూ ఉన్నాడని సమాధానం చెబుతారు. ఇదంతా ఎలా జరిగింది ? లక్షలకొద్దీ వ్యక్తులు ధర్మంకొరకు తపస్సుచేసి ఆ కార్యంలోనే మరణించారు.

ఇదంతా చట్టంద్వారానే జరిగిందా? లక్షలకొద్ది జనం కుంభ మేలాకు వెడుతున్నారు. వీరందరూ చట్టంవల్ల వెళ్ళుతున్నారా? మన జీవితంలో ఎన్నో విషయాలు చట్టంద్వారా జరుగుటలేదు. మన హృదయంలో ఉన్న శక్తి ద్వారానే ఇవన్నీ జరుగుతున్నాయి. ఐతే ఆశక్తి నశించిపోయిందా? మనం సినిమా చూడ్డం మానివేస్తే ఆకాశంలో సాగుతున్న సినిమా చూడలేమా? పాపాన్ని నాశనం చేయాలంటే నక్షత్రాలను దర్శించుకోవాలని ఋషులు చెప్పారు. దానివల్ల కళ్ళకు చల్లదనం వచ్చి మన భావాలు ఉన్నత మౌతాయి. ఈ విధమైన, అందమైన సినిమాను మనం చూడలేమా? ఈ సందర్భంలో శాసనరీత్యా కూడా కొంత కర్తవ్య ముందనీ నేను ఒప్పుకుంటున్నాను. అలహాబాదులో మాకొక సన్మాన పత్రము యిచ్చారు. అందులో అచ్చటి మ్యునిసిపాలిటీ రాత్రిపూట సినిమాలు నిషేధిస్తే ప్రాంతీయ ప్రభుత్వం ఆ నిషేధాన్ని రద్దుచేసిందని చెప్పారు. ప్రభుత్వానికి ఇందులో చాలా కర్తవ్యముందని, ఆ కర్తవ్యాన్ని పాలించకపోతే దోషి అవుతుందని నేను ఒప్పుకుంటాను. ఐతే మనలో గూడా స్వతంత్రశక్తి లేదా?

## సమస్యలు దైవ ప్రసాదములు :

భూమి సమస్య శాసనము ద్వారా పరిష్కారముకాలేదు. శాసనమువల్ల భూపంపిణీ జరుగ గలుగుతుందిగాని, శాసనము హృదయాలను కదపలేదు. ఈ సాగుతోన్న ఉద్యమం హృదయాలను ఐక్యపరిచే ఉద్యమం, శాసనము భూమిని పంపిణీచేసే

సంఖ్యపై మాకు నమ్మకం లేదు. ఐనప్పటికి ఉత్తరప్రదేశ్ లో మా భూదాన సభలకు వచ్చినంతమంది జనం ఎన్నికల మీటింగు లకు గూడా వచ్చేవారుకాదు. ఎన్నికలలోని అభ్యర్థులే మాకు ఈ విషయం చెప్పారు. ఎన్నికలసభలలో చప్పట్లు కొడతారు. గల్లంతు జరుగుతూ ఉండేది. కాని మా మీటింగులలో ప్రజలు చడీ చప్పుడు లేకుండా కూర్చునేవారు. సంతృప్తిగా వినేవారు. దానమూ ఇచ్చేవారు. "గంగానది ప్రవహించడం ఆగుతోందా ? అలాంటప్పుడు మేంమాత్రము ఎందుకుఆగాలి?" అని అన్నాము. ఎప్పుడయినా ఎన్నికల్లో ఫలానావారు గెలిచారు, ఫలానా వారు ఓడిపోయారు అని ఎవరయినా అంటే మేము ఆ విష యాలు పత్రికల్లో చదివేవారముకూడా కాదు. ఫలానామంత్రి ఏమి చెప్పాడో మీకు తెలుసునా అని ఎప్పుడయినా, ఎవరైనా మమ్మ అడిగితే ఆ ఫలానా మంత్రికి మేము ఏమి మాట్లాడామో తెలుసునా అని అడుగుతున్నాము. నేను మాట్లాడింది అతనికి తెలియనప్పుడు అతను మాట్లాడింది తెలుసుకునే బాధ్యత నామీద లేదు.

## నూటికినూరు దానపత్రాలు కావాలి

మేము గణితప్రియులము. అందుచేత గణితంవేస్తూ ఉంటాము. ఇంతవరకు 3½ లక్షలమంది జనం దానమిచ్చారు. ఒకవ్యక్తి దానమిచ్చాడంటే కనీసం 10 మందైనా మా ఈ అభిప్రాయములను విని ఉంటారు. పట్టాలున్న వ్యవసాయదారులు

ఎందరుంటారో అన్ని దానపత్రాలు రావాలి. మేము 100 కి 100 దానపత్రాలు కోరుతున్నాము. 4 కోట్ల సంపదగలిగినా, 4 దమ్మిడీల సంపదకలిగినా సంపదకలవారు దేశంలో 6 కోట్ల మంది ఉంటే మాకు 6 కోట్ల సంపత్తి దానపత్రములు రావాలి. ఏ ఉద్యమంలోనైనా ఈ విధంగా 100 కి 100 పాళ్ళూ విజయం వస్తుందా అని కొందరడగవచ్చుచు. 100 కి 100 దానపత్రాలు ఎలా సంపాదించవచ్చునో ఇప్పుడే శ్రీ వైద్య నాథ్ బాబూ చెప్పారు. కొంత శాతము వేసిచూడండి. మేము శాతంవేసి చూస్తామని, 100 దానపత్రాలు రావాలని మా కోరిక అని అన్నాము. ఈసభలో కూర్చున్న వాళ్ళల్లో అందరూ చనిపోయేవాళ్ళే. ఆ ఎన్నికల్లో అందరూ ఓటువేసేవారే. యమరాజుపెట్టెలో అందరి ఓట్లూ ఎలాగూ పడనున్నాయి. మృత్యువుకి ఇంతమంది ఓట్లు వేస్తున్నప్పుడు జీవించడానికి ఓట్ల శాతము ఎందుకు తక్కువ కావాలి. మమ్మలను తిప్పుతున్న భావన, మా కాళ్ళకు ప్రేరణ కల్పిస్తున్న భావన మీకూ నచ్చే ట్లయితే మీరూ కదలకుండా ఉండలేరు. అభిప్రాయములమీద మాకు ఎంత నమ్మకమున్నదంటే అభిప్రాయశక్తిని మించి ప్రపంచంలో మరేశక్తి లేదు.

## ఆత్మశక్తి మహత్వము

మీ జాతకచక్రం ఒకసారి చూడాలనుకుంటున్నాను అని ఒకదఫా ఒక సోదరుడు అడిగాడు. "మీపై కుజ శనిగ్రహా

ముల ప్రభావం ఎలా ఉందో చూడాలనుకుంటున్నాను" అని అన్నాడు. అప్పుడు నేను "మనము చైతన్యము, అవి జడములు; అందుచేత నా ప్రభావము వాటిపై ఏమి పడిందో తెలుసుకొనుటకుగాను కుజ, శని గ్రహముల జాతక చక్రములు నేను చూడవలెననుకుంటున్నాను" అని అన్నాను. మనము బ్రహ్మాలము. ప్రపంచంలో బ్రహ్మాలను మించినశక్తి లేదు. మనము ద్రష్టలము. ఈమొత్తం సృష్టి అంతా దృశ్యము. మనం దీనికి రూపం దిద్దే వాళ్ళము. కుమ్మరివాడు మట్టికి రూపమిచ్చినట్లుగా మనం ఈ సృష్టికి యిష్టంవచ్చినట్లు రూపం దిద్దగలము. ఈ అభిప్రాయములు మీకునచ్చేట్లయితే ఆటంబాంబులలోకూడ లేనిశక్తి మీలో కలుగుతుంది. ఆటంబాంబు ఎంత గొప్పది, ఎంత శక్తిగలది అని నాతో కొందరన్నారు. మావద్ద "ఆత్మబాంబు" ఆత్మశక్తి, ఉన్నది, అని అన్నాను. ఆఖరికి ఆటంబాంబును తయారు చేసింది మానవులే గదా! దానిని తయారు చేయగలిగినవారు దానిని నాశనమూ చేయగలుగుతారు. మీరు బలహీనులు కారు అని మీకు తెలుపవలెననుకుంటున్నాము. మీరు చాలా బలవంతులు. ప్రపంచంలో మిమ్ములను మించిన బలవంతులు లేరు. ఐతే ఆ శక్తి శస్త్రాలలో లేదు. ఆత్మలోనూ, ప్రేమలోనూ ఉన్నది. ఆ శక్తిని బహిరంగపరచుటకే ఈ ఉద్యమం కొనసాగుతోంది.

మొట్టమొదట తమ సోదరులకు లభించాలని, ఆపైన తమకు లభించాలనిఅనునదే సర్వోదయ నియమము. ఐతే ప్రజలు ముందు తమకేకావాలి అని అంటున్నారంటే అది సర్వనాశనానికి దారి. అందుచేత అందరూ ముందుగా ఇతరులకు లభిం

చాలని అనాలని మేము కోరుతున్నాము. ఇటువంటి సహజ మైన వ్యవస్థనే మేము కోరుతున్నాము. మీరు 'గీతాప్రవచనము' లను చదివితే ఆత్మశక్తి అంటే ఏమిటో మీకు తెలుస్తుంది.

## గాంధీజీ గుజరాత్‌లోనే ఎందుకు జన్మించారు ?

ఇప్పుడే స్వామి ఆనంద్ యిచ్చట గుజరాతీ సమూహం ఎక్కువగా ఉందని, అందుచేత వారి నుద్దేశించి ఏమైనా చెప్ప మనీ అన్నారు. ఇక్కడ గుజరాతీలు ఉండాలని, బెల్లం ఉన్న చోట చీమలు ఉండి తీరతాయనీ అన్నాను. ఐతే గుజరాతీ సోదరులపై పెద్ద బాధ్యత యున్నది. గాంధీజీ గుజరాతులో జన్మించారు. ఇదేదో అయాచిత అదృష్టకరమగు విషయము కాదు. దాని వెనుక ఒక తత్వమున్నది. రైతులు మాంసా హారాన్ని విసర్జించిన ప్రదేశము గుజరాతు మాత్రమే. ప్రపంచ మంతటా, మిగిలిన ఏ ఇతరచోటా సాధారణ ప్రజానీకములో ఈ విషయం కనబడదు. ఈ అహింసా పరిణామ స్వరూపంగానే ప్రపంచ మంతటికీ ప్రకాశం మాదిరిగా అచ్చట గాంధీజీ అవత రించారు. వేలకొద్ది సంవత్సరాల తరువాత నేడు బుద్ధ జయం తిని మనం జరుపుతున్నట్లుగానే, దానివల్ల మనం ఎంతో ప్రకా శాన్ని పొందుతున్నట్లుగా గాంధీ జయంతిని కూడా జరిపి దాని నుండి ప్రకాశం పొందడం గురించి భారత దేశమేగాక మొత్తం ప్రపంచమంతా ఆలోచిస్తుంది. అందుచేత గాంధీజీ అభిప్రాయాలు గుజరాతీల జీవిత ఆచరణలో కనబడతాయని మనం ఆశిస్తు

న్నాము. మామూలుగా అయితే మేము ఎవరినీ ఉద్దేశించి ప్రత్యేకముగా ఏమీ చెప్పే ఆచారంలేదు. మేఘాలు వర్షించినట్లు గానే మేమూ వర్షిస్తూ సాగిపోతాము. కాని ఇవాళ స్వామి ఆనంద్ ప్రత్యేకముగా కోరడంవల్ల గుజరాతీల నుద్దేశించి ముఖ్యమైన కొన్ని విషయాలు చెప్పాను.

ఝురియా, (మానభూమి జిల్లా)
బీహారు
27-12-54.



# భూదాన ఆరోహణము

## 1

## యజ్ఞ నిర్వాహకులు

"రైలుస్టేషను వరకూ వెళ్ళుటకు దయచేసి ఒక పటము గీచి యివ్వగలరా ?" అని ఒకనాడు ఒక విద్యావంతుడైన వ్యక్తిని వినోబా అడిగారు. దాని కా వ్యక్తి సమాధానమిస్తూ తన విషయం భూగోళం కాదనీ, విజ్ఞానమనీ కనుక తాను పటము గీయలేననీ అన్నాడు.

నేడు జ్ఞానం ఈవిధంగా విభజింప బడింది. విజ్ఞానము నేర్చేవ్యక్తికి తన యింటినుంచి స్టేషను వరకూ త్రోవచూపు పటము గీయగలుగునంత భూగోళం కూడ రాదట! నేటి సతిలో జ్ఞానమేకాదు మనుష్యులు కూడా ముక్కలై పోతున్నారు. మానవుని హృదయం, మెదడు, కాళ్ళు, చేతులు యివన్నీ పరస్పర సంబంధం లేకుండా వేనికవి వేరై పోయినవి. చేతులతో పనిచేసే వ్యక్తి మానసిక పరిశ్రమ చేయుటలేదు. మానసిక పరిశ్రమచేసే వ్యక్తి శరీరశ్రమ చేయుటలేదు. మానసిక పరిశ్రమ - శరీరశ్రమ రెండూ చేసేవానికి హృదయం ఉందా అనిపిస్తూంది.

వినోబాజీ చెబుతున్న సామ్యయోగ సమాజమందు హృదయం, మెదడు, చేతుల(శరీరపరిశ్రమ)సంబంధం సక్రమంగా

వుంటుంది. అందు జ్ఞానము, కర్మ, భక్తి—వీటి సమన్వయం జరుగుతుంది. అందు మానవ జీవితం విభజింపబడి యుండదు.

వినోబా జీవితం జ్ఞానం, కర్మ, భక్తి—వీటి త్రివేణీ సంగమము. ఈ మూటి సమన్వయమునుండే సామ్యయోగి వినోబా మనకు భూదాన యజ్ఞ మను భావమును ప్రసాదించిరి. అందుచేత ఈ యజ్ఞ తత్వమును అర్థం చేసుకొనుటకు ముందుగా వినోబా జీవితమును, అందుకు ఆధారములుగా ప్రపంచము ముందు ఉన్నవారి భావములను, ఆచరణను తెలుసుకొనుట అవసరము.

వినోబా తన జ్ఞానయోగ సాధనను కేవలము బౌద్ధిక దృష్టితో మాత్రమే చేయలేదు. ధర్మమును జీవిత క్షేత్రము లోనికి తీసుకరావలెనని ఆయన ప్రయత్నించారు. జీవితమునకు ఎంతగా ధర్మం అవసరమో అంతగా వారు జ్ఞానసాధనచేశారు. ఉదాహరణకు వినోబాజీకి 21 భాషలు తెలుసు. ఐతే తనకు ఇన్ని భాషలు వచ్చునని ముద్రవేయించుకొనుటకు ఆయన ఈ భాషలు నేర్చుకొనలేదు. ప్రపంచములోని అన్ని ధర్మముల మూల గ్రంథములను చదువుటకు ఆయన సంస్కృతము, పాలీ, అర్ధమాగధీ, అరబ్బీ, పారసీ, లేటిన్ మొదలగు భాషలు నేర్చు కున్నారు. భారతదేశంలోని సాధుపురుషుల వాణీప్రసాదాన్ని ఆయా మూలభాషలలోనే గ్రోలుటకు భారతీయ భాషలన్ని టిని నేర్చుకున్నారు. దక్షిణభాషలగు తమిళము, తెలుగు, మళ యాళము, కన్నడము లిపులను వర్ణమాల పటముచూచి ఆయన నేర్చుకొనలేదు. ఆ యా లిపులలో ప్రచురింపబడిన భగవద్గీతలను

ముందుపెట్టుకొని అభ్యసించారు. "ధర్మక్షేత్రే కురుక్షేత్రే" అన్నది ఏవిధంగా వ్రాయబడింది అని ఆ శ్లోకంలోని ఒక్కొక్క అక్షరాన్ని గుర్తిస్తూ ఆయా లిపులను ఆయన నేర్చుకున్నారు.

విజ్ఞానము, చరిత్ర-ఈ రెండూ వినోబాజీకి ఇష్టమైన విషయాలు. జ్ఞానమునకు ఆత్మజ్ఞానము, విజ్ఞానము అనే రెండు రెక్కలున్నాయని అంటారు. ఆ రెండూ లేకుండా జ్ఞానం సంపూర్ణంగాదు. గీత తరువాత గణితము తనకు యిష్టమైన విషయము అని వినోబా పదేపదే చెబుతూ ఉంటారు. వినోబాకి బాల్యంలో తలనొప్పి వచ్చినప్పుడు, గణితములో వారికి ఏకాగ్రత అబ్బిన కారణమున, గణితము వారి తలనొప్పికి ఔషధమైనది. వయస్సు వచ్చిన తరువాత ఆధ్యాత్మిక తత్వమును అర్థము చేసుకొనుటకు ఆ గణితమే సాధనమైనది. "పని తక్కువ జరిగినా అది తానే చేశాననే అభిమానము లేకపోతే ఆపని ఎక్కువ జరిగినట్లే లెఖ్ఖ. పని ఎక్కువచేసినా అదంటే అభిమానము ఉంటే, ఆ అభిమానముకొద్దియైనా దాని విలువ పడిపోతుంది. నాలుగు వీశెల సేవచేసి 40 వీశెల అభిమానము పెట్టుకుంటే ఆ సేవకువచ్చే విలువ 8 తులములై పోతుంది. అభిమానము లేకుండా ఒక్క తులము సేవ చేసినా అభిమానం లేని కారణాన ఆ సేవకువచ్చే విలువ ఎన్నోరెట్లు ఎక్కువౌతుంది. అంటే సేవాశక్తి అనంతమౌతుంది," అని వినోబా అంటారు. వినోబాకి గణితమంటే ఉన్న ప్రేమవల్ల దేశంలోని భూమిలేని వారికి ఎంతభూమి కావాలి, ఎన్ని దానపత్రాలు కావాలి, ఈ దానపత్రాల సేకరణకు ఎంతమంది కార్యకర్తలు కావాలి

మొదలగు విషయముల మథన అంతా వారి మనస్సులో నిరంతరం సాగుతూ ఉంటుంది. ఈ విధంగా వినోబా జ్ఞానయోగాన్ని ఎంతగానైనా వర్ణించవచ్చును.

వారికి సంగీతము, చిత్రకళల్లోకూడ ప్రవేశముంది. ఈ జ్ఞానసంపాదనలో వినోబాకి ఏకాగ్రత చాలా సహాయకారి అయినది. ఏకాగ్రత కారణమున గంటల తరబడి ఆయన నిర్విఘ్నంగా వడుకుతూ ఉంటారు. చదువు మొదలుపెడితే ప్రక్కన ఎవరయినా నిలుచున్నా వారికి తెలియదు. ఏకాగ్రత వలెనే అవిద్య * వలనకూడా వారికి సహాయం లభించింది. జ్ఞాన సంపాదన కొరకు స్మరణశక్తి అవసరం ఎంతగా ఉందో అంతగా సాధనలో నిరుపయోగమైన విషయాలు మరచిపోయే శక్తి గూడా అవసరమని వారి అభిప్రాయము. వాటిని సంగ్రహించి ప్రయోజనమేముంది ? మరచిపోయే కళనుకూడా ఆయన లోబరచుకున్నారు.

ఇవన్నీ చెబుతున్నానంటే వినోబా కేవలం జ్ఞానయోగి అని అర్థంగాదు. ఆయన నిరంతర కర్మయోగి కూడా. "నువ్వు ఎవరిసేవ చేస్తావో వారివలె తయారు కావలెను. తల్లి పిల్లవానిని లేవనెత్తాలంటే తాను తిన్నగా నిలుచుని లేవనెత్త లేదు. సేవకుడు ప్రజలను అభివృద్ధి చేయాలనుకుంటే ప్రజలతో ఐక్యమవకుండా ఆపని చేయలేడు. దరిద్రనారాయణునితో ఐక్యమవ వలసి యున్నది." ఇవి వారి కర్మయోగంలోని

---

* అవిద్య : 'ఈశావాస్యవృత్తి'లో అవిద్య అంటే అనవసరమైన జ్ఞానము యెడల అజ్ఞానము అని అర్థము చెప్పారు.

మూల సూత్రములు, ఈ సూత్రములపైనే వారి జ్ఞానయోగం ఆధారపడి ఉంది. ఈ ఆధారముపైనే 32 సంవత్సరాలుగా వారు చేసిన గ్రామసేవ నిలిచి ఉంది. దీన్ని మాధ్యమంగా గైకొని స్వయంపోషకత్వము, ఋషుల వ్యవసాయము, కాంచన విముక్తి ప్రయోగాలు సాగాయి. తన ఇరుగు పొరుగున ఉండే పేదవారు ఎవరాయని ఆయన ఆలోచించారు. రాట్నం వడికి పొట్టపోసుకునే కొందరు పేద మహమ్మదీయ వితంతువులపై వారిదృష్టి మళ్ళింది. తకిలీ వడికి ఎందుకు జీవించ కూడదు అని ఆయన అనుకున్నారు. ఎంతో ఏకాగ్రతతో, కూర్చున్న చోటునుంచి కదలకుండా ఉదయమునుంచి సాయంత్రము వరకు తకిలీ వడుకుతూఉండేవారు. తకిలీలో నిబిడీకృతమైన శక్తులను వారు బయటకు తీశారు. ఐతే ఫలితంగా ఆయనకు రోజంతా పనిచేస్తే 5 కాన్లు మాత్రమే వచ్చేది. 5 కానులే సంపాదిస్తే 5 కాన్లలో దమ్మిడీ కూడా ఖర్చుపెట్ట కూడదనుకునే వారు. రొట్టె ఉప్పులో నంజుకు తిన్నారు. ఎండురొట్టె, కూరాకు మాత్రమే వాడారు. దానివల్ల శరీరం క్షీణించినా ప్రయోగాన్ని వారు క్షీణించనివ్వలేదు.

తకిలీమీద వడకడంవల్ల శరీర శ్రమ తగినంతగా జరుగుట లేదు. అందుచేత అందరికంటె ఎక్కువ పరిశ్రమ చేసేవారితో తాదాత్మ్యం పొందడం ఎలాగా అని ఆలోచించ నారంభించారు. జైలులో వారికి అందుకు అవకాశం లభించింది. చేతులు బొబ్బలెక్కి రక్తం కారేవరకు ఆయన రాళ్ళు పగులగొట్టే పని చేశారు. గంటకాదు, రెండు గంటలుకాదు, నిరంతరం గంటల

తరబడి, నెలల తరబడి అదేపని చేశారు. అదేవిధంగా అందరికంటె నీచులు అనబడే పాకీవారితో కలిసి వారు స్వయంగా పాకీ వారయ్యారు. సంవత్సరాల తరబడి పవనారు ఆశ్రమం ప్రక్కన ఉన్న సురగాంవ్ గ్రామంలో ఒంటరిగా సఫాయి చేశారు. పనిసే ఆయన పూజ అనుకున్నారు.

చేతలు, మస్తిష్కము యొక్క అపూర్వసంయోగముతో పాటు హృదయం కూడా భక్తి రూపంలో ఉప్పొంగి ఐక్యమైంది. భక్తి అంటే ధూప, దీప, నైవేద్యములు, తిలకము, మాలలు కాదు. భక్తి అంటే భూతమాత్రుల యెడ సమ్యక్ దృష్టి; ప్రతి ఒక్కనిలో తన రూపాన్ని చూచుకోవడం, అందరిలో తన ఆత్మను పరీక్షించుకోవడం. పుష్పముల సుగంధిలో ప్రతి ఒక్కరు ఈశ్వరుని చూడగల్గుతారు. ఐతే ముండ్ల మొనలలో గూడ దైవత్వాన్ని చూడగల్గువారే నిజమైన భక్తులు. సజ్జనుని సజ్జనత్వంలో ఈశ్వరుడు అందరికీ కనబడ గల్గుతాడు. కాని దుర్జనుని దుర్జనత్వంలో గూడ ఈశ్వరేచ్ఛ పూర్ణ మవుతున్నట్లు చూడగలిగే వారిదే నిజమైన భక్తి అవుతుంది.

ఉత్తర ప్రదేశ్‌లో వినోబాయాత్ర సాగుచుండెను. ఒక రోజున దగ్గర ఎవరూలేరు. అందరూ భోజనం చేయుటకు వెళ్ళారు. ఆ సమయంలో ఒక నవయువకుడు వినోబా వద్దకు వచ్చాడు. "వినోబా! భారత దేశాన్ని విభజించుటచేత గాంధీజీకి ఏదశ పట్టిందో, అదే దశ మీకూ పట్టబోతోంది. ఎందు చేతనంటే మీరు భూమిని ముక్కలు చేస్తున్నారు. మొదటిసారి గానూ, చివరిసారిగానూ మీకు సూచన యిచ్చుటకే నేను

వచ్చాను. మీప్రాణం ప్రమాదములో ఉంది'' అని ఆ యువకుడు కనుబొమలు చిట్లించి అన్నాడు.

వినోబా ఆ వ్యక్తిలోనూ తన ఆత్మనే చూచి మనస్సులోనే నమస్కరించారు. చంపుతానని భయపెట్టే వ్యక్తిలో కూడా తన ఆత్మే దర్శనమౌతుందంటే అతను భక్తియోగి ఎలా అవుతాడు? ఈ విధంగా వినోబా జీవితంలో జ్ఞానము, కర్మ, భక్తి—వీటి సంగమం జరిగింది. కనుక జీవిత చరిత్రకు చెందిన విషయాలు వేరే చెప్పనవసరంలేదు. చరిత్రకంటె శీలం గొప్పది.



# 2

# క్రమానుగతంగా ఉద్యమ అభివృద్ధి

సామ్యయోగి అగు వినోబా జీవిత తపస్సునుండి వచ్చిన ఫలమే భూమిదాన యజ్ఞము. దాని వెనుక జ్ఞానము, కర్మ, భక్తి – వీటి సంస్కృతి, యుగనాదము ఇమిడి యున్నవి. దాని ద్వారా ప్రపంచము–మానవుడు, మానవసమాజము ఒకదాని సరసనే ఒకటి మారుటకు ప్రేమమయ మార్గమును లభించినది. చిన్న చిన్న పిల్లలుగూడా "భూదానయజ్ఞమును సఫలం చేస్తాం" అనే ఉద్ఘోషతో భూమ్యాకాశములను దద్దరిల్ల జేస్తున్నప్పుడు, భూదానయజ్ఞంలోని అభినవ ప్రకరణాన్ని తమ కళ్ళతో చూచుటకు ప్రపంచములోని ప్రతిమూలనుండి స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలు అఖండమైన పంక్తిలో చేరుతున్నప్పుడు – భూదానయజ్ఞముయొక్క విభిన్న దృక్కోణములనుండి విషయమును సంపూర్ణముగా అర్థముచేసుకొనుట చాల అవసరము.

స్వరాజ్యంలోని ఉషఃకాల సమయం భారతవర్షానికి గంభీరపర్వమై యుండెను. మన ప్రజాధాని ఢిల్లీలో స్వాతంత్ర్య మహోత్సవ జ్యోతులు రంగురంగుల కాంతులతో ధగద్ధగాయమానంగా మెరుస్తున్నప్పుడు, ఎవరి తపోఫలంగా మనకు

స్వాతంత్ర్యం సిద్ధించిందో అట్టి రాష్ట్రపిత నవఖాలీలో మతకల్లోలపు దావానలాన్ని ఆర్పుటకు ఒంటరిగా వెళ్ళినారు. దేశం ముక్కలైంది; లక్షలకొద్ది భారతవాసులు తమకుటుంబాలను వెంటపెట్టుకుని ఒకచోటనుంచి మరొకచోటికి తరలిపోతూయుండిరి. మదమెక్కిన మతమౌఢ్యం నగ్ననృత్యం చేయనారంభించెను. అన్నదమ్ములు ఒకరినొకరు సర్వనాశ మొనరించుకొనుటలో మునిగిపోయిరి. తల్లుల, సోదరీమణుల మానం అపహరింపబడుచుండెను. ఈ వైరితనపు కెరటాలే మన జాతి పితను మననుండి దూరంగా లాగివేసినవి. మానవత్వపు దీపశిఖే ఆరిపోయిందా అన్నట్లయింది. నలువైపులా అంధకారం ఆవరించెను. ఒక విధంగాచూస్తే బాపూజీ సంపూర్ణజీవితమే ఒక కరుణాంత నాటకమా అన్నట్లు కనబడుతోంది. ఏకాకియై వారుచేసిన తపోకృషిఫలితంగా మనకు స్వరాజ్యమైతే వచ్చింది, కాని బాపూజీ ఆశించిన స్వరాజ్యం మనకు లభించలేదు. ఆ వచ్చిన స్వరాజ్యముపై రక్తపుడాగులు పడ్డాయి. అవిశ్వాస మనే మాలిన్యం చేరింది. అసమానత్వ మనే కళంకం అంటింది.

ఆ సమయములో బాపూజీ సహచరుల స్థితిగూడ కొంత విచిత్రంగా ఉండెను. వారికి అతి సన్నిహితులయిన కొందరు రాజ్యాధికారపు కళ్ళెమును చేత ధరించారు. ఐతే దేశమందు తలెత్తిన అనేక పెద్ద పెద్ద సమస్యలను ఏదో విధంగా నొక్కిపెట్టి ఉంచడంలోనే వారి శక్తిఅంతా ఖర్చు కాజొచ్చెను. గాంధీజీవలె సమస్యలను పరిష్కరించుకొనుటకు అహింసాయుత మార్గ మేదీ వారివద్ద లేకుండెను. అందుచేత ప్రాతవిధానమునే, అంటే వీరికి

వ్యతిరేకంగా ఆంగ్లేయప్రభుత్వం ప్రయోగించిన లాఠీలు, జైళ్ళు, తుపాకులు మొదలగు వాటినే, వీరూ ప్రయోగించసాగారు.

మరికొంతమంది గాంధీజీ అనుయాయులు ప్రభుత్వంలో ఉన్న తమ సహచరులు చేస్తున్న పనులను విమర్శిస్తూ తాము ప్రభుత్వంలోనికి వెళ్ళితే ఎలాగుండేదో నని ఆలోచించసాగారు. ఐతే వారివద్దగూడ ప్రజలలో పురుషార్థానికి ప్రేరణ కల్పించే కార్యక్రమం లేకపోయింది. తమను నిర్మాణ కార్యకర్త లనుకునే గాంధీజీ అనుయాయులు తమతమ సంస్థలను నిర్వహించుకుంటూ కూర్చుండిరి. అప్పటి దేశస్థితియెడల వారికి అసంతృప్తి ఐతే చాలా ఉండెను. కాని అందుకు పరిష్కార మార్గ మేమీ లేకుండెను. కొంతమంది నిర్మాణ కార్యకర్తలకు తాముచేస్తున్న పని ఎడల సంతృప్తి ఉన్నప్పటికి దానియెడల దేశశక్తి పెరుగు చున్నట్లు కానరాకుండెను.

దేశం ఇట్టి అయోమయ పరిస్థితుల్లో ఉండగా వినోబా తన పరంధామ ఆశ్రమంలో కాంచనముక్తి, ఋషిసేద్యము ప్రయోగములు చేయుచుండెను. దేశంలోని ఈ సమస్య లన్నిటికీ మూలములో ఉన్నది అసమానత్వమని వారు గుర్తించిరి. ఈఅస మానతలను మొదలంటా నరుకుటకు తన చిన్ని పరిశోధనాగా రములో చేయు ప్రయోగముల శక్తి చాలకుండెను. దేశవ్యాప్త మయిన ప్రయోగశాలలో సమూహంపై ప్రయోగించ వలసిన అవసరం పర్పడియుండెను. దేశానికి నవజీవనాన్ని ప్రసాదించి చైతన్యాన్నిచ్చి స్వాతంత్ర్యసిద్ధిలో ఎంతగానో సహాయపడిన గాంధీజీ అహింసా మంత్రం గాంధీజీ శరీరంతోపాటే అదృశ్యమై

పోయిందా అనే ప్రశ్న చారిత్రాత్మకదృష్ట్యా భారత దేశం ముందు ఉండినది. ఏ అహింస నయితే బుద్ధుడు, మహావీరుడు, ఏసుక్రీస్తు; సాధు పుంగవులు, మహాపురుషులు తమ తపస్సు ద్వారా వ్యక్తిగత జీవితములో సఫల మొందించిరో, ఏ అహింసనయితే గాంధీజీ రాజకీయ రంగంలో ప్రవేశపెట్టిరో ఆ అహింస ఇంత దూరంవచ్చి ఆగిపోతుందా ? సంపూర్ణ మానవజీవితాన్ని స్పర్శించే ఈ మూలభూతమైన ప్రశ్నకు సమాధానాన్ని అన్వేషించడంలో వినోబాజీ నిమగ్నమైయుండిరి. భూదానయజ్ఞంలో వారికి ఈ ప్రశ్నకు సమాధానం లభించింది. అందుచేతనే తెలంగాణాలో భూదానయజ్ఞం ఆరంభమైననాటి సంఘటనను వినోబా అహింసా సాక్షాత్కారంగా పేర్కొన్నారు.

పోచంపల్లి : 18-4-1951 కి పూర్వం తెలంగాణా లోని ఈ చిన్నగ్రామం పేరైనా బయటివాళ్లెవ్వరూ విని యుండరు. పగటిపూట ప్రభుత్వ పోలీసుల జులుం; రాత్రిపూట కమ్యూనిస్టుల హింసాకృత్యాలు—ఈ రెండింటితో ఆప్రాంత మంతా భీభత్సం వ్యాపించి యుండెను. శివరాంపల్లి సర్వోదయ సమ్మేళనానంతరం వినోబాజీ వర్ధా తిరిగి వెళ్ళుతూ తెలంగాణా చేరిరి. పోలీసులు సాయుధులై పోవు ప్రదేశమునకు రామనామం తప్ప మరో ఆధారమేమీ లేకుండా వినోబాజీ వెళ్ళిరి. ఇంటింటికి తిరిగి పిరికితనాన్ని వదలమనీ ప్రేమభావాన్ని పెంచమనీ ప్రచారం చేశారు.

మధ్యాహ్నం హరిజనుల సభ ఒకటి జరిగింది. వినోబా వెళ్ళిన ప్రతీ గ్రామంలోనూ ఇలాంటి సభలు జరుగుతూ

యుండేవి. గ్రామంలోని పేదవారిని కలిసి వారి కష్టసుఖము లను, వారి కోర్కెలను, అవసరములను అడిగి తెలుసుకున్నారు. ఆ పేదలు తమకు 80 ఎకరాలు కావాలనీ, ఆమాత్రం యిప్పించితే తమకు సరిపోతుందనీ అన్నారు. అది విని "సరే! మీకు భూమి యిప్పించడానికి ప్రయత్నిస్తాను" అని వినోబా అన్నారు. మొదట్లో ప్రభుత్వం ద్వారా భూమి నిప్పించ ప్రయత్నించాలని వినోబా తలచారు. మరల గ్రామస్థులను గూడా అడిగి చూద్దామనుకుని అప్పుడే ఆ సభలో "ఈ పేద వారికి ఎవరైనా భూమి నివ్వగలరా" అని వినోబా ప్రశ్నిం చారు. వినోబా అడగడంతోనే రామచంద్రా రెడ్డి అనే సోద రుడు లేచి నిలుచుని తన తండ్రిగారు దానం చేయవలసిందిగా కొంత భూమిని కేటాయించారని, అది తాను యివ్వగలనని అన్నారు. ఈశ్వరుడే వారినోట పలికినట్లనిపించింది. వినోబా ఆమాటను అందుకున్నారు. "భగవంతుడు సూచన చేయవలసి యుండెను. ఈ విధముగా చేశా"డని వినోబా తన మనస్సులో అనుకొనెను. ఆ భగవత్సంకేతాన్ని వినోబా గమనించి యుండక పోతే సమిష్టిగా అహింసాత్మక క్రాంతిని ప్రయోగించే ఈ నూతనాధ్యాయం వ్రాయబడి యుండేదిగాదు. ఇదే భూదాన యజ్ఞ గంగోత్రి.

స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత కొంతమంది నిర్వాసు లకు ప్రభుత్వంద్వారా భూమి నిప్పించడంలో ఉండే కష్టాలు వినోబా స్వయంగా అనుభవించారు. అందుచేత ప్రజలనుండే ఆయన భూమిని అర్థించారు.

ఈ సంఘటన అయితే చిన్నదే, కాని వినోబాకు అందులో ఈశ్వర సంకేతం కనబడింది. ఇంతవరకు దేవస్థానాలకు, విద్యాలయాలకు, ఇతర సార్వజనీనికోపయోగసంస్థలకు భూములు అడగబడ్డాయి. అంతేగాని దరిద్రనారాయణునికొరకు భూముల నడగడం, దానమడిగి భూసమస్యలను పరిష్కరించేందుకు సాహసించడం విచిత్రం. కాని భగవత్సంకేతం లభించింది. వినోబాజీ దానమడుగుటకు వెనుకాడితే పిరికివారయ్యేవారు. వారు అడిగారు, భూములు వచ్చాయి. ఇదంతా అద్భుతంగా ఉంది. సంవత్సరాల తరబడి కొట్లాడుకునే సోదరులు పరస్పరం ఆలింగనం చేసుకున్నారు. శతాబ్దాల తరబడి వేరుబడ్డ భూమాత పుత్రులకు తమ తల్లి వసుంధరను 'అమ్మా' అని సంబోధించే అధికారం సంప్రాప్తమైంది. పోచంపల్లినుంచి సేవాగ్రాం చేరేవరకు రెండు నెలలలో 12 వేల ఎకరాలభూమి దానంగా లభించింది.

తెలంగాణాలో భయాందోళనలవల్ల భూమిని దానంగా యిచ్చారని అప్పుడు ప్రజలన్నారు. భూమి తమ చేతుల్లో ఉంటుందో, ఉండదో అనే సందిగ్ధవాతావరణం ఏర్పడియుండుట చేత వినోబాకి భూమినిచ్చారు, గాలికిపోయే పేలపిండిని కృష్ణార్పణం అన్నారని కొందరాక్షేపించారు.

వినోబా ఈ ఆక్షేపణకు నోటితో సమాధానం చెప్పలేదు. వారి ఉత్తర భారతయాత్రే దీనికి సమాధానం చెప్పింది. పంచవర్ష ప్రణాళిక గురించి సంప్రదించుటకు నెహ్రూ వినోబాను ఢిల్లీ పిలిపించారు.. 1951 సెప్టెంబరు 12 వ తేదీన తిరిగి పదయాత్రకుగాను పవనారునుండి బయలుదేరారు. కమ్యూనిస్టుల

హింసాకృత్యాలు లేనటువంటి, అసమానతలున్ననూ హింస లేనటువంటి మధ్యప్రదేశ్, రాజస్థాన్, ఢిల్లీ ప్రాంతాలలోని గ్రామాలనుండి వినోబాకు రెండు నెలలలోనూ షుమారు 18 వేల ఎకరాల భూమి లభించింది. సర్వోదయానికి పూర్వం సర్వ నాశనానికి దారి తాము పట్టబోమని దేశం నిరూపించింది. బుద్ధుడు, మహావీరుడు, గాంధీ భారతీయ ప్రజాహృదయంలో వెలిగించిన అహింసాజ్యోతి యింకా ఆరిపోలేదు. అంతరాళంలో పీఠంవేసుకుని హృదయశాయియైన భగవంతుని మేలుకొలిపే భక్తులు వారికి కావాలి. వినోబా పవిత్రవాణి భారతీయ ఆత్మను మేల్కొల్పింది.

1951 అక్టోబరు 2వ తేదీన వినోబా మధ్య ప్రదేశ్‌లోని 'సాగర్' పట్టణం చేరారు. అచట మధ్యప్రదేశ్ కార్యకర్తల సమావేశం జరిగింది. భూదానయజ్ఞ చరిత్రలో ఈ సమావేశానికి ఒక ప్రత్యేక ప్రాముఖ్యత ఉంది. ఈ సమావేశంలోనే వినోబా దేశం మొత్తంమీద 5 కోట్ల ఎకరాలు సేకరించాలని తన అభిప్రాయాన్ని బహిరంగ పరిచారు. అది విన్నవారు ఆశ్చర్య చకితులయ్యారు. పత్రికల్లో ఈ అంకెలు చూచిన వారిలో కొందరు పొరపాటున రెండు శూన్యములు ఎక్కువ పడ్డాయేమోనని అనుకున్నారు. వినోబాకు అంతవరకు పూర్తిగా 50 వేల ఎకరాలైనా లభించలేదుగాని ఒక్కసారిగా 5 కోట్ల వరకు ఆయన అంకె చెప్పారు. గణితజ్ఞుడగు వినోబా తన యీ లెఖ్ఖ తెలంగాణాలోనే వేసిపెట్టుకున్నారు. దేశంలో ఉన్న 7, 8 కోట్ల భూమిహీనులకు పని కల్పించుటకుగాను కనీసం 5

కోట్ల ఎకరాల భూమియైనా కావాలిగదా? భూదానయజ్ఞం కొద్దిమందికొరకు బిచ్చమెత్తే పనికాదని, దేశంలోని భూమిహీను లందరికీ జీవన భృతిని కల్పించేందుకు అవసరమగు భూమిని సంపాదించే విప్లవాత్మక ఉద్యమమని నిరూపించవలసి యున్నది. అందుచేత 5 కోట్ల ఎకరాలకంటె తక్కువ కోర వీలులేదు. ఇంకా ఇంతవరకు వినోబాకు చాలా తక్కువ భూమేగదా దొరికింది. అప్పుడే 5 కోట్ల ఎకరాలు కావాలని అడుగుటకు ఎందుకు సాహసిస్తున్నారని కొందరనవచ్చు. ఇందులో ఆలో చించ వలసిందేమంటే దేవునిమీద భారంవేసి మొదట్లోనే పని ప్రారంభించిన వ్యక్తికి దేనికైనా వెనుకాడ వలసిన పని ఏముంది? పిల్లవానికి ఆకలి నిచ్చిన దేవుడే తల్లి వశాన పాలనూ యిస్తాడు. అందుచేత దానమడుగవలెనని తనకు ప్రేరణ కల్పించిన దేవుడే ప్రజలకు యివ్వవలెననే బుద్ధి కల్పించ గలడనే వినోబా అంటారు. రవిబాబుతో గొంతు కలిపి ఆయన ఈ క్రింది గీతాన్ని పాడుతున్నారా అనిపిస్తుంది.

"తోమార్ పతాకా జారే దావో
తారే బహి బారే దావో శక్తి!"

"ఎవరికయితే నీ పతకాన్ని నీ విస్తున్నావో వారికి దానిని ఎత్తి పట్టుకొనే శక్తిగూడా ఇమ్ము."

పోచంపల్లినుంచి సాగర్ వరకు భూదానోద్యమం మొదటి మెట్టు అని చెప్పవచ్చును. దీనిని సిద్ధాంత నిరూపణ కాలము అని అనవచ్చును. ఆలోచనాయుత నిత్యవికాసమయ స్వభా వమువలన వినోబా రోజూయిచ్చే ఉపన్యాసములలో నిత్యనూతన

అభిప్రాయములు మనకు లభిస్తూనే ఉంటాయి. ఐనప్పటికి పోచం పల్లినుంచి సాగర్ వరకు ఆయన ఇచ్చిన ఉపన్యాసములలో భూదాన యజ్ఞ తత్త్వాన్ని సంక్షేపంగానూ, సమగ్రంగానూ వివరించారు. భూదాన యజ్ఞం మిగతా చరిత్రను ఈ క్రింది విధముగా కాలఖండములలో మనము విభజింపవచ్చును.

1. సాగర్ నుంచి సేవాపురివరకు — జన హృదయ ప్రవేశ కాలము.
2. సేవాపురినుండి బీహారువరకు—ప్రజోద్యమ కాలము.
3. బీహారుయాత్ర—ఏకాగ్ర ప్రయోగకాలము.
4. ఉత్కళయాత్ర—భూక్రాంతి యాత్ర.
5. ఆంధ్ర-హైదరాబాదు—ముక్త విహారము.

1952 ఏప్రియల్ 13 నుండి 16 వరకు కాశీ దరినున్న సేవాపురిలో సర్వోదయ సమ్మేళనం జరిగింది. సాగర్ నుంచి సేవాపురి వరకు సాగిన వినోబా యాత్రను జనహృదయ ప్రవేశ కాల మన్నాముగదా! ఈ 6 మాసములలోను భూదాన సేకరణలో దాన మిచ్చేవారు మరియు దానిని స్మరించుకునేవారి జీవితాలను పావనముచేసే పవిత్ర సన్నివేశములు ఎన్నో సంఘటిల్లాయి. బహుశా యిన్ని సన్నివేశములు మరి ఏకాలములోనూ జరిగి యుండలేదేమో! చిన్నభూమందులు తమ హృదయాలను వొంపి దాన మివ్వడం, తమకున్న మొత్తం సంపదనంతా దానంగా సమర్పించడంవంటి సంఘటనలు హృదయ పరివర్త నాన్ని సూచించు అపూర్వమగు నమూనాలను మనముందుంచుచున్నవి. ఈ పావన సన్నివేశములలో ఒక్కొక్క దాని

కుండే మహాత్తు పురాణాలలోని ఏ సన్నివేశానికీ తీసిపోదు. పిడకలుచేసి జీవితాన్ని వెళ్ళబుచ్చుకునే మంగరూ గ్రామ హారి జనుడు తనకున్న 21 సెంట్ల భూమిఅంతా యిచ్చివేశాడు. తన కున్న కొద్దిభూమిని దాన మివ్వడానికి నైనితాల్ వచ్చిన ఆ ముదుసలి రాత్రంతా ఎముకలు కొరికే చలిలో అలాగే కూర్చుంది. కళ్ళు కనబడకపోయినా జ్ఞాన చక్షువులు గల్గిన రామ చరణ్ ఎవరిదో ఎద్దుబండి కట్టించుకుని రాత్రికి రాత్రేవచ్చి తన భూమి దానమిచ్చి వెళ్ళాడు. ఈ ఒక్కొక్క సంఘటనా మనకు విదురుని శాకములను, శబరి రేగుపండ్లను, కుచేలుని అటుకులను స్మృతికి తెస్తున్నవి. ఆరోజుల్లో వినోబా గ్రామ గ్రామానికీ, యింటింటికీ వెళ్ళేవారు. ఆరోజుల్లో యిప్పటివలె ఆయన వెనుక యింత జనసమూహం ఉండేదిగాదు. అందుచేత ప్రజల హృద యాల వరకు చేరి వారి హృదయాల్లోని రాముణ్ణి మేల్కొలిపే వారు.

జనహృదయంతోపాటు కవిహృదయంగూడా చైతన్య వంతమైంది. ఝాన్సీలో ప్రముఖ హిందీకవులందరూ సమావేశమై తమ కవితాలేఖినిద్వారా భూదానోద్యమానికి సహకరిస్తామని వాగ్దానం చేశారు. ఈ కాలంలో జరిగిన రెండు ప్రముఖ సంఘ టనలను ఉల్లేఖించడం అవసరం. మొట్టమొదట ఢిల్లీలో వినోబా మకాము, రెండవది మధుర కార్యకర్తల సమ్మేళనము. ఢిల్లీలో ప్లానింగు కమీషన్‌తో వినోబా గంటల తరబడి చర్చించి తన అభిప్రాయములను వారిముందు పెట్టారు. అప్పుడు వినోబా నిరుద్యోగ సమస్యగురించి చేసిన సూచనలను ద్వితీయ పంచవర్ష

ప్రణాళికా రచనలో దృష్టియుంచుకుంటామని ప్రభుత్వము అన్నట్లుగా చెప్పుకుంటారు.

మథురసమ్మేళనంలో ఉత్తరప్రదేశ్ లోని కార్యకర్తలు తమ ప్రాంతంలో కోటి ఎకరాల భూమిని సేకరించాలనే నిర్ణయానికి మొదటి వాయిదా రాబోయే సంవత్సరములోగా 5 లక్షల ఎకరాలు భూమిని సేకరించుటకు నిర్ణయించారు. ఒక నిశ్చయమైన సమయంలో నిశ్చిత ప్రమాణంలో భూమిని సేకరించవలెనని సంకల్పించుట అదే మొదటిసారి.

భూదానయజ్ఞ దృష్టితో చూస్తే సేవాపురి సమ్మేళనం చాలా ప్రాముఖ్యత గలది. గాంధీజీ నిర్యాణానంతరం సర్వోదయ సమాజం స్థాపించబడింది. ప్రతిసంవత్సరం ఒకసారి సర్వోదయ సేవకులందరూ సమావేశమై తమపనిని గురించి కలిసి ఆలోచించుకునేవారు. ఆవిధంగా ఇది మూడవసమ్మేళనము. ఇతర సమ్మేళనములకు దీనికీ ఒక ముఖ్యమైన తేడా ఉంది. కలిసి ఆలోచించుకొనుటతోపాటు కలసి కార్యక్రమంలోకి దిగవలెనని కూడ ఈ సమ్మేళనంలో నిశ్చయించిరి. సేవాపురి సమ్మేళనంలో సర్వోదయసమాజ కార్యదర్శి శ్రీ శంకరరావు దేవ్ ఒక మహత్వపూర్ణసంకల్పాన్ని ప్రతినిధుల ముందుంచారు. దేశంలోని 5 లక్షల గ్రామాలలో, ప్రతీగ్రామంలో ఒక భూమిలేని కుటుంబానికి భూమి నివ్వాలనుకుంటూ అందుకు కావలసిన 25 లక్షల ఎకరాల భూమిని ఒక సంవత్సరంలో సేకరించాలని వారు అన్నారు. అందుచేత అప్పుడు దేశంలోని చాలాప్రాంతాలు తమతమ ప్రదేశంలో ఎంతెంత భూమి సేకరించాలనేది నిశ్చయం

చేసుకున్నవి. ఈ పనిని వ్యవస్థితరూపంలో కొనసాగించుటకు గాను వివిధప్రాంతాలలో భూదానసమితులు ఏర్పరచ బడ్డవి. "ఇప్పుడు నేను సహస్రబాహుడ నౌతున్నాను. ఇదివరకు ఒంట రిగా ఏపనైతే చేయుచుండెడివాడనో దానిని దేశంలో మూలమూలలగూడా వేలకొద్ది కార్యకర్తలు తమతమ శక్త్యాను సారంగా యిప్పుడు చేయగలరు" అని వినోబా అన్నారు.

భూదానోద్యమంలో ఇది ఒక క్రొత్త ప్రవాహం. ఉద్యమం హృదయ ప్రవేశ దశను దాటి ప్రజోద్యమమైంది. దేశమంతా నూతన వాతావరణం వ్యాపించ సాగింది. వినోబా పేరు తెలియని చోటనుండి గూడా భూదాన యజ్ఞంలోనికి ఆహుతులు రాసాగాయి. శంకరరావుదేవ్, శ్రీకృష్ణదాస్ జాజూ, ధీరేంద్ర మజుందార్, దాదా ధర్మాధికారి వంటి తాత్వికులు, కర్మనిష్ఠులగు వ్యక్తులు భూదాన సందేశాన్ని దేశం లోని మూలమూలలకు గొనిపో మొదలిడినారు. గాంధీజీ అహింస తిరిగి ఒకసారి సజీవమై సక్రియ రూపాన్ని ధరిస్తుందని దేశం తొలిసారిగా భావించింది.

ఉత్తర ప్రదేశ్‌లో వినోబాకు అడుగడుగునా భూమి లభించ మొదలు పెట్టింది. తెలంగాణాలో వినోబాకు సగటున రోజుకి 200 ఎకరాలు లభిస్తూ యుండేది. సేవాపురి వరకు ఈ సగటు రోజుకి 300 వరకు పెరిగింది. పోనుపోను ఈగతి పెరిగింది. సగటు సేకరణ రోజుకి 4, 5 వందలు వరకు పెరుగు సరికి ప్రజలు ఆశ్చర్య పోవడం మొదలు పెట్టారు. ఆపైన దినసరి సగటు వెయ్యి ఎకరాల వరకు పెరిగింది. సుల్తాన్‌పూర్ జిల్లాలో

వినోబాకు 5 రోజులలో 17 వేల ఎకరాల భూమి లభించింది. ఈ విధంగా ఉత్తరప్రదేశ్ యాత్రలో పూర్తి శక్తిని వినియోగించి కృషిచేసిన భూదానయజ్ఞం ద్వారా భూసమస్య పరిష్కారం కాగలుగుతుందని కార్యకర్తలకు స్పష్టమైంది. తులసీదాసు నివసించిన బాందా జిల్లాలోనూ, అలహాబాదు, మీర్జాపూరు జిల్లాలలోనూ వినోబాపై దానపత్రాల వర్షమే కురిసింది. కాన్పూరు జిల్లాలో ప్రవేశించిన రోజునే, ఆజిల్లానుంచి వినోబా మొదటి వాయిదాలో అడిగినంత భూమి లభించింది. కాన్పూరు పట్టణ వాసులు 2 వేల ఎడ్లజతల నిచ్చుటకు వాగ్దానం చేసిరి. వినోబా యిచ్చోటనే తన చేతులతో తొలిసారిగా భూ వితరణ చేశారు. ఐతే ఈ కాలంలో జరిగిన మహత్వపూర్ణ సంఘటన "భూమంతా గోపాలునిదే" అనే వాక్యాన్ని సార్థకంచేసే మంగరూట్ గ్రామదానం. ఇక్కడుండే పట్టాదారులందరూ తమకుండే మొత్తం భూమిని భూదాన యజ్ఞంలో సమర్పించారు. ఆ గ్రామజీవనం తిరిగి క్రొత్త పునాదులపై ఆరంభమైంది. ఎవరు ఎంత భూమిని దున్నుతారు, ఎవరు ఎంత ఉత్పత్తి చేయాలి, ఏపరిశ్రమను ఎవరు చేస్తారు మొదలైన ప్రశ్నలను గ్రామ దృష్టితో ఆలోచించ సాగారు. భారతదేశం తన లక్షలకొద్ది గ్రామాలలో నివసిస్తోందని గాంధీజీ ఎన్నోసార్లు చెప్పారు. వినోబా ఈఅభిప్రాయాన్నే క్రొత్తభాషలో తెలిపారు. దేశ ప్రణాళికా రచన ఢిల్లీవంటి పట్టణాలలో కాక మంగరూట్ వంటి గ్రామంలోనే జరగాలని ఆయన అన్నారు. ఈ అభిప్రాయానికి ఆచరణ యోగ్యమైన రూపము నిచ్చుటకు

తగిన వాతావరణం ఏర్పడింది. భారతీయరైతు మేల్కొంటు న్నాడు. తన కుటుంబమనే భావాన్ని విస్తృతం చేసుకుని మొత్తం గ్రామాన్నంతా పరివారముగా తలుస్తున్నట్లు మంగ రూట్ గ్రామంలోచేసిన పనినిబట్టి నిరూపించు కొంటున్నాడు. గ్రామమంతటిగురించిఆలోచన, గ్రామస్తులందరికీ—పని ఈవిధంగా స్వార్థం విస్తృతం కాసాగింది.

గ్రామ స్వరాజ్య పథముపై మంగరూట్ పురోగమించ సాగింది. తమ గ్రామంనుండి ఏ విధమైన తగాదానయినా సరే బయట కోర్టులకు పోనీయమనీ, గ్రామమునకుచెందిన తీర్పులు గ్రామమందే చెప్పుకొనెదమనీ గ్రామస్తులు నిర్ణయించుకున్నారు. బయటనుంచి ఒక్కగజం గుడ్డకూడా తమ గ్రామములోనికి రానివ్వ మని ప్రతిన బూనారు. తమ పిల్లలకు చివరివరకూ విద్య తమ గ్రామంలోనే చెప్పించుకొనెద మని నిశ్చయించుకున్నారు. గ్రామవాసులు స్వయంగా ఒక కాలువ త్రవ్వకుని గ్రామనీటి వనరుల సమస్య కొంతవరకు పరిష్కరించుకున్నారు. గత ఏబది సంవత్సరములలోనూ ఏనాడూ పండనంత ఎక్కువగా ఈ సంవ త్సరం (1955) అక్కడ పంట పండింది.

సమగ్ర గ్రామదాన మనునది సర్వోదయమునకు మొదటి మెట్టు మాత్రమే. అయిననూ అది అనివార్యమైన సోపానము. మన సమస్య లన్నిటికి మూలములో భూసమస్య యిమిడి ఉందని భూదానయజ్ఞం నిరూపించింది. దానిని పరిష్కరించ నంతవరకూ ఏ నిర్మాణ కార్యక్రమమున కయినాసరే తగు వాతావరణము ఏర్పడదు.

భారతదేశంలోని భూసమస్యా పరిష్కారం కానంతవరకూ తాను తిరిగి తన పవనారు ఆశ్రమమునకు వెళ్ళనని 1952, సెప్టెంబరు 11 న వినోబా ప్రతిజ్ఞచేశారు. "రామకార్యం సాధింపబడేవరకూ నాకు విశ్రాంతి ఎలా ఉండగలదు" అను హనుమంతుని వాక్యమును వారు ఆ నాడు గుర్తుచేశారు.

1952 సెప్టెంబరు 14 వ తేదీన వినోబా బీహారు భూమిపై అడుగుపెట్టారు. 1954 డిసెంబరు 31 తో బీహారు యాత్రముగించుకుని వినోబా పశ్చిమ బెంగాల్ కు బయలుదేరారు. ఈ బీహారుయాత్రాకాలాన్ని ఏకాగ్ర ప్రయోగకాల మన్నాము.

బీహారు భూమిపై అడుగు పెడుతూనే వినోబా ఆ ప్రాంతంలో భూసమస్యా పూర్తిగా పరిష్కారం కావడం తన కళ్ళతో చూడాలనుకుంటున్నా నన్నారు. అంతవరకు ఆయనకు బీహారులో నాలుగు ఎకరాలయినా దొరకలేదు; ఆప్రాంతంలో 40లక్షల ఎకరాల భూమిని సేకరించాలనే నిశ్చయాన్ని ప్రకటించారు. ఉత్తర ప్రదేశ్ లో వినోబా జరిపిన 11 నెలల యాత్రలో 3 లక్షల ఎకరాలకంటె అధికంగానే భూమి లభించింది. ఈ విధంగా ఒకప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి యాత్రచేస్తూ ఉంటే, ప్రతీ సంవత్సరము 2, 3 లక్షల ఎకరాల భూమి వస్తూఉంటే, భారతదేశంలోని భూసమస్యా పరిష్కారానికి తరతరాలైనా చాలవని ఆయన అనుకున్నారు. అలా అయితే యుగనాదం అని మనం అన్న భూదాన కార్యం వెనుకబడి పోతుంది. అందుచేత ఒక ప్రాంతంలో పూర్తి శక్తిని ఉపయోగించి అచటి భూసమస్యను పరిష్కరించిన తదుపరే మరొక

ప్రాంతానికి కదలాలని వినోబా నిశ్చయించు కున్నారు. లెక్క వేసి చూస్తే బీహారులోని భూమిహీను లందరికీ భూమి యివ్వాలంటే 32 లక్షల ఎకరాలభూమి కావాలని తేలింది. చాండిల్ సర్వోదయ సమ్మేళనంలో వినోబా తన నిశ్చయాన్ని పునరుద్ఘాటించారు. చాండిల్ సమ్మేళనానికి ముందుగానే బీహారులో భూదానయజ్ఞ వాతావరణం ఎంతగానో తయారైనప్పటికి, ఆరంభకాలం చాల వరకు క్లిష్టంగానే సాగింది. "బావి త్రవ్వే వానికి ఎల్లప్పుడూ మెత్తటిమట్టే తగలదు. ఒక్కొక్కప్పుడు గట్టి రాళ్ళుగూడా తగులుతూ ఉంటాయి. వాటిని పగలగొట్ట వలసి యుంటుంది. ఆ రాళ్ళెంత గట్టిగా ఉంటాయో ఆ పాషాణాలక్రింద నుండే నీరు అంత మధురంగానూ ఉంటుంది," అని వినోబా అన్నారు. ఆ రోజుల్లో పెద్దపెద్ద సభలు జరుగుతూ యుండేవి. 10 వేలనుండి 30 వేల వరకు జనము వస్తూ యుండేవారు. కోసుల కొద్ది దూరంనుంచి దర్శనార్థులు ప్రవాహంలా వస్తూయుండేవారు. ఐతే భూమిమాత్రం చాలా తక్కువ దొరికేది. ఒక్కొక్కరోజు వినోబాకు 3, 4 ఎకరాలు దొరకడం గూడా కష్టమై పోయేది. అచటి భూమి చాల విలువైనది. కాలువ లున్న భూమి. పెద్దపెద్ద భూస్వాములా లేరు. ఉన్న కొద్దిమందీ వినోబా పేరు వినడంతోనే మైళ్ళకొద్దీదూరం పారిపోయేవారు. కార్యకర్తలకు ప్రజల్లోకి రావాలని యుండేది గాదు. పరిస్థితి క్లిష్టంగా యుండేది. ఐనా వినోబా నిరంతరం తిరుగుతూనే యుండేవారు. సముద్రపు అలలు పదేపదే ఉవ్వెత్తుగా లేస్తూ రాళ్ళను కొట్టుకుని మళ్ళీ పడిపోతూ ఉంటాయి.

అలలు లేవడం, మరల కొట్టుకోవడం, ఈవిధంగా నిరంతరం జరుగుతూ ఉండేసరికి రాళ్ళే పిండిపిండి అయిపోయాయి. మొదట చిన్నచిన్న రైతులు దానమిచ్చారు. ఒకరు ఎకరం, ఒకరు కుంట, ఒకరు పదిసెంట్లు ఇలా కొద్దికొద్దిగా దానమిచ్చారు. ఈవిధంగా కొద్దికొద్ది దానాలతో యేమవుతుందని ప్రజలు ఆలోచించ సాగారు. కొద్దిగా ఉన్నవాళ్ళనుంచి గూడా దానమెందుకు తీసుకోవాలి అనే విషయం గురించి తర్వాత వివరంగా ఆలోచిద్దాం. కాని ఇక్కడ ఒక విషయాన్ని మాత్రం చెప్పుకుందాము. చిన్న చిన్న దానాలవల్ల పెద్దవారికి ప్రేరణ లభిస్తుంది. పైన చెప్పినట్లుగా వేలకొద్ది కొద్దికొద్ది రైతులు కొద్ది కొద్దిగా దానమిచ్చారు. దానివల్ల కలిగిన వాతావరణం నుండి ఉద్భవించిన నైతికశక్తి ఒత్తిడికి పెద్దలకళ్ళుగూడా తెరచుకున్నవి. యజ్ఞం ఆరంభమైనప్పుడు లక్షలకొద్ది జనం పాల్గొన్నారు. దానం వచ్చినప్పుడు లక్షలకొద్ది ఎకరాలు దానం లభించింది.

చాండిల్ సమ్మేళనమునకు ముందుగా రెండు ప్రముఖమైన సంఘటనలు జరిగాయి. పాట్నాలో వినోబా సంపత్తి దాన యజ్ఞాన్ని ప్రారంభించారు. భూమితోపాటు సంపదను గూడా పంపిణీ చేయాలనే అభిప్రాయం మొదటినుంచీ ఉన్నది. ఐతే భూమిహీనులకు అవకాశములు కలుగజేయవలె నను కారణము సంపత్తి దానయజ్ఞ ప్రారంభమునకు నిమిత్తమాత్రమైనది. భూమిలేనివారి సమస్యతో ఈ సంపత్తి దానయజ్ఞ ప్రారంభము జతపడి యున్నది. "నిధి" పేరుతోనే "నిధనం" ఊహించు వినోబా " ట్రస్టు " అనేపదం వినడంతోనే " డిస్‌ట్రిస్టు ".(అప

నమ్మకం) ఏర్పరుచుకునే వినోబా క్రొత్త "ఫండు" నేమీ ప్రారంభించలేదు. భూదానయజ్ఞములో ఉత్పత్తిదారుల యాజమాన్యమునకు సంకేతము యిమిడియున్నట్లే, సంపత్తిదాన యజ్ఞములో అస్తేయము, అపరిగ్రహముల సాముహికీకరణము ద్వారా అర్థసుచిత్వమనే సంకేతము యిమిడియున్నది. ప్రతీదాత తనలెఖ్ఖ తనవద్దనే ఉంచుకుని, తన సంపాదనలో సమాజానికున్న భాగాన్ని అంగీకరించి, నిశ్చిత మొత్తముగాక నిశ్చిత భాగమును వినోబా ఆజ్ఞానుసారము స్వయముగా ఖర్చుపెట్టుటయే దీని విధానము. ఇందు ధనమును ప్రోగుచేయుట యను విషయము లేదు. ఇది మొదటి ముఖ్యసంఘటన.

శ్రీ జయప్రకాశ్ నారాయణ ఈ ఉద్యమములో చేరుట యన్నది రెండవ ముఖ్యసంఘటన. సంవత్సరాల తరబడి వారు ఆత్మపరీక్ష చేసుకుంటూ యుండిరి. గాంధీజీ ట్రస్టీషిప్పుకు ఆచరణ యుక్త స్వరూపము వారికి ఈ పనిలో కనబడెను. చాండిల్ లో వినోబా మలేరియా జ్వరంతో బాధపడుతున్నప్పుడు, జీవన్మరణాలమధ్య వారిప్రాణనావ ఊగిసలాడుతున్నప్పుడు "మీరు నిశ్చింతగా యుండండి. ఈపనిభారం మామీద వేసుకుంటున్నాం" అని శ్రీ జయప్రకాశ్ నారాయణ అభయమిచ్చుట ఒక క్రొత్త ఆశాకిరణమైంది. గయజిల్లానుంచి 1 లక్ష ఎకరాలు సేకరింపబడాలని వినోబా అన్నారు. ఆ జిల్లాలో గ్రామగ్రామాన జయప్రకాశనారాయణ పర్యటిస్తూ ఉండిరి. వందలు, వేలకొద్దీ చిన్న చిన్న రైతులుగూడా దానమిచ్చారు. ఎంతోమంది తమ సర్వస్వాన్ని సమర్పించారు.

చాండిల్‌లో జరిగిన సర్వోదయసమ్మేళనము భూదాన యజ్ఞ చరిత్రలో చిరస్మరణీయంగా నిలిచిపోతుంది. అంతకు ముందు రోజునే రామగడ్ రాజా ఒక లక్ష ఎకరాలభూమిని దానంగా యిచ్చారు. దానితో పెద్దపెద్ద జమీందారుల సహ కారమనే నవప్రకరణం ఆరంభమైంది. ఈ సమ్మేళనంలో వినోబా యిచ్చిన ఉపన్యాసములు నిర్మాణకార్యకర్తల తాత్విక భూమి కను స్పష్టం చేశాయి. వారిచ్చిన ఉపన్యాసాల్లో ఒకదానిని "సర్వోదయానికి ప్రణాళికా పత్రము" అని అన్నారు.

చాండిల్ తరువాత భూదానంలో వచ్చినంతవెల్లువ మరెప్పుడూరాలేదు. పలామూజిల్లాలో రాంకాకుచెందినరాజు వినోబావెంట తిరిగారు. ఆయన మొదట 2,500 ఎకరాలు, మరల 1,200 ఎకరాలు దానమిచ్చారు. కార్యకర్తలు అడిగి నప్పుడల్లా ఆయన అలా యిచ్చారు. దానిపై వారిని వినోబా మీరిలా చేయుటయందు కారణమేమి అని అడిగారు. ఎవరొచ్చి ఎంత అడిగితే అంతా యిచ్చానని వారన్నారు. అలా అయితే నేనిప్పుడు వచ్చాను. నాకెంత యిస్తారని తిరిగి వినోబా అడి గారు. నావద్ద ఉన్నదాంట్లో మీరెంత అడిగితే అంతా యిస్తానని వారన్నారు. దానిపై వినోబా "మీవద్ద స్వంతసేద్యంలో ఉన్న భూమిలో 6 వ భాగము, బంజరుభూమి ఉన్నదంతాను యివ్వండి" అని వారినగారు. రాజుగారు అందుకు అంగీకరించి 1 లక్ష 2ఎకరాలభూమిని దానంగా యిచ్చారు. అది మహాత్ము డగు బుద్ధుని జన్మదినం. వినోబా ఆ దానాన్ని పూర్ణదానముగా ఎంచి బుద్ధదేవుని పేర సమర్పించారు. ఇలా ఒక పక్షం గడిచిందో

లేదో రాంచీ జిల్లాలోని పాలకోటరాజా 42,500 ఎకరాల భూమిని దానంగా యిచ్చారు.

"నాకు దానమిచ్చేవారిని నేను విష్ణు వనుకుంటున్నాను. ఇకనుంచి విష్ణు సహస్రనామములు వినవలెనని అభిలాష ఉంది. అందుచేత ఒక్కరోజున 1000 దానపత్రాలు తెచ్చియివ్వండి" అని వినోబా ఒకరోజున అన్నారు. వినోబాకి చాలాసార్లు విష్ణు సహస్రనామములు వినిపించబడ్డాయి. ఒకవైపు పేదవాళ్ళనుండి వేలకొద్ది దానపత్రాలు లభించడం, రెండవవైపు జమీందారుల నుండి వేలకొద్ది ఎకరాలభూమి లభించడం ఈవిధంగా క్రాంతి రెండురంగాలను సంబాళించుకుని నడిచింది. క్రాంతిగమనంలో హజారిబాగ్ జిల్లా అగ్రగామి అయింది. ఆ జిల్లాలో మొత్తం సేద్యానికి లాయకు అయిన భూమి సుమారు 18 లక్షల ఎకరాలు ఉంది. అందుచేత పూర్తిగా భూమిసమస్య పరిష్కరింపబడడానికి వినోబా 3 లక్షల ఎకరాలభూమి కావాలని కోరారు. అంటే అంతభూమి లభిస్తే భూసమస్య ప్రేమతో పరిష్కరింపబడిందని చెప్పుకొనవచ్చును. హజారిబాగ్ జిల్లా 7 లక్షల ఎకరాల భూమిని దానంగా యిచ్చింది. ఇక్కడ కేవలం భూసమస్య పరిష్కార మవడమేగాక యితర భూమిహీనులకు జీవనభృతిని కల్పించేపని కాగలుగుతుందనిగూడా నిరూపింపబడింది. హజారిబాగ్ జిల్లాలో బంజరుభూమి అధికంగా ఉంది. అందుచేత యిక్కడ హెచ్చుభూమి దొరికిం దనుకోవచ్చును. జనసంఖ్య ఎక్కువ, భూమి తక్కువ ఉన్నజిల్లాలసంగతి చూద్దాము. గయజిల్లాలో భూమి విలువైనది. పట్టాదారులా కొద్దికొద్దివారు. భూమి

సమస్య కఠినముగా యుండెను. వినోబా గయజిల్లాను తన ప్రయోగ క్షేత్రంగా ఎంచుకొన్నారు. మూడుసార్లు గయజిల్లాలో పర్యటించారు. గయజిల్లా నేటికీ తన కోటాను పూర్తిచేయలేదని ఒప్పుకోవలసియున్నది. ఐనప్పటికి సమస్య పరిష్కారమై తీరుతుందనుటలో ఇసుమంతైనా సందేహం లేదు. కార్యకర్తలు అప్రమత్తులై యుండి నిష్ఠాపూర్వకంగా పనిలో ప్రవేశించవలసియున్నది.

బోధగయా సర్వోదయ సమ్మేళనానికి జీవనదానమనే ఘటన కేంద్రబిందువైనది. కార్యకర్తలు ఎక్కువగా చేరుటకు అది చాల ఉపకరించినది. ఆ ఘటన ఎంత విచిత్రమైనదో అంత స్ఫూర్తిదాయకమైనది. జయప్రకాశ నారాయణ మాట్లాడుటకు లేచి నిలుచున్నప్పుడు ఒక క్రొత్త యజ్ఞానికి అధ్వర్యులు కాబోతున్నారనే విషయం స్వయంగా వారికే తెలియదేమో ! ఈపని కొరకు సంపూర్ణ జీవితాన్ని సమర్పించే కార్యకర్తలు కావాలని విజ్ఞప్తి చేస్తూ ముందుగా తన జీవితాన్ని ఆయన సమర్పించారు. ఇది చాలా గొప్ప సంఘటన. దేశంలోని సమర్థుడైన ఒక గొప్ప రాజనీతిజ్ఞుడు రాజనీతిని వదలి లోకనీతివైపు అడుగు వేస్తున్నాడు. వాతావరణంలో మెరుపు మెరిసినట్లయింది. భూదానయజ్ఞం పునాదియై గ్రామ పరిశ్రమలు పధానమైన అహింసాత్మక విప్లవము కొరకు తన జీవితాన్ని సమర్పిస్తున్నానని మరునాడు వినోబా ఒక ఉత్తరం ద్వారా తెలియపరిచారు. సేవకొరకే జీవిస్తున్నట్టి వ్యక్తి తన పనికి భూదానయజ్ఞమును పునాదిగా చేసుకోవాలని నిశ్చయించారు. తన

పూర్తి శక్తినంతా ఈపనిపైనే కేంద్రీకరించుటకు సంకల్పించారు. జీవనదాన యజ్ఞ ప్రతిజ్ఞను పునరుచ్చరించుట యనునది ఈవిజ్ఞులకు తమశక్తిని పెంచుకొనుటకు మరియు ఆత్మశుద్ధికి ఒక సాధనము మాత్రమే. నవయువకులు ఈ నవక్రాంతిలో ఉత్సాహంతో తమ జీవితాలను దానం చేశారు.

1954 మార్చి తరువాత బీహారులో 7 లక్షల ఎకరాల భూమి లభించింది. భూసేకరణ తరువాత భూవితరణవైపు దృష్టిపోవుట యనునది సహజమే. దేశం మొత్తంమీద పలుచోట్ల భూవితరణ కార్యం ఆరంభమైంది. నేటివరకు భూసేకరణ వితరణ లెఖ్ఖలు యిదే పుస్తకములో వేరొకచోట యివ్వబడినవి.*

సుమారు 23 నెలల యాత్ర అనంతరం వినోబా బీహారు వదలి పెట్టారు. వారు ఉండగానే అచట భూసమస్య పరిష్కరింప బడకపోయినా, వారు బీహారు వదిలిన తర్వాత కూడా అక్కడ తయారై యుండిన వాతావరణమును ఉపయోగించుకుని కార్యకర్తలందరూ వ్యవహరించియుంటే, దానివల్ల ఆ ప్రాంత భూసమస్య తప్పక పరిష్కరింపబడ గలిగియుండేది. వినోబా సంకల్పము కార్యకర్తలందరి సమిష్టి సంకల్పమనీ, అందుచేత ఇంకనూ మిగిలిన 8, 9 లక్షల ఎకరముల సేకరణనూ పూర్తిచేయు బాధ్యత బీహారులోని కార్యకర్తలందరూ వహించుచున్నారనీ వినోబాకు అభయ మిచ్చిరి.

బీహారులో 32 లక్షల ఎకరాలు సేకరించాలని సంకల్పించబడింది. అందులో 24 లక్షల ఎకరాల భూమి భూదా

---

* 1-వ అనుబంధము చూడుడు.

నంగా సేకరించ బడింది. ఇందుతో ఎనిమిది లక్షల ఎకరముల భూమి వ్యవసాయమునకు లాయకైనది కాదని అనుకుందాము. అయినప్పటికీ వైశాల్యములోనూ, జనసంఖ్యలోనూ యూరపు లోని చాలా దేశములకంటె పెద్దదైన ఒక ప్రాంతములోని భూసమస్య సగమైనా కేవలం దాన మడుగుటతోనే పరిష్కార మైనదనుట యదార్థము. ఇంతకీ ఇంకా బీహారులోని సగం గ్రామ ములకు భూదాన సేవకులు చేరలేదనే విషయం గుర్తించవలసి యున్నది. ఒకవేళ అన్ని గ్రామములకు భూదాన సేవకులు చేరియుండ గలిగిన భూదానం ద్వారా బీహారు భూసమస్య పరిష్కారమై యుండేదేమో.

జనవరి 1 వ తేదీనుండి 25 వ తేదీ వరకు పశ్చిమ బెంగాలులో పర్యటించి వినోబా 1955 జనవరి 26 న ఉత్కళ ప్రాంతమున ప్రవేశించారు. ఉత్కళ ప్రాంతమందు వినోబా ప్రవేశించుటకుముందే అచట చాలాపని జరిగింది. వినోబా పర్య టన లేకుండా ఎక్కువ పని చేసిన ప్రాంతము అప్పటి వరకూ ఒరిస్సాయే. బీహారు తర్వాత ఒరిస్సాలోనే ఎక్కువమంది దాన మిచ్చారు. అయితే గ్రామ దానములలో ఒరిస్సా బీహారును మించింది.

వినోబా ఒరిస్సా ప్రవేశ సమయములోనే అచట "భాగ స్వామ్య" చట్టం వచ్చింది. దానివల్ల మధ్యతరగతి వారు చాల అసంతృప్తి చెందారు. భూదానోద్యమముపై గూడ దాని ప్రభావం పడింది. ప్రారంభంలో వినోబాకు అచట భూమి తక్కువే లభించింది. కాని, పూరీసమ్మేళనం తదుపరి భూదానం వెల్లువైంది.

వినోబా భూక్రాంతి స్వప్నమును కోరాపుట్ జిల్లా సఫలం చేసింది. ఒరిస్సాలోని యితర భాగముల పర్యటనను నిలిపివేసి వినోబా కోరాపుట్ జిల్లాలోనే తన శక్తినంతా వినియోగించారు. అది వర్షాకాలము. వర్షాలలో కోరాపుట్‌కు ఎవరూ వెళ్లేవారుకాదు. అధికవర్షము, కొండవాగుల వరదలు, మలేరియా—వీటివల్ల తెల్ల బట్టల వారికి కోరాపుట్ వెళ్ళుట అంటే అసాధ్యమై పోయేది. కాని, వినోబా వర్షాకాలపు నాలుగు నెలలూ కోరాపుట్‌లోనే పర్యటించారు. ఒరిస్సాలోని నిర్మాణ కార్యకర్తలు కూడ కోరాపుట్‌పై తమ శక్తినంతా కేంద్రీకరించారు. రెండువందలమంది కార్యకర్తలు రంగము లోనికి దూకారు. గ్రామదాన ప్రవాహం ఆరంభమైంది. కార్యకర్తలు జబ్బుపడేవారు—ఆస్పత్రులకు వెళ్ళేవారు—నయమగుటతోనే తిరిగి కార్యక్షేత్రంలో ప్రవేశించేవారు. ఇంటికి వెళ్ళవలెననేది వారి కనిపించేది కాదు. విశ్రాంతి తీసుకోవాలనే భావనకూడ కలిగేదికాదు. అచటి ఆదివాసులు కూడ ఎంతో ఉత్సాహమును, నమ్మకమును ఈయజ్ఞమందుచూపారు. వినోబా ఒరిస్సాను విడువకముందే కోరాపుట్‌లో 600 లకు పైగా గ్రామదానములు లభించాయి.

వినోబా బీహారులో ఉండగా ఒకసారి ఒక ఉత్తరంలో ఇలా వ్రాశారు: "బీహారులో సంపూర్ణభూదానము. ఒరిస్సాలో భూక్రాంతి, ఆపైన స్వేచ్ఛావిహారము." ఆంధ్రప్రవేశంతో వినోబా స్వేచ్ఛావిహారము ఆరంభమైంది. ఆంధ్రలో ప్రత్యేకంగా ఎక్కువ పని జరగలేదు గనుక వినోబా ఆంధ్రను వరించారు. ఆంధ్రలోని

మొదటియాత్ర 2½ నెలల అనంతరం వినోబా హైద్రాబాదులో ప్రవేశించుసరికి ఆంధ్రలో అనుకూల వాతావరణం తయారైంది.

హైద్రాబాదు యాత్రలో మహబూబ్‌నగర్ జిల్లాలో ఎక్కువ ఉత్సాహం కనిపించింది. ఈజిల్లాలో మొత్తం భూమి లోని ఆరవభాగం లభించగలదని వినోబా ఆశిస్తున్నారు.

1956 జనవరి 30 తేదీకి వినోబా పోచంపల్లి రెండవ సారి చేరారు. భూదానగంగోత్రి అది — బాపూ నిర్యాణదిన మది ! ఆనాటిసభలో మహాజనసముద్రము ముందు వినోబా తన హృదయాన్ని విప్పారు. ప్రాంతపునర్విభజనను ఆసరాచేసుకుని దేశంలో చెలరేగిన హింసకు వినోబా హృదయం వ్యధితమైంది. "ఇది నా ఓటమి. విదేశవిధానమందు శాంతి కావాలని పట్టు బట్టే జవహరలాల్ ఓటమి యిది" అని వారన్నారు. మన సమస్యలన్నిటికీ అహింసాత్మక పరిష్కారమార్గమును వెతుక మంటూ దేశదృష్టినంతనూ వినోబా మరొకమారు ఆకర్షించారు.

ఇప్పుడు వినోబా ఎక్కడకువెళ్ళినా, దేశంలో అహింసపై నిష్ఠపెరుగవలెననే దృష్టితోనే ప్రచారకార్యం సాగుతోంది.

ప్రజాసూయయాగ అశ్వము నియమిత గమనంలో పురోగమిస్తూంది. క్రాంతిదూత పాదములు నిరంతరం ముందుకు సాగుతున్నవి. ఆ ఏకాకియైన విప్లవవీరుని వెనుక నేడు లక్షలాది పయనిస్తున్నారు.

ఇంతవరకూ భూదాన చరిత్రలోని సామాన్య భూమిక యందుగల వివరములు మీకు తెలిపాను. భూదాన యజ్ఞము యొక్క తాత్త్వికభూమిక యింతకంటె మహత్వపూర్ణమైనది.

# 3

# తాత్త్విక భూమిక–1

వైదీక ఋషులు పృథ్వికి ప్రణమిల్లుతూ — "మాతా భూమిః పుత్రోఽహమ్ పృథివ్యాః" — పృథ్వి తల్లి. నేను ఆమె పుత్రుణ్ణి. పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము-ఈపంచ మహా భూతములతో నిర్మింపబడ్డ శరీరము వాటి ఆధారము వల్లనే నిలిచి యుండగలుగుతోంది. మానవునకు ఏవస్తువు ఎంత ఎక్కువ అవసరము గలుగుతుంతో అంత ఎక్కువ ప్రమాణములో ప్రకృతిలో ఆవస్తువు దొరుకునట్లు సృష్టి నిర్మాణము జరిగింది. గాలి, ఆకాశము లేకుండా మానవుడు ఒక్క క్షణముకూడా జీవించలేడు. ఎవరికీ వాటిలోటు రానీయకుండా అంత ఎక్కువగా ప్రకృతి వాటి నిచ్చింది.

మానవుని ప్రాథమిక అవసరాలలో నీరు, అన్నము ఈ రెండూ ముఖ్యమైనవి. సాధారణంగా నీరుకూడా ప్రతీవారికీ అవసరమైనంతగా దొరుకుతూనే యుంటుంది. ఇక మిగిలిందంతా ఆహారము గురించిన ప్రశ్న. నీరు, గాలి, వెలుతురు ఆకాశము వలెనే అవసరమైనంతగా ప్రతివ్యక్తికీ ఆహారముగూడ స్వేచ్ఛగా లభించాలి. ఆహారము మానవుని జన్మహక్కు. కాని మానవుని

యీ హక్కు మానవుని చేతనే దొంగిలింపబడుతోంది. ఈ భూమిమీద నేడున్న జనాభా మరికొన్ని రెట్లు యెక్కువైనప్పటికి వారందరి పోషణకు ఏలోటూ రాకుండా సరిపోవునంతగా ఆహార పదార్థాలున్నాయని వైజ్ఞానికులు చెబుతున్నారు. ఐనప్పటికి ప్రపంచంలో నాల్గింట మూడువంతుల జనాభా అర్థాకలితో యుండుటో, లేక కరువుతో బాధపడుటో జరుగుతోంది. ఇతరకారణములేవైనా నీరు, గాలి, వెలుతురు, ఆకాశమువలెనే భూమినికూడా అందరికీ అందుబాటులో ఉంచకపోవుట ఈ అసమానతకు ఒక ముఖ్యకారణం. ఊపిరి తీసుకోవాలనుకున్న వాడు గాలిని పీల్చుకుంటున్నాడు. దాహంవేసినవ్యక్తి నీరు త్రాగుతున్నాడు. అదేవిధంగా ఆకలివేసిన వ్యక్తికి అన్నం దొరకాలి. భూమిమీద పనిచేయగోరు ప్రతివ్యక్తికి ఆవిధంగా పనిచేసేందుకు అవకాశం లభించినప్పుడే ఇది సాధింపబడగలుగుతుంది. నేడున్న అసమానపంపిణీని సమానంగా తీసుక రావాలి. వేదకాలంనుంచి యేభూమినైతే మనం తల్లిఅన్నామో నేడు వ్యక్తి దానికి స్వామియై కూర్చోవాలనుకుంటున్నాడు. తల్లి దాసిగా యున్నంతకాలం పుత్రులకు సుఖముండదు. పిల్లల ఊపిరి తిత్తుల లోనికి తాను ప్రవేశించనని గాలి యెన్నడూ అనదు. తాను సింహాన్నే నీళ్ళు త్రాగనిస్తానుగాని మేకను తన ప్రవాహంలో త్రాగనివ్వనని నది యెప్పుడూ చెప్పదు. రమ్యహార్మ్యాలలోనికే ప్రవేశిస్తాము గాని పూరిగుడిసెలలోనికి వెళ్ళమని సూర్యకిరణాలు అనవు. ఈనీరు, గాలి, వెలుతురు భగవంతు డిచ్చినవిగనుక అందరికీ సమానంగా అందుబాటులో ఉన్నట్లుగానే, భూమిగూడా

ఈశ్వరప్రసాదము గనుక దున్నగోరే ప్రతి ఒక్కనికీ భూమిలభించి తీరాలి. ప్రతీ భూమి పుత్రునకూ తన తల్లిపై సమానహక్కు ఉన్నది. భూదానయజ్ఞములో భూమిని దానమడుగుట, పంచి పెట్టుట అనే ప్రక్రియ వెనుక ఉన్న మూల తత్వమిదే. భూమి న్యాయోచితంగా పంచబడాలనేకోరికే భూదానయజ్ఞం. ప్రతి వ్యక్తిలో దాగియున్న సజ్జనత్వాన్ని మేల్కొలిపి భూన్యాయాన్ని స్థాపించే కార్యక్రమం అది.

ఇది భూదానయజ్ఞ బాహ్య ప్రక్రియ. భూదానయజ్ఞ కార్యక్రమం సముద్రం వంటిది. సముద్రంవలె అది విశాలమైనది. లోతైనదీను. దాని విశాలత్వంలోనికి, లోతులోనికి మనం ప్రవేశించవలసి యున్నది.

వినోబా భూదాన యజ్ఞమును ప్రజాసూయ యాగ మన్నారు. ఆధునిక అవసరములకు ప్రాచీన పరంపరను జోడిం చుట యనునది వినోబా గొప్పతనము. ఈ ఉద్యమంలో దానము, యజ్ఞము, తపము మొదలగు ప్రాచీన పరంపరతో ఆధునిక అవసరమగు ఆకలి సమస్యను జోడించినట్లే ప్రజా సూయ యాగమందు రాజసూయ యజ్ఞ మను ప్రాచీన పరం పరతో నేటి ప్రజాస్వామ్య భావ ప్రవాహమును జోడించి ఒక విచిత్ర సమన్వయాన్ని వినోబా సమర్పించారు. ఈ ప్రజా సూయ యాగము ప్రజలద్వారా చేయబడుతోంది. ప్రజల కొరకు చేయబడుతోంది. ప్రజలే దీనివల్ల అభివృద్ధి చెందుతారు. అందుచేత భూదాన యజ్ఞమునకు ప్రజాసూయ యజ్ఞమని పేరుపెట్టుట ఉచితముగానే యున్నది.

"ప్రజాసూయ యజ్ఞ"మనే శబ్దమును మనము చక్కగా అర్థము చేసుకొనుటకు "గీతా ప్రవచనములు" చదువవలసి యున్నది. ఈ పుస్తకములో భగవద్గీత ఆధారముపై వారిచ్చిన ఉపన్యాసముల రూపంలో వినోబా సంపూర్ణ జీవన దర్శనము మనకు కలుగుతోంది. భూదానయజ్ఞ ప్రారంభమునకు 20 సంవత్సరముల పూర్వమే ఈ ప్రవచనములు ఇవ్వబడ్డప్పటికీ ఈ పుస్తకము అధ్యయనము చేసినవారికి భూదానయజ్ఞ తత్వము తేలికగా అర్థము కాగలదనీ, మరియు ఈ యజ్ఞములో పాల్గొన వలె నను ప్రేరణ కలగగలదనీ వినోబా నమ్ముతున్నారు. గీతా ప్రవచనములలోని 17 వ అధ్యాయములో వినోబా 'యజ్ఞ' మనే శబ్దము యొక్క ఉద్దేశ్యములను వివరించారు. సృష్టిలో నివసిస్తూ యుండుటవల్ల సృష్టిని మానవుడు ఎంతగా క్షీణింప జేస్తున్నాడో, అంతగా దానిని పూర్తిచేయుట యజ్ఞము యొక్క మొదటి ఉద్దేశ్యము. రెండవ విషయము శుద్ధీకరణము. మనము బావిని ఉపయోగిస్తున్నాము. ఇరుగు పొరుగునుండే సృష్టి అశుభమౌతుంది. దానిని శుభ్రపరచుట యజ్ఞముయొక్క రెండవ ఉద్దేశ్యము. లోటును పూర్తిచేయుట, శుభ్రపరచుటతో పాటు ప్రత్యక్షముగా నిర్మాణము చేయుట యజ్ఞము యొక్క మూడవ ఉద్దేశ్యము.

గీతా ప్రవచనములలోని ఈ వ్యాఖ్యానము ననుసరించి భూదానయజ్ఞమందు ఈ మూడు ఉద్దేశ్యములు యెంతవరకు నెరవేరునో పరిశీలిద్దాము. అంటే దీనివల్ల దేశములోని యే లోటు భర్తీయగుచున్నది, యే శుద్ధీకరణము జరుగుచున్నది

మరియు యే నవనిర్మాణము జరుగుచున్నది అనగా యే ఫల ప్రాప్తి జరుగుచున్నదో చూద్దాము.

నేడు మన గ్రామాలు క్షీణిస్తున్నవి. మన గ్రామలక్ష్మి క్షీణిస్తోంది. నేటికి 20 సంవత్సరాల పూర్వం మన గ్రామాలలో ఉండే గ్రామపరిశ్రమలు, వృత్తులు నెమ్మదినెమ్మదిగా నశించి పోతున్నవి. బట్టలమిల్లుల పొగగొట్టములు పైకి లేస్తున్నకొద్దీ నేతగాండ్ర ఇండ్లు పాతాళానికి క్రుంగిపోతున్నవి. నేడు దేశం ముందున్న ముఖ్య ప్రశ్న నిరుద్యోగము. ఆకలి ఉన్నవారికి అన్నంలేదు. అన్నం ఉన్నవారికి ఆకలి లేదు. ఇది నేటి అసమానత. నూనె మిల్లులు తెరవబడుతుంటే, నూనె గానుగలు మూలబడుతున్నాయి. చెప్పులు కుట్టే కార్ఖానాలు అధికమౌతుంటే, మాదిగవారికి వృత్తిలేకుండా పోతోంది. ఇంకా ఒకేసారి ఎన్నో బట్టలు కుట్టే మిషనులు, కార్ఖానాలు కూడ వచ్చాయి. అలాంటప్పుడు ఎంతోమంది దర్జీలు నిరుద్యోగులౌతున్నారంటే ఆశ్చర్యం ఏముంది? ఒకవైపున జనాభా వృద్ధి వలన భూమిపై భారం అధికమౌతుంటే, మరొకవైపున యితర వృత్తులు పోయి నిరుద్యోగులైనవారి భారంకూడ అధికమౌతోంది. మనదేశంలో ఒక విధంగా వ్యవసాయమే తేలికైన వృత్తి అగుటచేత ఎక్కడ ఎవరివృత్తి పోయినా వారు పొలంపై కూలి పనైనా చేసుకుని బ్రతుకుదామని అనుకుంటున్నారు. ఈవిధంగా పనికావలసిన వారికి పని దొరకక పోవుటవల్ల ధరణీమాత క్షీణించుట—మన గ్రామ లక్ష్మి క్షీణించుట—జరుగుతోంది.

రెండవ తరుగుదల దానికన్న కొంత సూక్ష్మమైనది. అది విద్యాదేవి క్షీణత. నేడు మన విద్యావిధానం నగరాభిముఖమై ఉంది. ఏ భారత దేశంలో రాముడు, కృష్ణుడు మొదలగు రాజవంశీకులు విద్యార్జన కొరకు వనములు—ఉపవనములకు, గ్రామసీమలకు వెళ్ళేవారో ఆ భారతదేశంలోని పల్లె సీమలలో నేడు విద్య నామ మాత్రముగానైనా మిగలకుండా పోయింది. గ్రామాలలో ఉండే తెలివైన విద్యార్థుల అభివృద్ధి వారు గ్రామాలలో ఉండుట కారణంగా ఆగిపోతోంది. లేనిచో పట్టణాలకు వెళ్ళవలసి వస్తోంది. విశ్వవిద్యాలయముల స్థితిని గమనించుటకుగాను డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి అధ్యక్షతను నియమింపబడిన కమీషను తమ రిపోర్టులో గ్రామ విశ్వ విద్యాలయము లను అంశములో ఈ విషయమై చక్కగా తెలిపినారు. అమెరికన్ విద్యావేత్త డా. మార్గన్ అందు ఈ విధముగా తెలిపినారు: "తమ గ్రామవిద్య గురించి, తమ గ్రామ సంస్కృతి గురించి శ్రద్ధ చూపని దేశ సంస్కృతి అనతి కాలములోనే క్షీణించు ననుట చరిత్ర నేర్పిన పాఠము." ఇట్లు చూచుకుంటే విద్య మన గ్రామంనుంచి విముఖమైనట్లుగా తోస్తున్నది. మన గ్రామములు మరొక విధముగా క్షీణించుట యిది.

రాజ్యలక్ష్మి క్షీణించుట మూడవది. ప్రజాస్వామ్యం, బలమైన కేంద్రీకృత ప్రభుత్వము ఈ రెండూ పరస్పరావలంబనములైనవికావు. నిజమైన ప్రజాస్వామికములో అధికారము వికేంద్రీకృతమై ఉండాలి. ప్రజాస్వామ్యముతో కూడుకున్న యూనిట్లలో స్వతంత్రశక్తి ఉన్నప్పుడే ప్రజాస్వామ్యం నిజమైన ప్రజాస్వామ్య

మనబడుతుంది. నేడు మనదేశములోని గ్రామములకు కనీస అధికారము లున్నవి. మన గ్రామజీవితంలో—పదింట తొమ్మిది వంతుల భారతదేశం నివసిస్తున్న గ్రామజీవితంలో—ఏర్పడిన త్రివిధములగు క్షీణతలను ఆపి, శక్తిచేయుటకే భూదాన యజ్ఞము. భూదానయజ్ఞములో భూమిలేనివారికి భూమి యివ్వ బడుతుంది. దానివల్ల ఎల్లకాలం వారికి వృత్తికల్పించు సాధనము లభిస్తుంది. వ్యవసాయకూలీలకు ఈవిధముగా వ్యవసాయమునకు అవకాశం లభిస్తోంది. నేడు భూమిహీనులగు వ్యవసాయకూలీలే మనదేశంలో అందరికంటె ఎక్కువ పేదవారై అణగద్రొక్క బడినవారు, పీడింపబడుతున్నవారు. వారికి స్వతంత్రముగా పని లభించుటచేత వారిలో నవజీవంవచ్చి నవశక్తి ఉద్భవిస్తోంది. ఒక గొలుసుయొక్క బలము ఆ గొలుసులో ఉండే బలహీనమైన కొక్కెముపై ఆధారపడి యుంటుంది. భూదానంవల్ల దేశంలో మనం బలహీనమైన కొక్కెమును బలమైనదిగా తయారు చేయు చున్నాము. దీనివల్ల మొత్తం దేశం శక్తి పెరుగుతుంది. ఈ అధికమౌతున్న శక్తిలోనుంచి ఏర్పడే వాతావరణమునుండి గ్రామపరిశ్రమలు, నయీతాలీమ్ మొదలగు దేశనిర్మాణ కార్య ములకు దారులు తెరచుకుంటున్నాయి. భూదానయజ్ఞము ద్వారా మన వ్యక్తిగత కుటుంబభావనను విస్తృతపరచి గ్రామ కుటుంబ మను భావమును పెంపొందించవలెనని వినోబా అభి ప్రాయము. "భూమంతా గోపాలునిదే" అనునది యిందుకు ప్రథమ సోపానము. భూమంతా గ్రామానిదే అని అంగీకరిస్తూ యిప్పటికి 1000 కి పైగా గ్రామాలు తమకున్న మొత్తం

భూమిని దానమిచ్చి మొదటి అడుగువేశాయి. దీనిలోనుంచే నవ గ్రామ నిర్మాణమునకు పునాదులు ఏర్పడుతున్నాయి; నవ్యమానవులు తయారవుతూ, నవ్యసమాజం నిర్మింపబడుతోంది. తమ గ్రామంలో ఏమి పండించాలి, బయటనుంచి ఎంత దిగుమతి చేసుకోవాలి, తమ పిల్లలకు యేవిధముగా విద్య గరపాలి, ఆరోగ్యము, న్యాయము మొదలగు యేర్పాట్లు యెలాగుండాలి. అనే విషయాలన్నీ ఈ పునాదులపై ఆలోచించి వాటిని అమలులో పెట్టి అభివృద్ధి పరుస్తారు.

వాతావరణశుద్ధి ఈయజ్ఞముయొక్క రెండవ ఉద్దేశ్యము. నేడుగూడా శిథిలావశేషముల రూపములో కొనసాగుతున్న హోమములు, యజ్ఞయాగాదులయెడల వాటివల్ల పాపముక్తి, వాయుశుద్ధి జరుగుతుందని ప్రజలలో నమ్మకములు ఏర్పడియున్నవి. వనస్పతిని హోమములో పోయుటద్వారా వచ్చే పొగవల్ల యేమివాయుశుద్ధి జరుగుతుందో మనకు తెలియదు! కాని భూదానయజ్ఞంవల్ల జరిగే వాతావరణశుద్ధి అంతఃశుద్ధికి చెందియుంటుంది. ఇచ్చేవారు, పుచ్చుకునేవారు, యిప్పించేవారు ముగ్గురి చిత్తశుద్ధికి అవకాశముండుటయే ఈ యజ్ఞములోని గొప్పతనము. పరిశుద్ధమైన హృదయముతో దానంచేసేవారి చిత్తశుద్ధి స్పష్టముగా తెలుస్తూనే యుంటుంది. అట్టివ్యక్తి భోగమునుండి విముఖుడై త్యాగమువైపు పురోగమిస్తాడు. తాను దానమిచ్చేటప్పుడు భూమిని తల్లి అనుకుని, యితరులకు భిక్షమివ్వడముగాక స్వయంగా ప్రేమ మరియు శ్రమనిష్ఠల దీక్షను స్వీకరిస్తాడు. నేటి వరకు అతను కూడబెట్టుకుంటూ

ఉన్నాడు. కాని యిక యితరులను తనవారని యెంచి వారి కొరకు కొంతత్యాగం చేస్తున్నాడు. మోహములో అశుద్ధి, త్యాగములో శుద్ధి ఉన్నవి. తన హృదయతంత్రులను దరిద్ర నారాయణుని హృదయతంత్రులతో కలిపి తన సర్వోత్తమ అభి వ్యంజనను వ్యక్తం చేస్తున్నారు.

"భూమి తీసుకునేవానికి చిత్తశుద్ధి ఎలా కలుగుతుంది? ఊరకనే భూమివచ్చుటచేత అతని లోభవృత్తి పెరిగేందుకు అవ కాశము లేదా? అతను దీనుడు, భిక్షుకుడుగానూ తయారు కాడా?" భూదానయజ్ఞ విధానమును పైపైననే చూచుటచేత ఇట్టి అనుమానములు కలుగుచున్నవి. కాని యదార్థములో అటులలేదు. భూపంపిణీ విధానమును తెలుసుకొన్న ఈవిష యము చక్కగా విశదము కాగలదు. భూదానయజ్ఞములో భూమిని స్వీకరించే భూమిహీనుల చిత్తశుద్ధికి యెట్టి అవకాశము లున్నవో తెలుసుకొందము. పరాధీనులై యున్నవారి చిత్త శుద్ధికి అవకాశమెక్కడ? ఇతరుల భూమిపై సేద్యముచేస్తూ అధికశ్రమ భారమువల్ల తన మనస్సులోని భావములను అణచు కొని నిర్వీర్యుడై కూర్చుంటాడు. చిత్తశుద్ధి నిగ్రహములో యుంది కాని పరవశత్వముచే మనసును అణచుకొనుటలో లేదు. ఉపవాసములోనున్నశక్తి ఆకలివేసినప్పటికీ అభావమువల్ల తినక పోవుటలో లేదు. భూమిరావడము అనునది భూమిహీనులకు స్వాభిమానముతో నిలబడు సాహసమును కల్గించును. స్వయం పోషకత్వముయొక్క యీ నిర్భయత్వములోనే భీరులకు చిత్త శుద్ధి కలుగుతుంది. తయారుచేయబడి వండబడిన అన్నము గనుక

భూమిహీనులకిస్తే వారు తప్పక దీనులవుతారు. భూదానయజ్ఞం వారికి వంటచేసిపెట్టక ఆవంటకములను సంపాదించుకొను సాధనములను యిస్తున్నది. తన పరిశ్రమచే సంపాదించుకొన్న అన్నము తినే అవకాశము నిస్తున్నది. భూమిలేనికూలి యితరుల పొలంలో పనిచేయునప్పుడు బద్ధకిస్తాడు. అట్టి వ్యక్తికి భూదానయజ్ఞం శ్రమనిష్ఠాదీక్ష నిస్తోంది. తన శ్రమవల్ల ఉత్పత్తి ఐన అన్నము సంస్కృత కవి చెప్పినట్లు "ఘర్మజాని కుసుమాని" (స్వేదమునుండి ఉద్భవించిన కుసుమము) వలె దశదిశల సుగంధిని వ్యాపింపజేస్తుంది. చిత్తశుద్ధియొక్క విశిష్టమైన దర్శనము భూవితరణలో కలుగుతుంది. భూమి కొద్దిగా ఉన్నప్పుడు యెవరు వదులుకుంటారు, యెవరు తీసుకుంటారు అనే నిర్ణయము భూమిహీనులచేతనే చేయించబడుతుంది. భూమిహీనులు పదిమంది ఒకటై పలికితే వారినోట పరమేశ్వరుని వాణియే వెలుస్తుంది. 15 నిముషాలముందు తనకు భూమికావాలని, తాను ఆ భూమిపై సేద్యము చేస్తానని పట్టుబట్టిన వ్యక్తే తనకాభూమి తప్పక అవసరమేనని, అయితే తనకంటె ఎక్కువ అవసరములోనున్న వ్యక్తికి ఆ భూమినిచ్చుట ధర్మమని అందుచేత ఆభూమి ఆతనికివ్వవలెనని మనస్ఫూర్తిగా చెప్పుతున్నాడు. ప్రపంచమంతటా "ముందు నాకు, తరువాత యితరులకు" అను భావము వ్యాపించి యున్నప్పుడు "ముందు యితరులకు, తరువాత నాకు" అని భూదానయజ్ఞములో భూమిహీనులచే చెప్పించుచున్నారు. చిత్తశుద్ధికి ఉదాహరణ యింతకంటె మించి మరెక్కడ దొరుకుతుంది ?

భూదాన యజ్ఞములో భూమిని యిప్పించే సేవకుల చిత్తశుద్ధికి దాతా గ్రహీతల చిత్తశుద్ధికంటె ఎక్కువ అవకాశ మున్నది. భూదాన యజ్ఞములో నిత్యము యాత్రీకుని అభివృద్ధి జరుగుతూ యుండడము అనునది ఒక గొప్ప విశేషము. యాత్రీకుడనగా వినోబాగాదు. భూదాన యజ్ఞమునకు పూర్వము నుంచే వినోబా నిత్యవికాస శీలురై యున్నారు. ప్రసిద్ధులైన, ప్రసిద్ధులుగాని వందలాది సేవకులు దేశంలోని మూల మూలలా వినోబా అడుగుతో తమ అడుగులు కలుపుతూ యానం సాగిస్తున్నారు. ఆ వందలాది సేవకుల గురించే యిప్పుడిక్కడ మనం ముచ్చటించు కొంటున్నాము. యాత్రీకులకు ఈయాత్రలో అనుచిత ప్రసిద్ధి లభించుట, దానివల్ల అహంభావము వచ్చుట, పార్టీల కీచులాటలో యిరుక్కునే అవకాశము, ఫలితం త్వరగా రావాలనే ప్రయత్నములో సత్యదూరులగుట మొదలగు ప్రమాదములకు అవకాశము లేకపోలేదు. అయితే వాటినుంచి రక్షింప బడుటకు బలమైన ప్రాకారములు గూడా చాలా ఉన్నవి. ఈ సామాన్య సేవకుల మార్గంలో ఎప్పుడూ పూల బాటలే యుండవు. అపజయా లనే ముళ్ళను గూడా త్రొక్కుకుంటూ వెళ్ళవలసి యుంటుంది. పేరు గొప్పల విషయమటుంచి వారాల తరబడి ఒక్కొక్కప్పుడు వారికి ఉత్తరములు, వార్తలు గూడా అందవు. రైళ్ళు, మోటార్లు మొదలగు వాటికి ఎంతో దూరంగా తిరగవలసి వస్తుంది. అతని పేరు ఎవరికీ తెలియదు. అతనికి అన్నం దొరకడమే కష్టమై పోతుంది. పార్టీలకు అతీతంగా ప్రజాస్వామిక భావ సందేశ వాహకుడగుటచేత విభిన్న

పక్షాలకు చెందిన మేధావులు వీరికి దూరంగానే ఉంటారు. భూపంపిణీ అవకాశము ప్రత్యక్షముగా వచ్చినప్పుడు భూ సేకరణలో వీరెంత నిజాయతీతో పనిచేశారనేది పరీక్షింప బడుతుంది.

తాను యే ప్రవృత్తితో ఈకార్యమును నెరవేరుస్తున్నాడు అను దానిపై సేవకుని చిత్తశుద్ధి ఆధారపడి యుంటుంది. వినోబా చెప్పినట్లుగా జన హృదయంలో నిద్రిస్తున్న అంతరాత్మను మేల్కొలిపే ఉద్దేశ్యంతో అతను పనిచేయునట్లయితే అతనికి తప్పక చిత్తశుద్ధి కలుగుతుంది. మానవునిలో సజ్జనత్వమే యిమిడి యున్నది అను నమ్మకముతో అతను కార్యరంగంలో ప్రవేశిస్తాడు. నేడున్న సాంఘిక వాతావరణములో అసమానతలతో కూడిన వర్తమాన ఆర్థిక వ్యవస్థల కారణంగా ఆ సజ్జనత్వం బయట పడక అణగబడి యుంటుంది. కారణాలు వెదికేపని సేవకునిది. బయట అతనికి కనబడకపోతే ముందు తనలోనే అతను వెతుక్కుంటాడు. దానివలననే అతనికి చిత్తశుద్ధి కలుగుతుంది. అకస్మాత్తుగా, అజ్ఞాతంగా యెచ్చటనుంచో మానవత్వం మెరుపువలె కనబడి నప్పటికి సేవకుని జీవితంపై గట్టి ప్రభావము వేయునట్టి విశ్వాసము అతనిలో కలుగుతుంది. మానవత్వ దర్శనము, దాని స్పర్శవలన సేవకుడు మానవుడగుటకు, మానవుని తయారు చేయుటకు తగు సహాయం లభిస్తుంది. మానవుని హృదయంలోనికి అతని సద్గుణాల ద్వారా ప్రవేశించుట వలన, సేవకుడు స్వయంగా సద్గుణాల బాటన పయనిస్తాడు. ఇంతేగాక సేవకుని చిత్తశుద్ధికి ఈ యజ్ఞములో మరెన్నో అవకాశము లున్నవి. అనుదినమూ విభిన్న రీతులకు

చెందిన వ్యక్తులతో కలుస్తూ యుండుటవల్ల సహజముగానే అతనిలో వినయము, శీలము, ధైర్యము మొదలగు గుణములు వికసిస్తాయి. దరిద్ర నారాయణుని యెడల సానుభూతిని చూపు కార్యక్రమమును అతను చేపట్టుటచే సహజంగానే నిరాడంబరత్వమునకు ప్రేరణ కలుగుతుంది. పదయాత్ర మొదలగు సాధనము వలన అతని పరిశ్రమనిష్ఠ, ఆలోచనాశక్తి పెరుగుతవి.

భూదాన యజ్ఞములో దాత, గ్రహీత, కార్యకర్త ముగ్గురికీ త్రివిధములగు అంతఃశుద్ధి కలుగుతుంది. ఈ అంతఃశుద్ధి స్పర్శ యితరులకు కలుగక మానదు. ఈ విధముగా ఈయజ్ఞము లోని రెండవ ఉద్దేశ్యమగు వాతావరణశుద్ధి భూదాన యజ్ఞములో ఉత్తమోత్తమంగా పరిపూర్ణమౌతుంది.

యజ్ఞమునకు మూడవ ఉద్దేశ్యము ఫలప్రాప్తి. భూదాన యజ్ఞములో పొందవలసిన ఫలప్రాప్తి యొక్క తాత్కాలిక స్వరూపము స్పష్టమే. గ్రామంలోని మొత్తంభూమి గ్రామీకరణం చేయవలసి యున్నది. పల్లెసీమలలో ప్రేమ భావము స్థాపించవలసి యున్నది. కుటుంబ భావమును విశాలము చేస్తూ "వసుధైవ కుటుంబకమ్" వైపు తొలి అడుగు వేయవలసి యున్నది. అయితే భూదాన యజ్ఞములో మనము పొందవలసిన ఫలప్రాప్తి కేవలము భూమి పునర్వితరణ వల్లనే వచ్చునది కాదు. భూదాన యజ్ఞము వెనుక సామ్యయోగమనే మూలతత్వమున్నది. సామ్యయోగము మరియు భూదాన యజ్ఞము యొక్క రాజకీయ, సాంస్కృతిక రంగముల గురించి ముందు

అధ్యాయములలో చర్చిద్దాము. వినోబా పదేపదే ఉపయో గిస్తున్న ఒక పదమును, గాంధీజీ తాను ఆశించిన స్వరాజ్యమును చిత్రించుటకు ఉపయోగించు పదమును గురించి యిప్పుడు చర్చిద్దాము. ఆ శబ్దమే 'రామరాజ్యము.' కొంతమందికి రామ రాజ్యము శబ్దములో ప్రాచీనత్వపు వాసన కొడితే మరికొంత మందికి అందు మత మౌఢ్యము కనిపిస్తుంది. మనదేశపు ప్రజా నీకం ప్రజాస్వామ్యం, సోషలిస్టు నిర్మాణం మొదలగు శబ్దముల కంటె రామరాజ్య మను శబ్దమునకు చక్కగా అర్థము చేసు కొని యున్నది. దేశంనాడి ఎలాఉందో గాంధీజీకి తెలుసును. అంతేగాక వారు ప్రజల కర్థమయ్యే భాషలో మాట్లాడేవారు. భూదాన యజ్ఞములో మనము పొందవలసిన ఫలమును వినోబా రామరాజ్యమన్నారు. తులసీదాసు శబ్దములో మనము ఆ రామ రాజ్యమునకు వ్యాఖ్య యేమిటో చూద్దాము. పరాధీనులైన వారికి కలలోనైనా సుఖము కల్ల అని ఆయన నేర్పిన మహో మంత్రమును దేశవాసులు కంఠస్థం చేశారు. ఈ మంత్రములో మన మొదటికోర్కె స్వాతంత్ర్యం నినదించింది. అదేవిధంగా గోస్వామి తులసీదాసు రామరాజ్యమునుగురించి ఈ క్రింది విధ ముగా వర్ణించిరి.

"బైర్ న కరహి కాహూ సన కోయీ
రామ ప్రతాప విషమతా ఖోయీ"

(ఎక్కడా ఎవరూ వైరములు పెట్టుకునేవారు కాదు. ఎందు చేతనంటే రాముని ప్రతాపమువల్ల అతని రాజ్యములో అసమానతలు లేకుండా పోయాయి.)

ఇందు మొదటిభాగమును ఫ్రాన్సు విప్లవభాషలోనికి అనువదిస్తే "సౌభ్రాత్రము" అవుతుంది. రెండవభాగమునకు అర్థము "సమానత్వము" అవుతుంది. ఈవిధంగా ఆవిప్లవభాషలో రామరాజ్యమంటే స్వాతంత్ర్యము, సమానత్వము, సౌభ్రాత్రము అని అర్థమవుతుంది. ఈమూడు పదములను ఫ్రాన్సు దేశం ప్రసాదించింది. అయితే ఆదేశ విప్లవము ఒక్క విషయాన్ని మాత్రమే సాధించగలిగింది. అది స్వాతంత్ర్యము, సమానత్వము, సౌభ్రాత్రము వెనకబడిపోయాయి. ఆ తరువాత ప్రపంచము మరొక విప్లవమును, రష్యా విప్లవమును చూచినది. అందు సమానత్వము కొంతవరకు సాధింపబడింది. అందు సౌభ్రాత్రమనే విషయాన్నటుంచినా, స్వాతంత్ర్యంకూడ అణిచి వేయబడింది. కాని మనదేశంలో నేడు సాగుతున్న విప్లవాన్ని బాపూ సౌభ్రాత్రంతో ఆరంభించారు. సౌభ్రాత్రంద్వారాబాపూ స్వాతంత్ర్యాన్ని సాధించారు. వినోబా వారి అడుగుజాడలలోనే వెళ్ళుతూ సౌభ్రాత్రముద్వారా స్వాతంత్ర్యాన్ని స్థిరంచేస్తూ సమానత్వాన్ని సాధించాలని కోరుతున్నారు. ఈ విధంగా భూదానయజ్ఞం ప్రపంచ చరిత్రలో ఒక విచిత్రమైన పుటగా తయారగుచున్నట్లు మనం చూస్తున్నాము. యదార్థంగా ఈ ప్రేమమయ విప్లవంద్వారా వినోబా ప్రపంచాన్ని అహింసవైపు ఒక అడుగుముందుకు జరిపారు. బుద్ధుడు, మహావీరుడు, ఏసుక్రీస్తు ప్రపంచానికి అహింసను ప్రసాదించారు. ఐతే అది వ్యక్తిగత రంగమువరకే పరిమితమై యుండెను. గాంధీజీ మరొక అడుగు ముందుకువేసి సత్యాగ్రహమనే అమోఘ అస్త్రముద్వారా అహింసను రాజ

కీయ రంగములోనికి ప్రవేశింపజేసిరి. నేడు వినోబా అదే అహింసను భూదానయజ్ఞముద్వారా ఆర్థిక రంగములోనికి ప్రవేశపెట్టుచున్నారు.



# 4

# తాత్త్విక భూమిక - 2

ఒక్కొక్కప్పుడు వినోబాచెప్పే మాటలు ప్రజలకు ఊపి ఊపి దెబ్బకొట్టినట్లుంటాయి. విద్యావంతులనబడే వారిలో కొంత మందికి వినోబా మాటలలో అహంకారం ధ్వనిస్తుంది. ఐతే వారి ఒక్కొక్క వాక్యము వెనుక దీర్ఘమైన తపస్య లోతైన ఆలోచన బలము ఉన్నది. జడము, చేతనము శబ్దములకు అర్థము చెబుతూ, ''జడము ఎంతగొప్పదైనప్పటికి, చైతన్యము ఎంత కొద్దిదైనప్పటికి జడముకన్న చైతన్యమునకే మహత్వ మెక్కువ. హిమాలయము గొప్పదే అయినప్పటికి అది జడము. వినోబా కొద్ది మనిషే అయినా చైతన్యము. వినోబా తలచుకుంటే హిమాలయములను ఉత్తరమునుండి దక్షిణమునకు విసిరి పార వేయ గలడు'' అని వినోబా అన్నప్పుడు విన్నవాళ్ళు ఆశ్చర్యములో మునిగిపోయారు. అయితే వినోబా వెంటనే రెండవ వాక్యములో ఈ వాక్యముయొక్క అర్థము తెలియజెప్పినప్పుడు శ్రోతలలో నవచైతన్యం కలిగింది. ఆయన ఇస్తున్న పోలిక హిమాలయానికి, వినోబాకి కాదు. జడమునకు, చైతన్యమునకు. ఆయన రెండవవాక్యములో ఇలా అన్నారు: ''వినోబా

చైతన్యము; రేపు ఆయన టిబెట్టు వెళ్ళితే హిమాలయము తనంత తానే దక్షిణానికి దిగిపోతుంది.'' హిమాలయము ఎంతకోరినా పీసమంతైనా జరగలేదనుకోండి. భాషలో చమత్కార మున్నప్పటికి దానివెనుక ఆలోచన ఉన్నది.

ఉత్తరప్రదేశ్‌లోని అక్బరుపూరునుండి వినోబా భారత వాసులనుద్దేశించి ఒక విజ్ఞప్తి చేశారు. ఆ విజ్ఞప్తిలో భూదాన యజ్ఞమును గురించి మూడు విషయాలు నొక్కి చెప్పారు. ఆ మూడు ఎటువంటివిషయాలంటే వాటిని చదువుటతోనే తొలిగా భూమిని హస్తాంతరితంచేసే ఈ ప్రయోగం గురించిఇంత గొప్పగా చాటుకోవలసిన అవసరమేమున్నది అని అనిపిస్తుంది.

కాని లోతుకువెళ్ళిచూస్తే ఈ మూడు విషయాలు భూదానయజ్ఞముయొక్క తాత్విక భూమికను స్పష్టంచేయగలవని తెలియగలదు. ఆమూడు విషయాలు ఏమిటో చూద్దాము. వినోబా తనవిజ్ఞప్తిలో యిలా అన్నారు: ''నాయీ కార్యములో మూడు విషయములున్నాయి. మొదటిది, ఇది భారతీయ సంస్కృతికి అనుకూలమయినది. రెండవది, ఇందు సాంఘిక ఆర్థిక విప్లవమునకు వలయు బీజము లున్నవి. మూడవది ప్రపంచంలో శాంతి స్థాపనకు ఇది సహాయకారి కాగలుగుతుంది.''

ఈ కార్యక్రమము భారతీయ సంస్కృతికి అనుకూలంగా యున్నదా ? ఉపనిషత్తులు, గీత, వర్ణాశ్రమవ్యవస్థ, ఋషి పరంపరకు అనుకూలముగా ఉన్నదా ? ఆఁ. ఉన్నది ! భూమి మన తల్లియని, వేదాలు మనకు తెలిపాయి. కాని నేడు ఆమె పుత్రులు ఆమెకు యజమాని కావాలని కోరుతున్నారు. ఈ

పాపాన్ని తొలగించి యాజమాన్య విసర్జనమనే కార్యక్రమమును భూదానయజ్ఞం మనకు సమర్పించింది. ఉపనిషత్తులు మనకు యిలా తెలిపాయి:

"ఈశ్వరావాసమే ఈ జగత్తంతా
దానివల్లనే ఇచట జీవితము వ్యాప్తమాయె
కనుక వారి పేర నీకు లభించునదెల్ల
ముందు త్యజించి ఆపైన భోగించు."

ఈశావాస్యోపనిషత్తులోని ఈ మంత్రమును ఆధునిక జీవితములో సార్థకము చేయు ప్రయత్నమే భూదానయజ్ఞము. సంపదను ఈశ్వర ప్రసాదమని ఇది భావించింది. 'త్యక్తేన భుఞ్జీథాః' (త్యాగంచేసి భోగించు) అనునది దీని నీతిసూత్రమైంది. గీతాతత్వ జ్ఞానముపైనే వినోబా జీవితమంతా ఆధారపడి యున్నది. వారి తపస్సు యొక్క పరిపక్వ స్వరూపముగా వారికి సాక్షాత్కరించిన ఈ యజ్ఞము అన్ని విధములా గీతలోని ఆదేశములతో సుసజ్జితమైయున్నది. అందుచేతనే 'గీతా ప్రవచనములు' చదివి అర్థము చేసుకొన్నవారు తప్పక దానమివ్వగలరనే నమ్మకమును వినోబా పదేపదే ప్రకటిస్తూ యుంటారు. "పార్థ! తలఁపునం గొలిపెడు వలపులెల్లఁ బాదుకొననీయక విడచివైచి," అని గీతయొక్క ఆదర్శమూర్తి స్థితప్రజ్ఞుని లక్షణములను చెప్ప నారంభించి, వర్ణన పూర్తిచేసిన తర్వాత కూడ—"పోవిడిచి యాసలెల్ల, నే పూరుషుండు పరగుచుండునొ విషయ లంపటుఁడుగాక,... యాతడు శాంతిని వహించు" అని చెప్పి, భగవానుడును ప్రకరణాన్ని పూర్తి చేశారు. భూదానయజ్ఞం కోర్కెలను విసర్జించు కార్య

క్రమం కాక మరేమిటి? ఇంతకంటె ఎక్కువ చెప్పవలసిందే ముంది? భూదాన యజ్ఞమునకు చెందిన మొత్తం పరిభాషను వినోబా గీతనుండి సేకరించారు. దానము, యజ్ఞము, తపము, సామ్యయోగము అనే శబ్దమును గూడా వినోబా గీతనుండి సేకరించినదే.* గీతలోని 6 వ అధ్యాయములో 29 వ శ్లోకమునుండి 32 వ శ్లోకమువరకు సామ్యయోగి యొక్క సమగ్ర దర్శనమున్నది. ఆ పైన 33 వ శ్లోకములో సామ్యము నుండి నిరూపింపబడు యోగమును గురించి అర్జునుడు ప్రశ్నిస్తాడు.

---

*నిఖిల భూతజాలంబు లోని తన యాత్మ,
నఖిల భూతంబులను దనయాత్మయందుఁ,
గనుగొనంగల్గు సతత యోగస్థితాత్ముఁ
డంతట నొకటియే చూచునట్టివాఁడు. 29

ఎవఁడు నన్నుఁ గనుగొనునో యెల్లయెడల,
నన్నిటినిగూడ నటులె నాయందుఁ గనునో,
అతని కే నగపడక మాయమయిపోను;
ఆతఁడునుగూడ నాకు మాయమయిపోఁడు. 30

అన్నిభూతము లందున్న నన్నెవండు
కొలుచునో యేకభావముం గుదురుచుకొని,
అన్ని తెఱఁగుల వృత్తులం దున్నఁగాని
ఆ మహాయోగి నాయందె యలరి మెలగు. 31

తనది యట్టులగానె యంతటనుగూడ
సమముగాఁ జూచునో యెవండు—సవ్యసాచి!
సుగము నగుఁగాక, నొగులు నే యగుగాక,
ఆతఁడు పరమయోగిగా నభిమతుండు. 32

( గీతా సంవాదం 6 వ అధ్యాయము )

భారతీయ సంస్కృతిలో సమాజ నిర్మాణం కొరకు యేవర్ణ వ్యవస్థయితే ఊహించ బడిందో భూదాన యజ్ఞము ఆ వూహకు అనుకూలముగా కూడ ఉన్నది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులగు నాలుగు వర్ణములలోను వైశ్యులను వదిలితే మిగిలిన మూడు వర్ణములకు సంపదను కూడ బెట్టుటను భావమేలేదు. వైశ్యులకు కూడ బ్రహ్మచర్యాశ్రమము, వానప్రస్థాశ్రమము, సన్యాసాశ్రమములందు సంపద కూడబెట్టుట నిషిద్ధము. గృహస్థాశ్రమమునందు కూడ ఇతర వర్ణములను పోషించుటకే సంపదను కూడ బెట్టుటకు అనుమతి ఈయబడినది. గృహస్థాశ్రమముయొక్క ఆదర్శము సహజముగానూ, త్వరితముగానూ వానప్రస్థాశ్రమమును చేరుటయై యున్నది. యుగ యుగములనుండి భారతీయ యోగులుకూడా ఈ త్యాగవాణినే పలికారు. యోగ శిరోమణి కబీరు ఈ విధముగా చెప్పారు.

"నావలో నీరు వచ్చినా, మరి యింటిలో ధనముచేరినా
రెండు చేతుల బయటకి నెట్టుటే వివేకవంతుల పనిగాద."

కబీరు చెప్పిన ఈ ఉపమానము వినోబాకు ఎంతో ప్రియమైనది. పదేపదే దీనిని వివరముగా తెలియచెబుతూ వినోబా మీకెన్నో సారులు కనబడుతారు. ఇదే విధముగా గోస్వామి, తులసీదాసు రచించిన "భూమంతా గోపాలునిదే", "సంపదంతా రఘుపతిదే" అను రెండు వాక్యములు భూదాన, సంపత్తిదాన యజ్ఞములకు మూలమంత్రము లైనాయి. అయితే వినోబా ఈ యోగపురుషుల వాణిని మరొకసారి వల్లెవేస్తున్నా

రందామా ? వినోబా ఋషి పరంపరకు చెందినవారు కాబట్టి ఋషుల, యోగుల వాణిని వారి ముఖతః మీరు పదేపదే వింటారనుట సరియైనదే. అయితే గాంధీజీ వాణిలో యున్నట్లు గానే వినోబా వాణిలో గూడ ఒక ప్రత్యేకత యున్నది. సత్యము, అహింస, అస్తేయము, అపరిగ్రహము ఋషుల, యోగపురుషుల వాణిలో వ్యక్తిగత గుణములుగా మాత్రమే కనబడితే, గాంధీ-వినోబాలు వాటిని సాంఘిక విలువలలోనికి మార్చారు. ఈ విధముగా వ్యక్తిగత గుణములు సాంఘిక విలువలైనప్పుడు వానిలో సమాజ క్రాంతికి అవసరమగు శక్తి వస్తుంది. సత్యము, అహింస, వ్యక్తిగత గుణములని వాటిని తమ వ్యక్తిగత జీవితములో ఆచరించుట అత్యంత అవసరమని ప్రజలు అనుకుంటారు. కాని దేశ దేశాలమధ్య అసత్యాచరణ రాజకీయ ప్రత్యేకతగా భావింపబడుతూ యుంది. మరియు హింసకు యుద్ధమనే పేరుపెట్టి దానిని పూజిస్తూ కవిశ్రేణ్యులు మహాకావ్యములు వ్రాస్తున్నారు. గాంధీజీ సత్యాగ్రహము, సత్యాహింసలను సాంఘిక విలువలుగా రూపొందించుటచే వానికి మహిమాన్వితమైన బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఎదుర్కొన గలిగే శక్తి వచ్చింది. సత్యాగ్రహముద్వారా భయాన్ని నిర సించి గాంధీజీ ఏ సేవ చేశారో దానినే వినోబా భూదాన యజ్ఞము ద్వారా లోభమును నిరసించి చేయుచున్నారు. అపరిగ్రహము, అస్తేయము అను గుణముల సాంఘిక వినియోగములోని ఆశయ మేమంటే సమాజములో దొంగతనమును ఏవిధముగా సాంఘిక పాపమని ఎంచుతున్నామో అదేవిధముగా అనుచిత

సంగ్రహమును కూడా సాంఘిక పాపముగా యెంచవలెను. స్వామి రామకృష్ణ తన స్వీయ జీవితములో ప్రయోగించి సఫలులైన కాంచనముక్తినే వినోబా తన స్వప్నాల పంటయగు సామ్యయోగ సమాజ సామూహిక జీవనములో సఫలముచేయ కుతూహలపడుతున్నారు.

వేదములు, ఉపనిషత్తులు, ఋషులు, యోగపురుషులు మొదలగు వారందరినోట యే అపరిగ్రహమంత్రమైతే ఉచ్చరింపబడిందో దానికి సాంఘిక, సామూహిక రూపమును నేడు భూదానయజ్ఞములో చూచుచున్నాము. యదార్థానికి వినోబా నోట నేడు భారతీయ సంస్కృతి ఉచ్చైస్స్వరముతో వెలువడుచున్నది.

భూదానయజ్ఞము గురించి, అందు సాంఘిక, ఆర్థిక విప్లవమునకు బీజములున్నవనుట రెండవ విషయము. ఈ విషయాన్ని అర్థం చేసుకొనుటకు ముందుగా మన ఆర్థిక సమస్యయేమిటో తెలుసుకొన వలసియున్నది. ఆకలి ఉన్నవానికి అన్నంలేదు, అన్నం ఉన్నవానికి ఆకలిలేదు. మన ఆర్థికవిధానము వల్ల ఈసమస్య ఉదయించింది. మన ఆర్థికవిధానము పెట్టుబడిదారీ ఆర్థికవిధానము. ప్రతివ్యక్తీ తాను అభివృద్ధి చెందితే సమాజం తనంతట తనే అభివృద్ధిచెందుతుంది అనునది పెట్టుబడిదారీ సిద్ధాంతము. పెట్టుబడిదారీ విధానము 'అతి తక్కువకూలికి అత్యధికమైనపని' అనురీతిలో తన చతురతను చూచుకొంటుంది. పై సూత్రము ననుసరించి సమాజమందు ప్రతివ్యక్తీ తన అభివృద్ధి

కొరకు తనపరిస్థితి, బుద్ధి శక్త్యానుసారముగా కనీసము పనిచేసి అత్యధికమైన ప్రతిఫలము పొందవలెనని ప్రయత్నించుచున్నాడు. దాని ఫలితముగా స్వార్థములు పరస్పరము గ్రుద్దులాడు కొను చున్నవి. "నా" అభివృద్ధియందు "నీకు" అధోగతికలుగుటగూడా అందు సంభవించును. డాక్టరు అభివృద్ధి డబ్బు సంపాదించుటయందే ఉంటే రోగులసంఖ్యనుబట్టి డాక్టరు సంపాదన పెరుగుతుంది. కనుక, ప్రజలు అత్యధికముగా జబ్బుపడుటయందే డాక్టరు స్వార్థము యిమిడియున్నది. రోగియొక్క స్వార్థము జబ్బుపడ కుండా యుండుట యందున్నది. మరియు డాక్టరు స్వార్థము ఇతరులు ఎక్కువగా జబ్బుపడుట యందున్నది. ఈ విధముగా ఈయిద్దరి స్వార్థములు పరస్పరం సంఘర్షించుకొనుచున్నవి. ఒకరి అవకాశము మరొకరి ఆపదగానూ, ఒకరి ఆపద మరొకరి అవ కాశముగానూ సంఘటిల్లుచున్నవి. ఇదే పెట్టుబడిదారీ విధాన ములో అంతర్గతమైయున్న వైరుధ్యము. ఆ విధానమును ఆ వైరుధ్యమే నాశనమొనరించును. పెట్టుబడిదారీ విధానమును నాశనము చేయుటకు బయటనుంచి యే ప్రత్యేక కారణములు అవసరములేదు. తన అంతర్గతవైరుధ్య కారణంగానే అది నాశన మౌతుంది. తన అంతర్గత వైరుధ్యముల కారణంగా ఆత్మ హత్య చేసుకునే పెట్టుబడిదారీ సమాజనిర్మాణముతో మనము ఎందుకు అంటిపెట్టుకుని ఉండవలెననునది మనముందు ఉన్న ప్రశ్న. ఈ సామాజిక ఆత్మహత్యనుండి మనము రక్షింపబడవలె నంటే ఈ సమాజనిర్మాణమునే మార్చవలసియున్నది. నేటి సమాజ నిర్మాణ విలువలలో పునాదులనుంచి మార్పు తేవలసి

యున్నది. ఒకరు మరొకరిని పీడించుకోనట్టి వ్యక్తుల, సమాజముల స్వార్థములు పరస్పర విరోధులైనవిగా కాకుండా సహాయకారులుగా యుండునట్టి క్రొత్తవిలువలను స్థిరీకరించవలసియున్నది. ఈ విలువల పరివర్తనప్రక్రియను క్రాంతి అంటారు. భూదాన యజ్ఞమందు పెట్టుబడిదారీ విధానములోని రెండు పునాది విలువలను మార్చవలసియున్నది. అవి లాభము, యాజమాన్యభావము. ఈ రెండూ పెట్టుబడిదారీ విధానములోని రెండు విలువలు. ఈ విలువలపైననే ఆ సమాజము ఆధారపడియున్నది. లాభమునకు బదులుగా వినోబా దానమనే క్రొత్త విలువ నిచ్చారు; యాజమాన్యమునకు బదులుగా ప్రసాదింపబడిన క్రొత్తవిలువే యజ్ఞం. వినోబా ప్రసాదించిన దానము, యజ్ఞములలో లాభము, యాజమాన్యములను విసర్జించవలెనను సంకేతమున్నది. నావద్ద 25 రొట్టెలుండి 5 రొట్టెలతోనే పొట్ట నిండుతూ యుండుటవల్ల మిగిలిన 20 రొట్టెలు నేను పంచినట్లయితే అది నా లాభము పంచినట్లవుతుంది. ఇది దానమవుతుంది. ధనవంతులు, భూస్వాములు యిచ్చునది దానము. నావద్ద 3 రొట్టెలుండి, 5 రొట్టెలుంటేనేగాని నా ఆకలి తీరని పరిస్థితిలో, నాకన్న ఆకలిగొన్న వానినిచూచి నాకున్న 3 రొట్టెలలో $1\frac{1}{2}$ రొట్టె యిచ్చినట్లయితే నేను నా యాజమాన్యపు హక్కులోనుంచి పంచియిచ్చినట్లవుతుంది. అది యజ్ఞమవుతుంది. పేదవారు చేయునది యజ్ఞము. విప్లవమునకు 3 విషయములు అవసరములై యున్నవి — విప్లవయుద్దేశ్యము, విలువలలో మార్పు మరియు విప్లవ చిహ్నము. విలువల మార్పుగురించి

సంక్షేపంలో పైన చర్చించాము. ఇప్పుడు విప్లవ యుద్దేశ్యము, కార్యక్రమము. చిహ్నముల గురించి కొంత చర్చిద్దాము.

మన విప్లవోద్దేశ్యము స్పష్టము. ధనిక తత్వమును, పేదరికమును బాపి ధనికులను పేదలను రక్షించగోరుచున్నాము. ధనికుణ్ణి నాశనము చేయకుండా ధనిక తత్వమును బాపగలమా అని ప్రశ్న ఉదయించ వచ్చును. భూస్వామిని చంపకుండా భూమిని పంచగలమా అను అనుమానం తగలవచ్చును. ఆంగ్లేయు లను చంపనక్కర లేకుండానే ఆంగ్లేయ ప్రభుత్వం తొలగింది. రాజులను చంపనక్కర లేకుండానే రాజ్యాలు సమసి పోయాయి. ఇక ఆపైన ధనికుణ్ణి చంపకుండా ధనిక తత్వమును, భూస్వామిని చంపనక్కర లేకుండా భూస్వామ్య విధానమును తొలగించలేమనుట అపసిద్ధాంతమే కాగలదు. ఈ సిద్ధాంత మును జీవితములోని రెండు క్షేత్రములకు వర్తింప చేయండి. ఉపాధ్యాయుని వద్దకువెళ్ళి అజ్ఞానిని చంపకుండా అజ్ఞానము తొలగదని, ఆరోగ్య రంగములో డాక్టరు వద్దకువెళ్ళి రోగిని చంపకుండా రోగము కుదరదని అంటామా? విద్య, ఆరోగ్య రంగములలో ఉపాధ్యాయుడు, డాక్టర్ల పురుషార్థము అజ్ఞా నము, రోగములను బాపి అజ్ఞానిని, రోగిని ఉద్ధరించుటయందే గలదు. సరిగ్గా ఈవిధముగానే ఆర్థిక రంగములో పేదరికమును బాపి, పేదవానిని, ధనిక తత్వము బాపి ధనికుని ఉద్ధరించుట యందే విప్లవవాదుల పురుషార్థము ఉన్నది. ఇదే ఉద్దేశ్యము పీడన రహిత సమాజ నిర్మాణమందును, సర్వోదయము లేక సామ్యయోగమందును ఉన్నది. ఆకలి గొన్నవానివద్ద అన్నాన్ని

ఉత్పత్తిచేయు సాధనములు ఉండకూడదు అనునది సామ్యయోగ సమాజనిర్మాణమునకు కార్యక్రమములు. అంటే ఉత్పత్తి సాధనములను ఉత్పత్తిదారుల చెంతకుచేర్చి ఉత్పత్తి చేయనివారికున్న యాజమాన్యమును తొలగించుట విప్లవము యొక్క కార్యక్రమము. ఈ కార్యక్రమమును అమలు పెట్టుటకు యేయే సాధనములను ఉపయోగించ వలెను అను విషయములందే అభిప్రాయ భేదములకు ఆవకాశము లేర్పడుచున్నవి. విప్లవము అవసరము. అవసరమైన వస్తువులు వాటి అవసరములు కలిగిన వారివద్ద యుండవలెను—ఉత్పత్తి సాధనములు ఉత్పత్తిదారులవద్దనే యుండవలెను. మరియు ఉత్పత్తిచేయని వారివద్ద ఉన్న యాజమాన్యము తొలగించుట—ఇది విప్లవమునకు కార్యక్రమములు కాదగునని చెప్పువరకు మేధావంతు లందరూ అంగీకరింతురు.

సాధనముల గురించి చర్చిస్తూ వినోబా చక్కగా మార్గమును చూపిరి. నేటివరకు విప్లవముకొరకు యేసాధనములైతే ఉపయోగింపబడినవో వాటిలోనే నేను విప్లవము తెచ్చుచున్నానని వినోబా అంటున్నారు. నేటివరకు ప్రపంచం రెండు దారులను పరీక్షించినది. ఒకటి: హింసామార్గము, మరొకటి ప్రభుత్వశాసనము. వినోబా నేడు మూడవ బాటను పరీక్షిస్తున్నారు. అది కరుణ, ప్రేమకు చెందినమార్గము. హింస, ప్రభుత్వ: శాసనము, కరుణ అను మూడు దారులు వరుసగా తామస, రాజస, సాత్వికములు. ఈ మూడింటిని సంక్షేపములో పోల్చి చూచుట ఇచ్చట అప్రస్తుతము కాదనుకుంటాను.

భూదాన యజ్ఞము హింసామార్గమును నిషేధించుచున్నది. అంటే బుద్ధుడు, మహావీరుడు, ఏసుక్రీస్తు మరియు గాంధీ మనకు అహింసను ఉపదేశించారని అలా చేయుటలేదు. విప్లవకారులు ఎన్నడూ దైవమిచ్చే తుదిసందేశమును మోసుకుపోవువారుకారు. "మహమ్మదు ప్రవక్త చెప్పిన శబ్దములే చివరి పదములు. ఆపైన క్రొత్తతాత్వికులు రావీలులేదు; కారల్ మార్క్సు చెప్పినది విప్లవమునకు చివరిమార్గము. అందులో మరి మార్పుచేయ వీలులేదు; గాంధీజీ చెప్పినదే చిట్టచివరి తత్వము. యిక అంతకంటే ముందుకుసాగ వీలులేదు," అని అనుకొనుట పనికిమాలిన మూఢప్రవృత్తి. నిత్యము అభివృద్ధిచెందే జీవితముతో పాటుగా తన భావములను అభివృద్ధి చేసుకొనువాడే క్రాంతికారి. క్రాంతి యిష్టదేవత సరస్వతి ఆలోచనాశక్తిపైనే క్రాంతికి నమ్మకమున్నది గాని, యేదో ఒకవ్యక్తి చెప్పిన శబ్దములు తుదిమంటలని క్రాంతికారి భావించడు.

ఐనప్పటికి భూదానయజ్ఞమందు హింసాయుత మార్గం ఎందుకు నిషేధింపబడింది? ఎందుచేతనంటే హింసాయుత మార్గంవల్ల సమస్య పరిష్కారంకాదు: సరిగదా, ఒకదానికి బదులుగా మరొక సమస్య తలెత్తుతుంది. మనసు మార్చుటకు బదులుగా శిరస్సునే ఛేదించు మార్గమది. హింసామార్గంలో ఉన్న రెండవలోపము హత్యలవల్ల శాంతిరాదు. హింసవల్ల హింస పెరుగుతుంది. నిప్పుతో నిప్పు ఆరదు. హింసామార్గములో ఉండే మూడవలోపము హింసవల్లవచ్చే విప్లవానికి విప్లవ విద్రోహము (Counter-revolution) వచ్చే అవకాశం ఉన్నది.

పంచం మొత్తంలో జరిగిన హింసాయుత విప్లవాలన్నిటా
రిగిన అనుభవమే యిది. మన విప్లవము యేవిధముగా
ఁటుందంటే, యేవర్గాన్నైతే మనం పరివర్తనం చేయవలసి
యున్నదో ఆవర్గం సహకారం మనకు లభిస్తుంది. అందుచేత,
ందు విప్లవవిద్రోహమునకు అవకాశమే ఉండదు. హింసా
ార్గంలో ఉండే పెద్దలోపమేమంటే అది ఎన్నటికి ప్రజా
్వామిక మార్గం కాజాలదు. హింస యెన్నటికీ అందరికీ చెందిన
స్త్రము కాజాలదు. అది యెప్పటికీ కొంతమంది తరిఫీదు
ొందిన సైనికుల ఆయుధముగానే ఉండిపోతుంది. హింసాయుత
ార్గంవల్ల జరిగే విప్లవంనుంచి చివరకు సైనికరాజ్యమే ఉద్భ
స్తుంది. కాని, ప్రజారాజ్యం రాజాలదు. హింసామార్గమునకు
్యతిరేకముగా వాదించవలసిన అవసరములేదు. నేడు హింసా
ార్గాన్ని ప్రస్తావించేవారు కూడా శాంతిపేరు మీదనే దానిని
మర్థిస్తున్నారు.

ప్రభుత్వ శాసనమార్గం దానికంటె ఎక్కువగా మోహ
మును కల్పించునదై యున్నది. శాసన నిర్మాణమునకుగాను,
క్క కలంపోటుతో కాదగిన పనికిగాను వినోబా ఈ విధంగా
ఇంటింటికీ ఎందుకు తిరుగుతున్నారు? హింసామార్గాన్ని
షేధించినట్లుగా ప్రభుత్వ శాసన మార్గము వినోబా నిషేధిం
పట లేదనేది మనము స్పష్టముగా తెలుసుకోవాలి. ఇక గ్రామం
ోని భూమి యంతటికి గ్రామమే యజమాని అని ఢిల్లీలోని
ార్లమెంటులో శాసనముచేస్తే వినోబా అందుకు వ్యతిరేక
ముగా ఉపవాసముగాని, పికెటింగుగాని చేయబోరు. మీదు

మిక్కిలి వారు అట్టిదానిని ఆహ్వానిస్తారు. ఐతే ప్రభుత్వశాసనమునకున్న హద్దులు వారికి తెలుసును. అందుచేత ఎక్కువ ఉచితమైనదీ, ఎక్కువ లోతులను తాకునది అగు మార్గమును వారు చేపట్టిరి.

ప్రభుత్వ శాసనమునకున్న హద్దులెవ్వి? ప్రభుత్వశాసనం అత్యధికంగా యేమైనా చేయగలిగితే చెడు ప్రవృత్తులనుండి మానవుని ఆపగలుగుతుంది. అంతేగాని అది వ్యక్తిని సత్ప్రవృత్తి వైపు ప్రేరేపించలేదు. ప్రభుత్వ శాసనము చెడునుంచి ఆపగలదే గాని మంచికి ప్రేరణ కలిగించలేదు. ప్రభుత్వ శాసనమునకుండే రెండవ హద్దు: అది హక్కునిస్తుందేగాని ఆ హక్కును ఉపయోగించుకొనే శక్తి నివ్వలేదు. శాసనములో యుండే మరొక బలహీనత ఏమంటే అది యెంత మంచిశాసనమైనప్పటికి ప్రజాభిప్రాయ సహకారములేనిదే ఆచరణలోనికి రాలేదు. పెట్టుబడిదారీ విధానములో శాసనమునకు ఆధారము ధనమౌతుంది. సైనిక ప్రభుత్వమందు శాసనమునకు ఆధారము ఆయుధబలమౌతుంది. చైతన్యవంతమైన ప్రజాభిప్రాయ బలము శాసనము వెనుక యుండనంత వరకు శాసనము నిష్ఫలమౌతుంది. ప్రజాభిప్రాయము యేవిధముగా చైతన్యవంతమవుతుంది? భూదాన యజ్ఞమువంటి ప్రజా ఉద్యమము ద్వారానే ప్రజాభిప్రాయము చైతన్యవంతము కాగలదు. భూమిమీద యాజమాన్యం కేవలము భగవంతునిదే. అంటే సమాజానిది అని భారతదేశంలోని చిన్న చిన్న పిల్లలు గూడా చెప్ప మొదలుపెట్టి

నప్పుడు వ్యక్తిగత యాజమాన్యమును నిరసిస్తూ ప్రభుత్వం చట్టం చేయుటలో ఆలస్యం పట్టదు.

శాసన మార్గములో చట్టాల ఊబిలోనికి దిగబడే ప్రమాదం గూడా ఉన్నది. చట్టాలతో కూడుకున్న న్యాయ శాస్త్రపు ఊబి పద్మవ్యూహంవలె యుంటుంది. అందులో ప్రవేశించిన తరువాత సామాన్యమానవుడు అందులోనుండి బయట పడలేడు. ఈ చట్టాల చిక్కుని దురుపయోగం చేయుటకు ఒక దానివెంట మరొకటిగా కేసులు వేయుటకు, రాజ్యాంగమునే మార్పుచేయ యత్నించుటకు అవకాశములు లేకపోలేదు. దీనినే శాసన రంగములో విప్లవ విద్రోహము అంటారు **(Counter revolution in the legal sphere).**

మనకున్న మొత్తం శక్తి అంతా అట్టి స్థితిలో ఆ శాసన రంగములో వచ్చిన ప్రతిక్రాంతిని ఎదిరించుటకు సరిపోతుంది. ఈ శాసనముల దారిలో మరొక క్లిష్టత గూడా యున్నది. ఇరుపక్షాలలో శాసనమువల్ల ప్రేమగాక కలహము జనిస్తుంది. పేదరికాన్ని ధనిక తత్త్వాన్ని నిర్మూలించి, మానవుని మానవునికి సన్నిహితంగా తీసుకురావలెనేకాని వారిని దూరం చేయరాదు. శాసన మార్గంవల్ల మన ఈ ముఖ్య అభిప్రాయమే నష్టమౌతుంది. ధనిక తత్త్వమును, పేదరికమును నాశన మొనరించి వర్గములను నిర్మూలించుటకు వినోబా చేపట్టిన మార్గము కరుణామార్గము. కరుణ అంటే కేవలం దయ అనే కాదు. దయతోపాటు దానికి అనురూపమగు క్రియ గూడా యున్నప్పుడే అది కరుణ అవుతుంది. ఈ కరుణా విధానము మానవుని

మనస్సు మార్చుటపై ఆధారపడి యున్నది. కేవలం బాహ్య వస్తు పరివర్తనంతో ఈ విప్లవమునకు సంతృప్తిలేదు. మానసిక పరివర్తనం, ప్రవృత్తిపరివర్తనములను అది కోరుతున్నది. చరిత్రలో యింతవరకు రెండు విధముల ప్రయత్నములు జరిగినవి. కేవలం సమాజాన్ని మార్చుటకు, కేవలం వ్యక్తిని మార్చుటకు ఆ ప్రయత్నములు జరిగినవి. సమాజమును మాత్రము మార్చుటకు జరిగిన ప్రయత్నము వ్యక్తి నియంతృత్వమునకు దారి తీసినది. కేవలం వ్యక్తిని మార్చు ప్రయత్నము సమాజమును వదలి కొండగుహల్లో నిలిచిపోయింది. రెండూ ఏకాంగీణ మార్గములే అయినవి. భూదానయజ్ఞం వ్యక్తిని, సమాజమును ఒకరి సరసన మరొకరిని మార్చ యత్నిస్తోంది. అందుచేతనే దాని ద్వారా వచ్చు క్రాంతి భావపరివర్తనం, హృదయ పరివర్తనం. పరిస్థితి పరివర్తనం అను త్రివిధ కార్యక్రమములపై ఆధారపడి యున్నది. ఇది ఎట్టి త్రికోణమంటే ఒక భుజము యొక్క ప్రభావము మరొక భుజముపై పడుతూ యుంటుంది. భావ పరివర్తనం వల్ల పరిస్థితి మారుతుంది. పరిస్థితి మారుటవల్ల భావం మారుతుంది. భూదానయజ్ఞమందు కొంతమంది కాలప్రవాహము ను గమనించి, అర్థం చేసుకుని దానం యిస్తున్నారు. మరి కొంతమంది దరిద్రనారాయణునిఎడగల ప్రేమ, సానుభూతుల కారణంగా యిస్తున్నారు. ఇట్టివారి దానములవల్ల ఇతరులు గూడా దానమిచ్చునట్లుగా పరిస్థితులపై నైతిక ప్రభావము పడుతోంది. వేలకొద్ది రైతులు దానమిచ్చిన కారణంగా ఏర్పడిన నైతిక శక్తిని చూస్తూ పెద్ద పెద్ద భూస్వాములు తమ

భూములను దానమిచ్చారు. పరిస్థితుల పరివర్తన కారణంగా ఏర్పడిన మానసిక పరివర్తనమునకు యిది ఉదాహరణ.

మానవమాత్రునిలో యెక్కడో ఒకచోట యేదో కొంత మంచి అంశము దాగి యుందనే నమ్మకము కరుణమార్గంపై పయనించే వ్యక్తికి యుంటుంది. దానిని అన్వేషించుటకు అతను నిర్విరామయత్నం సాగిస్తాడు. కరుణమార్గం సఫలమౌతుందా, కాదా అనునది యిప్పుడింక చర్చించవలసిన విషయముగా మిగిలిలేదు. దాని సాఫల్యం నిరూపింపబడింది. లక్షలకొద్ది ప్రజ లిచ్చిన దానము, గ్రామదానముగావచ్చిన 1000 కంటె ఎక్కువగ్రామములు, ఎన్నో పవిత్ర సన్నివేశములు ఈ విషయ మును నిరూపించినవి. భూమిపై కష్టించి పనిచేయువారి పరి శ్రమద్వారా క్రొత్త యుగమారంభమవడం ఈక్రాంతికి చిహ్నం.

ప్రపంచంలో శాంతిస్థాపనకొరకు ఈ యజ్ఞంద్వారా సహాయం లభించగలదని వినోబా మూడవ విషయముగా పేర్కొన్నారు. ఎంత ఉన్నతమైన ప్రకటన యిది! చారెడు నేలను యిచ్చిపుచ్చుకొనుటతో ఎంత పెద్ద విషయాన్ని జోడిం చారు! ఈ విషయాన్ని అర్థం చేసుకొనుటకు ప్రపంచరంగస్థలిని సంక్షేపంగా సవినయులై అర్థము చేసుకొనవలసియున్నది. సామ్యవాద, పెట్టుబడిదారీ దేశములో ఒకరంటె మరొకరికి యేర్పడిన పరస్పరభయము కారణంగా పోనుపోను అత్యధిక మారణాయుధములను అన్వేషిస్తున్నవి. ఈ దేశములలో మొదటి వర్గమునకు చెందినవి (సామ్యవాది) నియంతృత్వమును నమ్మ తాయి. రెండవవర్గమునకు చెందినవి (పెట్టుబడిదారీ) ప్రజాస్వా

మికమును నమ్ముతాయి. నియంతృత్వము శీఘ్రముగా ఫలిత ముల నిస్తుంది. అందుచేత అది ఆకర్షణీయముగా కనబడుతుంది. కాని దానిని మనము స్వీకరించలేము. ఎందుచేతనంటే నియం తృత్వము మానవత్వమును నమ్మదు. ఆధునిక నియంతృత్వము నకు జన్మదాతయగు హిట్లరు తన జీవితముయొక్క మూల మంత్రమును గురించి "20 గాడిదలు కలిసిన ఒక మనిషికాడు" అని తన ఆత్మకథలో వ్రాసినాడు. అంటే తన ఇరుగుపొరుగు నుండే 20 గాడిదలపై రాజ్యము చలాయించుటకు తాను జన్మించానని హిట్లరు అనుకుంటున్నాడు. "తన యిరుగు పొరుగునుండే దేశాలను పాలించడం జర్మనీ హక్కు." "తన యిరుగుపొరుగునుండే జాతులను పాలించడం ఆర్యజాతి జన్మ హక్కు" మొదలగు సిద్ధాంతములు మానవునకు మానవ స్వాతంత్ర్యాన్ని యివ్వనిచ్చగించనట్టి సిద్ధాంతమునుండి ఉద్భవించి నవి. మానవుని మానవుడుగా అంగీకరించనట్టి సిద్ధాంతము ఎంత శీఘ్రముగా ఫలితముల నిచ్చునదియైనను దానిని మనము అంగీకరించలేము. ఇక మిగిలింది ప్రజాస్వామ్యం. నేడున్న పరి స్థితి యేమంటే ప్రజాస్వామ్య దేశములలో విప్లవశక్తి కనబడుట లేదు. పేదరికాన్ని, ధనికతత్వమును నిర్మూలించుటకు శక్తిలేని ప్రజాస్వామ్యమును ప్రజాస్వామ్యమనుటలో అర్థమేమున్నది ? అందుచేత ప్రపంచంలోయుండే ప్రజాస్వామిక దేశములన్నిటి యందు ప్రజాస్వామ్యంలో విప్లవశక్తిని ఎలా తెస్తాము అనేప్రశ్న యుంది. భూదానయజ్ఞము ఈ ప్రశ్నకే సమాధానము చెబు తుంది. మన ప్రజాస్వామ్యం సంఖ్యాబలము (**Quantitative**) పై

ఆధారపడియున్నంతకాలం, నామమాత్రంగా యున్నంతకాలం అందు విప్లవశక్తి జనించదు అని భూదానయజ్ఞం చెబుతోంది. దానికొరకు ప్రజాస్వామ్యపు పునాదులనుమార్చి వాటిని గుణ ప్రధానములు (Qualitative) గా నిర్మించవలసియున్నది. మానవ గుణములపై ఆధారపడకుండా కేవలము సంఖ్యాబలముపై ఆధారపడే ప్రజాస్వామిక మందు విప్లవశక్తి జనించదు. నామ మాత్రమైన ప్రజాస్వామికమందు అధికారము కేంద్రీకృతముగా ఉంటుంది. కాని సేవగా యుండదు. మానవగుణములకు బీజా రోపణము ఎక్కడనుంచి జరుగుతుంది? ఇందుకు వినోబా హింసాశక్తికి వ్యతిరేకమైన, దండశక్తిరహితమైన స్వతంత్ర జన శక్తిని నిర్మించాలని ఆహ్వానిస్తూ చాండిల్‌నందు యిచ్చిన భవ్య ప్రవచనము మనకు దారిచూపుతుంది.* ఈవిధమైన జనశక్తి వికసించినచోటే గుణాత్మక ప్రజాస్వామికం నిర్మాణం కాగలుగు తుంది. ఇట్టి జన్మశక్తి నిర్మింపబడుటకు త్యాగప్రధానమైన ప్రజా ఉద్యమమే ఏకైక ఉపాయము. అందుచేతనే భూదానయజ్ఞము విశ్వశాంతి దిశలో మార్గదర్శి అగుచున్నది. భూదానయజ్ఞంవల్ల ప్రజాస్వామ్యమందు యక్షప్రశ్నగా మిగిలిన పేదరికం, ధనికతత్వ మును నిర్మూలించు సమస్యనుపరిష్కరించే ప్రజాస్వామ్యమును నిర్మించుటకు తగు గుణవికాసమును కల్పించుటకు అవసరమైన జనశక్తి పెరుగుతుంది. ప్రజాస్వామంలో విప్లవశక్తివస్తే ప్రజా స్వామ్యం రక్షింపబడుతుంది. ప్రజాస్వామ్యం రక్షింపబడితే మాన వత్వం రక్షింపబడుతుంది.

---

* "సర్వోదయ వివరణ పత్రిక" వినోబా రచన చదవండి.

మరొక దృక్కోణమునుంచి ఈసమస్యను చూద్దాము. నేడురష్యా, అమెరికా రెండూకూడా శాంతినిగురించే మాట్లాడు తున్నాయి. శాంతి కొరకు రష్యా స్టాలిన్ బహుమతుల నిస్తూ ప్రతినిధివర్గములను విదేశములకు పంపుతూయుంది. కాని దేశం లోని ఆంతరంగిక సమస్యలను పరిష్కరించుకొనుటకు వర్గసంఘ ర్షణ అను నీతిని ప్రయోగిస్తోంది. బాహ్యాశాంతి, ఆంతరంగిక అశాంతి. అమెరికా తన ఆంతరంగిక సమస్యలలో శాంతి యుందని చెప్పుకుంటూయున్నది. కాని అంతర్జాతీయ విషయా లలో ఏటం బాంబుల ప్రయోగములు కొనసాగుతూయున్నవి. ఆంతరంగికశాంతి బాహ్యాఅశాంతి. భారతీయ విదేశాంగవిధానం ఈరెండు విషయాలనుంచి విడివడి స్వతంత్రముగా యుంది. శ్రీ జవహర్ లాల్ నెహ్రూ పూరించిన శాంతిశంఖం వైపు ప్రపంచమంతా ఆశాదృక్కులతో చూస్తూంది. ఐతే ఈ నెహ్రూ వాణికి బలము యెక్కడనుండి రాగలదు ? దేశీయ సమస్యలను శాంతి విధానంలో పరిష్కరించుకుంటేగదా! అంతర్జాతీయ రంగములో శాంతినిగురించి ప్రస్తావించగలిగేది. ఏపెట్టుబడిదారీ విధానము, ఏసామ్యవాదమునుండి మనం స్వతంత్రముగా ఉన్నా మని చెప్పుకుంటున్నామో, వాటిదూతలు ధనికతత్వము, పేద రికము రూపములో మన దేశంలో ఉండనే ఉన్నాయి. ఈరెంటిని మనం తొలగించనంతకాలం మన అంతర్జాతీయ శాంతివిధానమునకు బలము చేకూరదు. భూదానయజ్ఞము ఈబలమునే కలిగించనున్నది.

భారతదేశ చరిత్రను చూస్తే మనదేశమునకు రెండు గొప్పతనములున్నట్లు తెలుస్తోంది. భారతదేశము ఎప్పుడూ యేదేశంమీదా రాజకీయంగా దాడిచేయలేదు; మరియు బయట నుండి వచ్చిన సంస్కృతుల నన్నింటినీ ఈ దేశం తన మహిమాన్విత హృదయసీమలో లీనం చేసుకుంది. భారతదేశంలో ఉత్తర భారతదేశమునకు చెందిన పర్వతీయ ఆర్య సంస్కృతి మరియు దక్షిణభారతదేశమునకు చెందిన సమిష్టి సంస్కృతీ సమన్వయింపబడాయి. ఉత్తర భారతదేశమునకు చెందిన బుద్ధుడు, మహావీరుల ఆత్మజ్ఞాన తత్వధార దక్షిణాన రామేశ్వరమువరకు వ్యాపించింది. దక్షిణదేశంనుంచి శంకర, రామానుజ, మధ్వాచార్యులు ఉత్తర భారతదేశపు ఆత్మజ్ఞాన తత్వధారతో దక్షిణభారతదేశ భక్తి ధారను సమన్వయింప చేశారు. భారతదేశంలో రాజ్యాలెన్నో యుండేవి. అయినా ఆసేతుహిమాచలపర్యంతం సాంస్కృతిక రాజ్యం ఒక్కటే యుండేది. ఆపైన మహమ్మదీయులు వచ్చారు. వారిలో కొంతమంది యుద్ధమార్గాన్ని అవలంబిస్తే మరికొంత మంది ప్రేమమార్గాన్ని చేపట్టారు. ప్రేమమార్గావలంబుల ప్రభావము మనదేశంపై చాలా పడింది. భేదమూలమగు మన కుల వ్యవస్థపై ఇస్లాం యెంతో దెబ్బతీసింది. అప్పటివరకు భారతదేశంలో తయారవుతున్న సాంస్కృతిక రసాయనమందు విజ్ఞానమే తక్కువగా యుండెను. యూరపులో ఆ సమయంలో అనేక వైజ్ఞానిక పరిశోధనలు సాగుచుండెను. ఆ వైజ్ఞానిక పరిశోధనలవలన లాభముపొందిన ఆంగ్లేయులు మనదేశమునకువచ్చి మనలను పరాధీనులుగా చేసిరి. దానితో సంఘర్షణ ఆరంభ

మయ్యేను. ఆ సంఘర్షణనుండే సమ్మిశ్రణం జనించింది. అదే సామూహిక అహింస. విజ్ఞానాభివృద్ధికారణంగా నేడు ప్రపంచం సన్నిహితమైనది. అందుచేత ఏ ఉద్యమమూ ఏకాంతముగా ఉండవీలులేదు. అది సామూహికమై తీరుతుంది. మన అహింసకు అదే గుణ మబ్బింది. స్వాతంత్ర్యం యుగనాదమై యుండెను. మనమూ నిరాయుధులం.ఆంగ్లేయులవద్దబలమైన సైన్యముండెను. పరిస్థితి అహింసా ధర్మమునకు అనుకూలముగా యుండెను. యుగ నాదం, ధర్మం ఏకమైనప్పుడు ధర్మచక్రప్రవర్తనం కొనసాగు తుంది. యుగనాదం ఒక మహాపురుషుని ముఖతః వచ్చినప్పుడు ఆయన యుగపురుషుడు అవుతాడు. గాంధీజీ మన మధ్య యుగ పురుషుడై అవతరించాడు. ఆయన యుగనాదాన్ని, స్వాతంత్ర్య మును అహింసతో జోడించి ధర్మచక్రప్రవర్తనమును కొనసా గించిరి. జగత్తుకు సామూహిక అహింస అనే మహాప్రసాదం లభిం చింది. ప్రపంచచరిత్రలో యిక భారతదేశపు వంతు వచ్చింది. ఏ సామూహిక అహింసనైతే రాజకీయరంగంలో ప్రవేశపెట్టి అది స్వాతంత్ర్యమును సంపాదించిందో, ఆ సామూహిక అహింసనే ఆర్థిక, సాంఘిక రంగములలో ప్రవేశపెట్టి ప్రపంచానికి సర్వో దయ సమాజ మనే ఆదర్శమును చూపించబోతోంది. వేలకొద్ది సంవత్సరాల పూర్వమే "స్వం స్వం చరిత్రం శిక్షారన్ పృథివ్యాం సర్వమానవాః" పృథ్విమీదుండే ప్రజలందరు భారతదేశంలోని వ్యక్తులనుండి శీలపు శిక్షణ నొందుతారు, అని మనువు చెప్పాడు. ఈ పృథ్వికి ఆత్మజ్ఞానము, విజ్ఞానముల సంయోగమునుండి ఉత్పన్నమైన సామూహిక అహింస గురించి ప్రత్యక్షంగా శిక్షణ గరిపే యిద్దరు యుగపురుషులను-మహాత్మాగాంధీ, వినోబాలను మనం చూడగలుగుట మన అదృష్టం.

# 5

# కొన్ని సందేహములకు సమాధానములు

భూదానయజ్ఞమునకున్న తాత్విక భూమికను మనము చూచాము. దేశ, ప్రపంచ చరిత్రలో అది యేవిధముగా ఒక అత్యావసరమైన ఉద్యమమైందో, అదిగూడా మనం చూచాము. భూదానయజ్ఞముయొక్క ఆచరణభాగము గురించి ముందు ఆలోచిద్దాము. ఇక్కడ ఈ ఉద్యమ సంబంధంలో సాధారణంగా వచ్చే కొన్ని ప్రశ్నలను పరిశీలిద్దాము. ఇంతగొప్ప ఉద్యమం గురించి యెప్పటికప్పుడు క్రొత్త ప్రశ్నలు ఉదయించుట సహజమే. నేటివరకు అట్టి వందలకొద్ది ప్రశ్నలకు వినోబా వేరువేరు ప్రవచనములలో సమాధాన మిచ్చియున్నారు. ఇంత చిన్న పుస్తకములో వాటినన్నిటిని చేర్చుట సాధ్యముగాదు; అవసరమూ లేదు. కొన్ని ప్రత్యేక ప్రశ్నలను ప్రశ్నోత్తరముల రూపములో ఈక్రింద నిచ్చుచున్నాము:

* * * *

ప్రశ్న : మీరు భూమినుంచే యెందుకు ప్రారంభిస్తున్నారు. కార్ఖానాలు మొదలగు వాటితో ఎందుకు ప్రారంభించరాదు ?

ఉత్తరము : మన దేశములోనున్న అసమానతల తీవ్ర రూపం పట్టణాలలో కానవస్తున్నది. కార్ఖానాల యజమానులకు అందు పనిచేయు కూలీలకు మధ్యనున్న భేదము స్పష్టంగా కనిపిస్తోంది. అందుచేత ఈప్రశ్న వచ్చుట సహజమే. అయితే ఈ కార్యక్రమము భూమితో ప్రారంభించుటకు చాలా బలమైన కారణములున్నవి. మొదటికారణ మేమన: మనకున్న సమస్యలన్నిటిలోనికి క్లిష్టమైన సమస్య ఆకలి. ఆకలికి సమాధానము అన్నము. అన్నమును ఉత్పత్తిచేయు సాధనము భూమి.

రెండవకారణమేమంటే మనదేశములో ఎక్కువమంది ప్రజలు భూమిపై ఆధారపడి జీవిస్తున్నారు. అందుచేత యే విప్లవానికి రైతులతో సంబంధముంటుందో, మరియు యే విప్లవమునకైతే రైతు కేంద్ర బిందువవుతాడో అట్టి విప్లవమే దేశ విస్తృతఉద్యమం కాగలుగుతుంది.

మూడవ కారణమేమంటే: ఉత్పత్తి సాధనములకు అవసరమైన ముడిసరుకు భూమినించే ఉత్పత్తి అవుతుంది. ప్రత్తి, బొగ్గు, నూనె, లోహములు మొదలగు ఉత్పాదన సామగ్రి అంతా భూమాతనుండే వచ్చుచున్నవి. అందుచేత ఉత్పత్తిదారునికి యాజమాన్యము వచ్చుట అనునది మేము భూమి నుండే ప్రారంభించుచున్నాము.

భూమి మన ప్రాథమిక అవసరములను పూర్తిచేయుచున్నది. యితర అసమానతలను మరికొంతకాలము సహించవచ్చును. కాని, భూమి అసమానత సహింపరానిది.

భూమివిషయము కార్ఖానాలు, పరిశ్రమలు మొదలగు వాటినుండి మరొక దృక్కోణమునుండిగూడా భిన్నమైనది. వ్యవసాయదారుని వ్యవసాయం చక్కగా సాగినప్పుడే ఈకార్ఖానాలు, పరిశ్రమలు మొదలగునవి అన్నీ సక్రమంగా కొనసాగి స్థిరంగా నిలువగలుగుతాయి. భూమిపై జరిగే ఉత్పత్తిపైనే యితర ఉత్పత్తులన్నీ ఆధారపడి యున్నవి. భూమి లేకపోయిన మిగిలిన వస్తువులు పుష్కలంగా ఉన్ననూ, లేకపోయిననూ జీవితావసరములతో వాటి సంబంధమంతగా ఉండజాలదు. అందుచేత భూమియందు యేర్పడ్డ అసమానతల పంపిణీని ఒకసారి చక్కబరిస్తే ఇతర అసమానతలను తొలగించు విధానము మనకు తెలియగలదు.. భూమి పంపిణీ సమానంగా జరిగిన తదుపరి తదితర సంపదల పంపిణీ సమానంగా జరుగకుండా ఉండుట యనునది సంభవించగలదా? దేనితో ముందు ప్రారంభించుట యనునదే ప్రశ్న.

* * * *

ప్రశ్న : ఈ విధంగా దానమడుగుతూ యుంటే పని యెప్పటికి పూర్తి అవుతుంది.?

ఉత్తరము : దీనికి సమాధానం మీమీద, మామీద ఆధారపడియుంది. మనమందరం పూర్తిశక్తితో పనిచేసిన దేశంలోని భూమిహీనులందరికీ భూమి లభించుటలో ఆలస్యమగుటకు తగు కారణమేమీ ఉండదు. కాని మనం బద్ధకిస్తే ఈ ఉద్యమం ఎప్పటికి పూర్తి అవుతుందని అడుగుతూనే కూర్చుంటే ఆలస్యం

పట్టవచ్చును. విప్లవాత్మక ఉద్యమముల గమనమును అంకగణితముతో కొలవలేము. అయితే బీజగణితముతో కొలవగలమా అనునది చూద్దాము. ఒక గడ్డిపోచలోని ఒక కణుపు మండుటకు ఒక సెకను పడితే మొత్తం కాడంతా కాలిపోవుటకు యెంత సమయం పడుతుంది అని లెఖ్ఖవేయబోతే మనం లెఖ్ఖవేసే లోపలే ఆ గడ్డి అంతా తగులబడి భస్మమైపోతుంది. గాంధీజీ ఉప్పు తయారుచేసినప్పుడు కొంతమంది గణితజ్ఞులు "ఈవిధంగా చేస్తూ కూర్చుంటే సముద్రం ఎప్పుడు ఖాళీ అవుతుంది, లవణ భండారం యెప్పుడు నిండుతుంది" అని లెక్కలు వేయ మొదలు పెట్టినారు. ఇటు వీరు లెఖ్ఖలు కడుతూ యుండగానే అటు ఢిల్లీ రాజధానిలో సింహాసనం కంపించి పోయింది. అంకగణితములో సంఖ్యలుంటాయి. బీజగణితములో సంకేతములుంటాయి. సంకేతముల విలువ, మనము ఆ సంకేతముల వెనుక యెంత భావములను పెంచితే అంత పెరుగగలుగుతుంది. గాంధీజీ ఉప్పుచేయుటకు ముందు అన్యాయములగు చట్టములను ఉల్లంఘించుట యను సంకేతము యిమిడియుండెను. అదేవిధముగా భూదానయజ్ఞమందు లాభము మరియు యాజమాన్యములను విసర్జించుట అను సంకేతమున్నది. ఒక సంవత్సరములో ఒకలక్ష ఎకరముల భూమి సేకరిస్తే 5 కోట్ల ఎకరములు సేకరించుటకు ఎన్నిసంవత్సరములు పట్టునో అని మనము లెఖ్ఖ వేయుటలేదు. మొదటి సంవత్సరము ఒకలక్ష ఎకరములభూమి వస్తే 2 వ సంవత్సరము 7 లక్షల ఎకరముల భూమి వచ్చింది. 3 వ సంవత్సరము 22 లక్షల ఎకరములభూమి వచ్చింది.

ఈ మార్గములో వెళ్ళితే భూసమస్యా పరిష్కారానికి 300 సంవత్సరములు పట్టగలవని రామ మనోహార్ లోహియా ఒక ప్రకటనలో చెప్పినారు. దీనికి వినోబా సమాధానం చెబుతూ "నాలెక్క ప్రకారమైతే 500 సంవత్సరములు పట్టగలవు. ఎందు చేతనంటే ఒకసంవత్సరములో ఒక లక్ష ఎకరముల భూసేకరణ మాత్రమే జరిగింది. కాని ఈపని 300 సంవత్సరములలో పూర్తికాగలదని లోహియా అంటున్నారు. అంటే 500 సంవత్సరములను 300 సంవత్సరములకు తగ్గించుటకు నాకు లోహియా సహకారం లభించగలదని తేలుతుంది. లోహియా సహకారమువల్ల 500 సంవత్సరములపని 300 సంవత్సరములలో కాగలిగితే, జయప్రకాశ్ సహకారమువల్ల 300 సంవత్సరముల పని 30 సంవత్సరములలో కాగూడదా? జయప్రకాశ్ సహకారంవల్ల 30 సంవత్సరములలో కాగలిగితే ప్రజల సహకారంవల్ల 3 సంవత్సరములలో ఎందుకు కాగూడదు?" అని వినోబా అన్నారు. ఈపని పూర్తియగుటకు 1957 వ సంవత్సరమును వినోబా సూచించారు. యదార్థములో ఇది మనం నిర్ణయించుకొనే పురుషార్థంమీద ఆధారపడి యుంటుందిగాని, గణితముపైగాని, అంచనాపైగాని ఆధారపడిలేదు.

* * * * *

ప్రశ్న : పెద్దపెద్ద భూస్వాములనుండి భూమి అడగడం బాగానేయుంది. కాని కొద్దికొద్ది రైతులనుండి మీరెందు కడుగుతారు ?

అసమానత అనవచ్చును. అయితే అట్టిస్థితిలో తల్లి ఏమి చేస్తుంది? బలహీనంగాఉన్న శిశువునకు బలవర్ధకమగు ఆహారమిస్తుంది. ఈశ్వరకృతఅసమానతలను తగ్గించుటకు వినమ్రులమై ప్రయత్నిస్తాము. మానవకృత అసమానతలను తొలగించితీరవలె ననునది మన సంకల్పము. పేదరికము, ధనిక తత్వము అనువాటిని మానవుడు తన తప్పుడు ఆర్థిక విధానము కారణంగానూ, స్వార్థపరత్వ కారణంగానూ తెచ్చిపెట్టుకున్నాడు. అందుచేత మనం వాటిని తొలగిస్తున్నామంటే ప్రకృతికి వ్యతిరేకంగాకాక అనుకూలంగానే పనిచేస్తున్నాము.

* * * *

ప్రశ్న : భూదానయజ్ఞంవల్ల భూమి చిన్నచిన్న ఖండములవుతుందిగదా. దానివల్ల వ్యవసాయోత్పత్తి క్షీణించదా ?

ఉత్తరము : వినోబా తన భుజాలమీద వేసుకున్న ఈ మహావిప్లవ కార్యములతో పోల్చిచూస్తే ఈప్రశ్న చాలా అప్రధానమైనది. నేడు ముక్కలైయున్న హృదయాన్ని తాను జోడించకోరుచున్నానని వినోబా అంటున్నారు. భూమి ముక్కలకంటె హృదయం ముక్కలవడం గురించే తనకెక్కువ బాధగా ఉందని ఆయన అంటున్నారు. యథార్థంగా చూచుకుంటే మీరు ఊహించినట్లుగా భూదానయజ్ఞమందు భూమి చిన్నచిన్న ముక్కలగుటలేదు. ఒకవ్యక్తి తనకున్న పది ఎకరములలోనుంచి ఎకరమో, ఏకరంపాతికో యిస్తున్నాడంటే కాగితం మీద చూచి ఆలోచించేవారు అతని భూమి రెండు ముక్కలయిందనుకుంటారు. కాని సాధారణంగా దాతవద్ద భూమి

అంతా ఒకే ఖండముగా యుండదు. దానమిచ్చునప్పుడు దాత వేరుగా ఒక ఖండమును చూచే దానమిస్తారు. నల్గురు, ఐదుగురు దాతలు దానమిచ్చునప్పుడు ఒకరి భూమితో మరొకరి భూమి కలిసియున్న చోట దానమివ్వడము కూడా అరుదుకాదు. ఇట్టి సందర్భములలో భూమి ముక్కలగుటకు బదులుగా ముక్కలు ఏకమవడం జరుగుతుంది. భూమి పంపిణీ చేయునప్పుడు వేరువేరుగానున్న ముక్కలను ఏకఖండముగా చేయుటకు వీలైనంత వరకు ప్రయత్నించ బడుతుంది.

ఇంత చేసినప్పటికి ఎక్కడైనా భూమి ముక్కలైయుంటే ఆతురత చెందవలసిన అవసరమేమీ లేదు. **Economic holding** ఒక సాపేక్ష శబ్దము. ఎవరైనా పార, తవ్వుగోలలతో పనిచేసుకుంటే వారికి కొద్దిభూమే అమరుతుంది. ట్రాక్టరుతో సేద్యం చేసేవారికి పెద్దఖండం లాభకరంగా ఉంటుంది. అందుచేత **(Economic holding)** అనునది సాధనముల దృష్ట్యా నిర్ణయించక కుటుంబ అవసరముల దృష్ట్యా నిర్ణయించవలెను. భారత దేశంలోని భూమి జనసంఖ్యను బట్టి చూస్తే ప్రతిరైతునకు మనము పెద్దపెద్ద ఖండములను యివ్వలేము.

చిన్న ఖండముల కారణంగా ఉత్పత్తి తరుగుతుందని భావించుట పొరపాటు. ప్రపంచం మొత్తంమీద చూచుకుంటే భూమి పెద్దపెద్ద ఖండములలోగాక చిన్నచిన్న ఖండములలోనున్న చైనా, జపాను దేశములలోనే సగటున ఎకరమునకు ఫలసాయము ఎక్కువ వచ్చుచున్నది.

చరిత్రవల్ల కలిగిన ఒక అనుభవమును కూడా ఈ సందర్భంలో దృష్టియందుంచుకొనవలసి యున్నది. చిన్న ఖండములలో సేద్యము సాగినచోట మానవుడు సహకారమువైపు మ్రొగ్గినాడు. పెద్దపెద్ద విశాలమైన ఖండములలో వ్యవసాయము సాగినచోట నియంతృత్వమునకు అనుకూలమగు వాతావరణము ఏర్పడినది.

భూదాన విధానము యొక్క చివరిమెట్టు సమగ్ర గ్రామదానమని మరువరాదు. అట్టి స్థితిలో భూమి ముక్కలగుట అను ప్రశ్న యింత తీవ్రముగా ఉండదు.

* * * *

ప్రశ్న : విద్యాహీనులగు భూమిహీనులకు భూమియిస్తే ఉత్పత్తి తగ్గదా ?

ఉత్తరము : భూమిహీనులు చదువురానివారే. అయితే వారికి సేద్యం చేయుటరాదని అర్థంగాదు. నేడుగూడా మొత్తం ప్రపంచంలోని సేద్యమంతా ఈచదువురాని కూలీలే చేస్తున్నారు. మరియు చక్కగా చేస్తున్నారు. వాటిలో యేదైనా లోటు ఉన్నదంటే అది ప్రణాళికాశక్తిదే. ఎప్పుడు ఏపని చేయాలనేది వారికి సరిగా తెలియదు. నేటివరకు పెద్ద బాధ్యతలను వారు నిర్వహించకపోవుటయే దీనికి పెద్దకారణము. భూమి లభించుటతోనే వారిమీద బాధ్యత పడుతుంది. నేడున్న ప్రవృత్తి మారి స్వంతపని అనుకొనుటతో క్రొత్త ఉత్సాహము వస్తుంది. ఇంతకు పూర్వం చాలాసార్లు కొంతమంది భూమిహీనులకు రాజుల ద్వారా భూములిప్పించే కార్యక్రమాలు జరిగాయి. అందుకొన్ని

విఫలమయ్యాయికూడ. బహుశా యిట్టి అనుభవాలనుంచే ఈప్రశ్న వచ్చి యుండవచ్చు. అట్టి సందర్భములలో సాధారణంగా భూమి సరిపడాయివ్వబడకపోవడం, సేద్యము చేయుటకు వలయుసాధనములు యివ్వకపోవడంకూడ జరిగింది. అందుచేత ఆ భూమిహీనులు తమ భృతిని సంపాదించుకొను ప్రయత్నములో ఆభూమిపై సరిగా కష్టించి పని చేయలేకపోయారు. సాధనములను సంపాదించుకొననూ లేకపోయారు. కాని భూదానయజ్ఞమందు మీరు యెవరికైతే భూమినిస్తారో వారిని ఆకలితో నుంచ నిచ్చగించరుగదా? అందుచేత మీరు వారికి సాధనములుగూడ సమకూరుస్తారు. మీరాపని చేయలేకపోతే సంపత్తిదానమునుండి సాధనములను యిప్పించవచ్చును. మీవద్ద ప్రణాళికాశక్తి ఉంటే దానివల్ల భూమిహీనులకు లాభము కలుగజేయరా? అతను మీకుటుంబములో ఒక సభ్యుడుగా చేరుతాడు గదా? మీ ప్రణాళికాశక్తి, ఉత్సాహం నిండిన అతని కార్యశక్తి ఈ రెండూ కలిసి నేటివరకు ఆ భూమిపై రానంత ఫలసాయమును ఉత్పత్తి చేయవచ్చును. అయినప్పటికి అనుభవం లేని భూమిహీనులకు కొన్నిచోట్ల భూమి యివ్వబడి ఉత్పత్తి తగ్గిందనే అనుకుందాము. ఆ మాత్రం కష్టాన్ని, లోటునుభరించి బాధ్యతారహితమైన ఉత్సాహంలేని వ్యవసాయదారులను, అట్టివారి అస్తిత్వం సమాజమునకు ప్రమాదము కనుక వారిని బాధ్యతగల వ్యక్తులుగా, సమాజానికి ఉపయోగపడు వారిగా తయారుచేయవలసి యున్నది.

* * * *

ప్రశ్న : సహకారవ్యవసాయము ఎడల భూదానయజ్ఞ వైఖరి యేమిటి?

ఉత్తరము : భూదానయజ్ఞము దానిని వ్యతిరేకించదు. అయితే అది అనివార్యమని కూడా తలంచదు. ఆఖరికి గ్రామంలో ఏరకమైన సేద్యవిధానము యుండాలి అను నిర్ణయము గ్రామస్థులే చేయవలసియుండును.

పరిస్థితులను బట్టి ఎక్కడికక్కడ వేరువేరురకముల వ్యవసాయము జరగవచ్చును. ఎక్కువమంది చదువురాని రైతులున్న చోట్ల సహకారవ్యవసాయమందు మొత్తం వ్యవహారమంతా మేనేజరు చేతిలోకి వెళ్ళిపోయే ప్రమాదముంది. అయితే భూమిహీనులు స్వయంగా సహకారవ్యవసాయం చేయాలనుకుంటే వారిని అడ్డేవారెవరూ ఉండరు. ఎడ్లజతలు, నీటివనరుల ఏర్పాట్లు మొదలగువాటిలో మొదటినుండి సహకారవిధానమును ప్రవేశపెట్టవచ్చును.

*   *   *   *

ప్రశ్న : భూవితరణ తరువాత పెరిగే జనసంఖ్యా సంగతి యేమిటి?

ఉత్తరము : ఈ జనసంఖ్యా ప్రశ్న కేవలము భూదానయజ్ఞమునకు మాత్రమే వర్తించేదిగాదు. ప్రతీయేర్పాటునకు అది వర్తిస్తుంది. ఒకసారి భూమిని పునర్వితరణచేస్తే యెప్పటికీ భూసమస్య పరిష్కారమైందని అనుకోకూడదు. నేటి భూదానయజ్ఞం నేటిసమస్యను పరిష్కరించుటకొరకే. ఈ ప్రపంచములో సత్యమువినా మరేవస్తువు శాశ్వతముగాదు. అందుచేత మరల

ఆ ప్రశ్న ఉదయించినప్పుడు ఆ కాలంలో యుండేవారు దానికి తగు పరిష్కారమును వెతుక్కుంటారు. అయినప్పటికీ నేటి విధానమందు అప్పటిపరిష్కారమార్గమునకు బీజములు లేక పోలేదు. భూమిదాన యజ్ఞము అంతిమ ఆశయమందు భూమి గ్రామమునకు చెందుతుంది. గ్రామంలో ప్రతి పది హేను, ఇరవయి సంవత్సరములకు తిరిగి భూమి పంపిణి జరుగుతూ యుంటుంది. జనసంఖ్య పెరిగిందంటే పనిచేయువారి సంఖ్యకూడా పెరుగుతుంది. వ్యవసాయవిజ్ఞానము అభివృద్ధి చెందుతుంది. నీటివనరులు, ఎరువుల ఏర్పాటు పెరుగుతుంది. అట్టిస్థితిలో ముందుకాలంలో చాలావరకు ఉత్తమ సేద్యంద్వారా ఎక్కువమందికి పని కల్పించి తిండి పెట్టగలుగుతాము. వ్యవసాయముతోపాటు గ్రామపరిశ్రమలనుకూడా అభివృద్ధిచేయవలెననే అభిప్రాయమున్నది. అప్పుడు వ్యవసాయముపైనుండి కొంతభారము తగ్గగలదు.

* * * * *

ప్రశ్న : దానముగావచ్చిన భూమిలో ఎక్కువభాగము పనికిరాని భూమి ఉంటుందిగదా. అట్టి భూమిని భూమిలేని వారికి యిచ్చి ప్రయోజనం ఏమిటి ?

ఉత్తరము : దానముగావచ్చిన భూమి ఏవిధమైనదనే విషయం పంపిణీసమయముననే తెలుతుంది. నేటివరకూ పంచబడిన భూమినిబట్టి సేకరించబడిన భూమిలో అధికాంశము రద్దీ భూమి అనలేము. సాధారణంగా పెద్దపెద్ద జమీందారులు ఎక్కువ భూఖండములను యిచ్చినప్పుడు అందు మంచిభూమి, రద్దీభూమి కలిసి ఉంటాయి. లక్షలాది సన్నకారు రైతులు

యిచ్చిన దానములు, వారు కొద్ది కొద్దిగానే యిచ్చినా, అధిక భాగం మంచిభూమినే యిచ్చారు. అందరివద్దనున్న అంతభూమినీ వినోబా కోరుచున్నప్పుడు అందు మంచి, చెడు - అన్నిరకముల భూమి కలిసి ఉంటుంది. సాధారణంగా ఎవరివద్దనైతే భూమి ఉండికూడ దానమివ్వదలచుటలేదో అట్టివారే భూదానమందు లభించేభూమి మంచిదికాదనే ప్రచారం మొదలు పెడుతున్నట్లు కనబడుతున్నది. ఇతరులిచ్చేదానం పనికిరానిది అని నిరూపించుటకు వారు ప్రయత్నిస్తూ ఉంటారు. సాధారణంగా తనకు దూరంగానూ, తన మిగిలిన భూమినుండి వేరుగానూ ఉన్న ఖండమును దాత దానంగా యిస్తున్నాడంటే సబబే. అంత మాత్రమున అది రద్దీభూమి అని ఎలా చెప్పగలరు? దాత ఆర్థికదృష్టితో తనకు తక్కువ ఆదాయమునిచ్చుభూమిని దానం చేసినా, గ్రహీత సంతోషంతో స్వీకరిస్తాడు. ఎందుచేతనంటే ఆకొద్ది భూఖండము గ్రహీత జీవిత నిర్వహణకు సాధనము కాగలుగుతుంది.

సాధారణంగా పెద్దపెద్ద భూస్వాములు తమవద్దనుండు మొత్తం భూమినుండి ఎక్కువ ఫలసాయమును అనుభవించలేరు. అందుచేత భూమిలేని వారికి పంచబడు భూఖండములలో పూర్వంకన్న ఎక్కువపంట ఉత్పత్తి కాగలుగుటకు అవకాశము హెచ్చుగా ఉంటుంది.

మరొక దృక్కోణమునుండి కూడ ఈ విషయమును చూద్దాము. ప్రేమతో దానమడుగుట కాక శాసనము ద్వారా భూమిని స్వాధీన పరచుకొన జూస్తే భూమిగలవారు మంచి

భూమి తమవద్ద ఉంచుకుని అన్ని విధముల రద్దీ భూమినే ప్రభుత్వమున కిచ్చెదరు. నేడు భూదానమందు సారవంతమైన భూములు కూడ లభించుచున్నవి. ఇట్టి భూములు శాసనమునకు అందవు. అంతేగాక భూదానయజ్ఞము కలిగించుచున్న సద్భావ వాతావరణమును శాసనము కలిగించలేదు.

ఒక్కొక్కప్పుడు భూమి లేనివారు కూడ తీసికొనుటకు ఇచ్చగించని భూములుకూడ లభిస్తాయని ఒప్పుకోవలసియుంటుంది. అలాంటప్పుడు అట్టి భూమిని దాత ఎందుకిచ్చాడు అని భూదాన సేవకుడు ఆలోచిస్తాడు. పేరుకొరకు భూమిని దానంచేసేడని స్పష్టంగా కనిపిస్తూనే ఉంది. అతని హృదయంలో భూమిలేనివారి యెడల ప్రేమభావం కలుగలేదు. అందుచేత భూదాన సేవకుడు అతని ప్రతిష్ఠతోపాటు ఆభూమిని ప్రేమ పూర్వకంగా దాతకు తిరిగి యిచ్చి వేస్తాడు. ఇట్టి సందర్భములలో దాతకు తన గౌరవ ప్రతిష్టలయెడ దృష్టి ఉంటే చెడుభూమి తీసుకుని మళ్లీ మంచిభూమి నిస్తాడు.

ఒక్కొక్కప్పుడు సేద్యమునకు లాయకు కాని రాతి భూమికూడ లభించడము కద్దు. అట్టివాటియందు భూమి హీనులగు పేదలకు రాళ్ళు పగులగొట్టేపని లభిస్తుంది. తరచు యిట్టి వృత్తి వ్యవసాయంకంటే లాభసాటిగా ఉంటుంది.

అవసరమైనచోట్ల కొంత భూమిని పచ్చిక బయళ్ళుగాను, గ్రామ కంఠములుగాను, ఎరువులు తయారుచేయు గోతులు త్రవ్వుటకు తదితర సమిష్టి ఉపయోగములకు వినియోగించబడును.

* * * *

ప్రశ్న : ఒకవైపు మీరు భూమిని దాన మడుగుతున్నారు. మరొకవైపు జమీందారులు, భూస్వాములు, రైతులను, కౌలు దార్లను తొలగిస్తున్నారు. మీరు ఈ కౌలుదార్ల తొలగింపులను ఎందుకు వ్యతిరేకించుటలేదు ?

ఉత్తరము : కౌలుదార్ల తొలగింపులను మేము వ్యతిరే కిస్తూనే యున్నాము. ఉత్తర ప్రదేశములోని రైతులకు ఈ విషయమై సలహాయిస్తూ వినోబా—"మీరు దెబ్బలు తినుట కైనా సిద్ధపడండి గాని భూమిని మాత్రం వదలవద్దు" అని అన్నారు. వినోబా యిచ్చిన ఈ సలహా చక్కగా పనిచేసింది. బీహారులో కూడ వినోబా కౌలుదార్ల తొలగింపును గట్టిగా వ్యతిరేకించారు. ఈ విషయంలో ఎవర్నీ న్యాయమూర్తి కాని వ్వను అని వినోబా అంటారు. శాసనం భూ యాజమాన్యమును ఎవరి కిచ్చినాసరే, రైతును భూమిహీనునిగా చెయ్యవద్దని మేము జమీందారుకు చెబుతాము. మీరు ఏభూమినుంచి కౌలు దారులను తొలగించారో ఆభూమిని మాకు దానంగా యిచ్చినా పుచ్చుకుంటాము. దానమిచ్చి పాప ప్రాయశ్చిత్తం చేసు కున్నట్లూ మీకౌతుంది; మేము తిరిగి ఆభూమిని ఎవరినుండి లాక్కున్నారో వారికే యిస్తాము. తగాదా తీరిపోతే భూమి యజమానికి దానమిచ్చినాడనే ప్రతిష్ట కలిగించుటకు మాకెట్టి అభ్యంతరము లేదు.

భూదాన కార్యకర్తలున్న ప్రదేశములలో కౌలుదార్ల తొలగింపులు జరుగుతూఉంటే అందు శ్రద్ధతో పనిచేయుట భూదాన కార్యకర్తల కర్తవ్యమని వినోబాజీ చెబుతూ ఉంటారు.

భూదాతల వద్దకు వెళ్ళి నమ్రతతో విషయాన్ని అర్థమగునట్లు చెప్పుటవల్ల చాల సందర్భాలలో సమస్య పరిష్కారమై పోతుంది.

* * * *

ప్రశ్న : భూదానయజ్ఞము సఫలం కాకపోతే వినోబా ఏమి చేస్తారు ?

ఉత్తరము : భూదానయజ్ఞము సఫలముకాదు అనే దృష్టితో భవిష్యత్తునుగురించి ఆలోచించుటకూడ అశ్రద్ధకు చిహ్నము. వినోబా ఈవిధముగా ఆలోచించరు. దగ్గర బంధువు లెవరైనా జబ్బుపడితే వారికి ఒకప్రక్కన సేవచేస్తూ, రెండవప్రక్క వారు చనిపోతే శవదహనపు ఏర్పాట్లుకూడా ఇప్పటినుంచే చేసి పెట్టుకొనుటగురించి తానాలోచించలేనని వినోబా అంటారు.

యదార్థమాలోచిస్తే భూదానయజ్ఞమందు ఇప్పటివరకు వచ్చిన ఫలితములనుచూస్తే, ఇది పూర్తిగా విజయవంతం కాగల దనే ఆశ ఎక్కువగుచున్నది. ఒకవేళ ఎక్కడైనా విజయవంతం కాకపోతే అది కార్యకర్తల లోపమేగాని, ఈవిధానములో దోషమున్న కారణము కాజాలదు. బీహారులో వినోబా భూసమస్యను పరిష్కరించాలనుకున్నారు. కాని వారు బీహారు విడుచుసరికి పూర్తికాలేదు. 32 లక్షల ఎకరముల భూమి సేకరించ బడవలసియుండగా, 22 లక్షల ఎకరములకు కొంచెం ఎక్కువగాలభించింది. దీనినిబట్టి బీహారులో భూదానోద్యమంసఫలం కాలేదనవచ్చును. కాని, బీహారులోని మొత్తం గ్రామములలో మూడింట ఒకవంతు గ్రామములకు మాత్రమే భూదాన సందేశము చేరగలిగిందనే విషయం మనం మరువరాదు. ఐనప్పటికీ

ఇంతగా ఫలితం వచ్చిందంటే లోపమెచ్చటైనా ఉంటే అది మన ప్రయత్నలోపమేగాని, విధానములోని లోపము కాదు.

ఏమైనా 1957 వరకూ భూసమస్య పరిష్కారం కాని యెడల, అహింసాయుత పద్ధతులలో అనుసరించదగు విధాన ములనన్నిటినీ ప్రయోగించుటకు వినోబా వెనుకాడరు. అయితే సహాయనిరాకరణము, సత్యాగ్రహము అను సాధనములు చివరి దశ. వానికిముందు నచ్చచెప్పు కార్యక్రమమంతా పూర్తి కావ లెనుగదా! అంతేకాక సత్యాగ్రహమునకు సత్యాగ్రహులు కూడ సిద్ధమవవలెగదా! భూదానయజ్ఞమందు జరుగు ప్రయ త్నము లన్నిటియందు ఇందుకవసరమగు ఏర్పాట్లుకూడ సహజ ముగనే జరుగుచున్నవి. అయినను అంతిమ సాధనప్రయోగము అవసరము కలుగకపోవచ్చుకూడ.

*　　*　　*　　*

ప్రశ్న : మీరు భూమినయితే అడుగుతున్నారు. ఒక్కొ క్కప్పుడు ఆరవభాగము అడిగితే, మరొకప్పుడు పూర్తి గ్రామ మడుగుతున్నారు. మరొకప్పుడు వేరుగా చెబుతున్నారు. వీట న్నిటికీ బదులు, భూపంపిణీ సంబంధమయిన పూర్తి వివరములను ముందుగా చెప్పిన బాగుండునుగదా ?

ఉత్తరము : 'భూమి భగవంతునిదే, ఆయనతరఫున సమా జమునకు చెందుతుంది. కాని అది ఉండేది దున్నేవానివద్దనే' అని వినోబా చెప్పియున్నారు. అంటే భూమికి వ్యక్తిగత యాజమాన్యమును అంగీకరించుటలేదు. గ్రామంలో ఉండే

మొత్తంభూమి అంతా గ్రామసమాజపు యాజమాన్యమునకు చెందవలెననునది భూదానయజ్ఞపు అంతిమధ్యేయము. అయితే ఒక్కసారిగా అందుకు ఎగురబోవుటలేదు. ఎందుచేతనంటే మన విధానము భావవిప్లవపు విధానము. అందుచేత గ్రామములోని భూమిహీనులగు కూలివాండ్ర సమస్యను ముందుగా తీసుకున్నాము. వారికి అవసరమగు భూమిని ముందుగా సంపాదించి యివ్వవలసియున్నది. మొత్తం దేశంనుండి ఆరవభాగము భూమి సేకరింపబడిన భూమిహీనుల సమస్య పరిష్కారం కాగలదు. వెనుకటి ప్రకరణములలో యిందుకుసంబంధించిన వివరాలుచూచాము. ఈప్రశ్నను పరిష్కరించు భూమికయందే ప్రతీయిల్లూ విస్తృతమైన పరివారములో ఒకభాగమని అంగీకరింపబడాలనీ, ఆ విస్తృత పరివారమునకుగాను దాని హక్కు అయివున్న ఆరవభాగము సేకరింపబడాలని చెప్పుకున్నాము.

ఆపైన మీరు ఎంతసేద్యం చేయగలరో అంతభూమి మాత్రమే మీవద్ద ఉంచుకొని మిగిలినది గ్రామసమాజమునకు అర్పించమని మాకోరిక. అప్పుడు గ్రామసమాజం ఆ భూమిని అవసరమైనదానికంటే తక్కువభూమి గలవారికి యివ్వవలసిన భూమిని యిచ్చుటేగాక, యింతకుముందు భూమి లభించని పేదవారికికూడ పంచగలదు. అంటేఎవరివద్దనైతే ఆరవభాగం భూమి దానమిచ్చిన తర్వాతకూడ వారి స్వంతసేద్యమునకు మించిన భూమి ఉంటుందో వారినుద్దేశించే ఈవిజ్ఞప్తి జరగగలదు. ఇందుకు కూడ భావపరివర్తనంద్వారానే వారికి నచ్చచెప్పుదుము. భూమికి స్వీయస్వామిత్వం వదిలి వేస్తున్నారంటేఅవసరమైనంతమాత్రమే

భూమి ఉంచుకొందుమని మీరు ప్రకటించినట్లుగదా. ఆరవ భాగము దానమిచ్చిన తదుపరి అవలంబించదగురీతి యిది.

మొత్తం భూమిఅంతా గ్రామీకరణముచేసి గ్రామసమాజమునకు అర్పించుట యనునది మా చివరికోర్కె. ఈ గ్రామ సమాజం గ్రామం మొత్తం మీద సర్వాంగీకారముతో ఎన్నుకొనబడిన ప్రతినిధిమండలి కాగలదు.

ఆపైన ఈ గ్రామసమాజము, సర్వోదయమండలి, ప్రతి ఒక్కని అవసరములను చూస్తుంది. ప్రతి కుటుంబములోనూ ఎంతమంది సభ్యులున్నారు, ఎంత భూమిని దున్నగలరు, గ్రామంలో ఎంతభూమి ఉంది- మొదలయినవి పరిశీలిస్తుంది. తర్వాత గ్రామంలో ఉన్న భూమిపరిమాణముబట్టి వ్యవసాయము చేయగోరు ప్రతిరైతునకు భూమి పంచబడును. తలకొకరికి ఒక ఎకరము చొప్పున ఉండగలదని మా అంచనా. ఒక్కొక్కచోట రెండెకరములైనా కావచ్చు. అంతకంటె అధికమూ కావచ్చు. ఎచ్చటైనా మరీ ఎక్కువగాభూమి మిగులుతే, ఇతరప్రదేశముల భూమితక్కువై భూమిలభింపని భూమిహీనులను ఈ గ్రామమును లోనికి ఆహ్వానించగలము.

ఈ విధముగా అందరి వ్యక్తిగత అవసరములను, భూపరిమాణమును చూచి భూమి పంచబడుతుంది. అయితే రెండు షరతులున్నవి. మొదటిది: కొంతభూమి గ్రామ సమిష్టి భూమిగా ఉండగలదు. అందు అందరూ శ్రమదానముచేసి కృషిచేయవలెను. దాని ఫలప్రాప్తికూడ, అందునుండి గ్రామ సమిష్టి కార్యములకగు ఖర్చు చేయుటచే, అందరికీ లభించగలదు.

రెండవది: పశువులకుగాను పచ్చిక బీళ్ళు మొదలగు వాటికి కొంత భూమి వదలబడ గలదు.

ఒక విషయము స్పష్టముగా తెలిసికొనవలెను. ఈ పంచ బడు భూమిని దున్ని పండించుటకు, పంట ననుభవించుటకు మాత్రమే యివ్వబడుచున్నది. 15-20 సంవత్సరముల తర్వాత మరల తరుగుదల-పెరుగులలు అవసరమును బట్టి ఉండగలవు. ఏ కుటుంబములోనైనా ప్రాణులు పెరిగిన గ్రామ సమిష్టి భూమినుండి భూమి యివ్వబడగలదు. ఏకుటుంబములోనైనా ప్రాణులు తరిగిన, అంతమేరకు భూమిని-సమిష్టి భూమికి యివ్వవలెను. అంటే ఒకవిధముగా ప్రతి 15-20 సంవత్సరాలతర్వాత అందరిసమ్మతితో ఆవశ్యకతానుసారము ఎవరైనా భూమి ఇచ్చి తీసుకొన గలుగు భూమి బ్యాంకుగా ఈ సమిష్టి భూమి ఉండ గలదు. భూమి ఈ విధముగా ఇచ్చి పుచ్చుకొను సందర్భములలో భూమి చిన్న చిన్న ఖండములుగా అయిపోకుండ చూచుదురు.

భూమి సరిపోని యెడల ఏమి చేయుదురు అనే ప్రశ్న కూడ ఒకటి వచ్చును. భూమి తక్కువగా ఉండి భూమిహీనులు ఎక్కువగా ఉన్న గ్రామములనుండి భూమిహీనులను భూమి ఎక్కువగాఉన్న ప్రాంతములకు పంపవలసి యుండునని పైన చెప్పియున్నాము. బంజర్లను కూడ సాగులోనికి తేవలసి యున్నది. కొన్ని సందర్భములలో క్రొత్త గ్రామములను నిర్మించ వలసి యుండును. ఉత్తర ప్రదేశమందు పీలీభీత్ అనుచోట 7,500 ఎకరముల ఏక భూఖండము లభించినది. అచటి భూమి హీనులకు భూమి పంచిన తదుపరి కూడ యింకనూ ఎంతో

భూమి మిగిలిపోగలదు. అందుచేత ఇతర ప్రాంతములనుండి భూమిహీనులను ఆహ్వానించి అచట నూతన గ్రామమును ఏర్పర చుటవినా మరొక మార్గములేదు.

ఆపైన దీనితోపాటు గ్రామపరిశ్రమలనుకూడ మేము ఈప్రణాళికయందు అతిముఖ్యమైనవిగా ఎంచియున్నాము. ఎకరమో, అరఎకరమో ప్రతివ్యక్తికీ యిచ్చినంతమాత్రమున రైతుజీవితము పూర్తికాదు. అతని జీవితమును స్వయంపోష కము చేయుటకు గ్రామ పరిశ్రమలు అత్యవసరము. గ్రామ పరి శ్రమలంటే ఏవి ? ఎలాఉండగలవు? అనువిషయములను చర్చించు టకు ఇది స్థానముకాదు; అయితే గ్రామపరిశ్రమలు అనివార్య మైన అవసరము అనునదిమాత్రము స్పష్టము.

(1) ఆరవభాగము-మొదటిమెట్టు

(2) దున్నేవారే భూమినికలిగియుండుట-రెండవమెట్టు

(3) చివరకు భూమినంతను గ్రామసమాజమునకు సమ ర్పించి, తిరిగి గ్రామములోనున్న భూప్రమాణము ననుసరించి, ఆవశ్యకతానుసారముగా తీసుకొనుట మూడవమెట్టు ఐవున్నది. ఈవిధముగా ఇదిఅంతయు అహింసారీతిలోనే కొనసాగును.

మొదటిమెట్టు తర్వాత రెండవమెట్టు, ఆపైన మూడవ మెట్టు అను వరుసలోనే కృషి కొనసాగవలసిన అవసరములేదు. ఒకొక్కచోట మూడవదశయే తొలిగాకూడ ప్రారంభమవ వచ్చును. ఒరిస్సాలో అటులనే జరిగింది. అచటనేటికి వేయికి పైగా గ్రామదానములు వినోబాకు లభించియున్నవి. అచ్చట ఈమూడవదశ ప్రకాశమందే భూపంపిణీ జరుగగలదు.

# 6

# భూసంబంధమైన కొన్ని అంకెలు

తెలంగాణలోని విషమపరిస్థితులలో భూదానోద్యమం ఆరంభమైనా, భూపంపిణీయందు తెలంగాణలోవున్న అసమానతలే కొంచెం హెచ్చుతగ్గులుగా దేశమందంతటా వున్నవి. తెలంగాణలో అసమానతలవల్ల వచ్చిన ఉధృత వాతావరణం ఉన్నమాట నిజమే. అయినా భూమి పంపిణీలో అసమానతలు, అన్యాయము దేశమంతా ఉన్నవి. భారత దేశంలో జనసంఖ్యతో పోల్చి చూచుకుంటే భూమి తక్కువగా యున్నది. అందులోనూ కొద్దిమందివద్ద ఎక్కువభూమి ఉండగా చాలామందివద్ద కొద్దిభూమే ఉంది. స్వయంగా భూమిపై సేద్యం చేస్తున్నా, తాము పండించే అన్నానికి తాము యజమానులుకాని వ్యవసాయ కూలీలు కోట్లకొలదీ ఉన్నారు. భూమికి యజమానులై యున్నా, తమ భూమి ఎక్కడుందో తమకే తెలియని భూస్వాములు కూడ వేలకొద్దీ ఉన్నారు. భారతదేశంలోని భూసమస్యకు సంబంధించిన కొన్ని అంకెలను అధ్యయనం చేద్దాం.

భారతదేశం మొత్తం విస్తీర్ణం 12,69,640 చదరపు మైళ్లు. అందులోంచి, 26,63,72,000 ఎకరాల భూమి

నేడు సేద్యంలో ఉంది. దేశంలోని మొత్తం విస్తీర్ణంనుండి చూచు కుంటే మనిషికి సగటున 7 ఎకరాలు వస్తుంది. అంటే సేద్యం చేసే భూమి రమారమి ¾ ఎకరం మాత్రమే వస్తుంది. ఈ సగటు లెక్కలో సేద్యంపై ఆధారపడని వారుకూడ ఉన్నారు. 1951 జనాభా లెక్కల ప్రకారం భారతదేశం మొత్తం జనసంఖ్య 35,66,94,389. ఇందు 24,91,23,449 మంది వ్యవసాయంపై ఆధారపడి ఉన్నారు. అంటే మొత్తం జనసంఖ్యలో 69.8% మంది వ్యవసాయంపై ఆధారపడి ఉన్నారు. ఇతర పారిశ్రామిక దేశాలకంటె మన దేశంలో వ్యవసాయంపై ఆధారపడినవారి శాతము చాల హెచ్చు. 1921 లో బ్రిటనులో 20.7%, జర్మనీలో 37.8%, ఫ్రాన్సులో 53.6% వ్యవసాయంపై ఆధారపడి యుండిరి. ఇతర దేశములలో పోనుపోను భూమిపై ఆధారపడేవారి సంఖ్య తగ్గుతూయుంటే, భారత దేశంలో హెచ్చుతున్నట్లు కూడ కనబడుతూంది. 1870 లో బ్రిటనులో 38.2%, జర్మనీలో 61%, ఫ్రాన్సులో 67.6% జనాభా వ్యవసాయంపై ఆధారపడియుండిరి. 1921 తర్వాత అచటి లెక్కలు లభించలేదు. పరిశ్రమలు అభివృద్ధి చెందుట కారణంగా ఆ దేశాలలో వ్యవసాయంపై భారం తగ్గుతూ వస్తూంది. భారత దేశంలో 1881 లో 58% వ్యవసాయంపై ఆధారపడియుంటే, 1951 కి వ్యవసాయంపై ఆధారపడిన వారి శాతము 69.8% అని తేలింది. గ్రామ పరిశ్రమలు నాశనమైనందువల్లనే మన దేశంలో వ్యవసాయంపై భారము అధికమౌతుందనే విషయాన్ని ఈ అంకెలు తెలుస్తున్నవి.

వ్యవసాయంపై ఆధారపడియున్నవారి వివరములు ఈ విధముగా నున్నవి:

| | | |
|---|---|---|
| తమ భూమిని స్వయంగా దున్నుకునేవారు | 1680 లక్షల మంది- | 46.9% |
| ఇతరుల భూమిని దున్నేవారు | 316 లక్షల మంది- | 8.9% |
| భూమిలేని కూలీలు | 448 లక్షల మంది- | 12.5% |
| స్వంత సేద్యం చేయని భూఖామందులు | 53 లక్షల మంది- | 1.5% |

ఈ లెక్కలబట్టి భూమికలిగిన ప్రతి ఆరుగురికి ఒకడు చొప్పున భూమిలేని కూలీ ఉన్నాడని తేలుతుంది. అందుచేతనే వినోబా ఆరవభాగం ఇమ్మని కోరుతున్నారు. ఇతరుల భూమిపై సేద్యం చేసే 8.9% మంది కూడా భూమిలేని వారిగనే లెక్క. ఎందుచేతనంటే ఏనిమిషంలోనైనా వారినుండి భూమి లాక్కొని వారిని వెళ్ళగొట్టవచ్చును. భూఖామందులలో కూడ భూపంపిణీ సమానంగాలేదు. చాలామంది వద్ద కొద్ది భూమే ఉంది. ఉదాహరణకు ఒరిస్సాలో భూమిపై సేద్యంచేసే వారిలో 26.7% రైతు కుటుంబాలకు ఒక్కొక్క కుటుంబంవద్ద ఒక ఎకరంకంటె తక్కువ భూమి ఉంది. కొంచెం హెచ్చుతగ్గులలో దేశ పరిస్థితి అంతా యిలానే ఉంది. ఈ క్రింది పట్టిక చూడండి:

## భారతదేశంలోని కొన్ని పెద్ద రాష్ట్రములలో భూపంపిణీయొక్క వర్తమానస్థితి

| రాష్ట్రము | 5 ఎకరాలకన్న తక్కువ భూమి గల రైతులు | | 5 నుంచి 10 ఎకరములు భూమి గల రైతులు | | 10 ఎకరాలకన్న ఎక్కువ భూమి గల రైతులు | |
|---|---|---|---|---|---|---|
| | జనాభా % | భూమి % | జనాభా % | భూమి % | జనాభా % | భూమి % |
| అస్సాము | 66 | 26 | 25.5 | 33 | 11.5 | 41 |
| ఒరిస్సా | 74 | 30 | 22.5 | 43 | 3.5 | 27 |
| ఉత్తర ప్రదేశము | 71 | 39 | 16.5 | 39 | 2.5 | 22 |
| బొంబాయి | 52 | 14 | 29.0 | 44 | 9.0 | 42 |
| మధ్యప్రదేశము | 51 | 10 | 35.0 | 31 | 14.0 | 59 |
| మద్రాసు | 82 | 41 | 11.0 | 27 | 7.0 | 32 |
| తిరువాన్కూర్-కొచ్చిన్ | 64 | 44 | ·5.0 | 22 | 1.0 | 34 |
| మైసూరు | 66 | 25 | 33.0 | 59 | 1.0 | 26 |

'ఏ' తరగతికి చెందిన రాష్ట్రములలో బీహారు, పంజాబు, పశ్చిమ బెంగాలులకు చెందిన వివరములు పూర్తిగా సేకరించలేకపోతిమి. అయినా ఈ ఉన్న అంకెలతో అచటి భూసమస్యను కూడ గ్రహించుకొనవచ్చును. బీహారులో 5 ఎకరములకన్న తక్కువభూమిగల రైతులు 83%. 5 నుండి 50 ఎకరాల వరకుగల రైతులు 16%. 50 ఎకరాలకన్న ఎక్కువభూమిగల రైతులు కేవలము ·7%. పశ్చిమ బెంగాలులో 2 ఎకరములకన్న తక్కువభూమిగల రైతులు 34%, 2 నుండి 4 ఎకరములు గల రైతులు 28%, 4 ఎకరములకన్న ఎక్కువభూమిగల

రైతులు 38%. పంజాబులో వ్యవసాయంపై ఆధారపడిన వారిలో సుమారు 70 లక్షల మంది భూమిలేని వ్యవసాయ కూలీలే ఉన్నారు.

క్రిందనిచ్చిన భూమిలేనికూలీల సంఖ్యలబట్టి నేటిదేశంలోని భూమి సమస్య కొంత అర్థంకాగలదు.

| రాష్ట్రము | సేద్యంపై ఆధారపడిన జనాభా | వ్యవసాయకూలిపై ఆధారపడినవారు |
|---|---|---|
| అస్సాము | 72,41,172 | 1,59,023 |
| బీహారు | 3,46,11,254 | 87,95,202 |
| ఒరిస్సా | 1,16,12,367 | 18,03,968 |
| ఉత్తరప్రదేశ్ | 4,68,96,672 | 36,12,209 |
| పశ్చిమబెంగాల్ | 1,41,95,161 | 30,41,881 |
| తూర్పుపంజాబు | 80,68,597 | 1,62,677 |
| బొంబాయి | 2,20,98,293 | 32,52,546 |
| మధ్యప్రదేశ్ | 1,61,48,879 | 43,36,282 |
| మద్రాసు | 3,70,22,790 | 1,03,93,362 |
| తిరువాన్కూర్-కొచ్చిన్ | 50,90,306 | 18,71,737 |
| మైసూరు | 63,43,360 | 6,15,853 |
| హైద్రాబాదు | 1,27,14,824 | 32,99,773 |
| మధ్యభారత్ | 57,44,403 | 8,84,618 |
| రాజస్థాన్ | 1,08,36,939 | 8,74,996 |
| పెప్సూ | 35,34,684 | 3,58,676 |

| రాష్ట్రము | సేద్యంపై ఆధారపడిన జనాభా | వ్యవసాయకూలిపై ఆధారపడినవారు |
|---|---|---|
| సౌరాష్ట్ర | 19,29,120 | 1,55,585 |
| వింధ్యప్రదేశ్ | 32,14,364 | 6,29,813 |
| హిమాచలప్రదేశ్ | 9,14,238 | 62,098 |
| ఢిల్లీ | 1,72,186 | 29,276 |
| అజ్మీర్ | 3,14,905 | 19,568 |
| త్రిపురా | 4,80,892 | 30,886 |
| కూర్గు | 1,32,303 | 24,533 |
| కచ్ | 2,33,581 | 16,895 |
| భోపాల్ | 5,48,330 | 1,67,425 |
| బిలాస్‌పూర్ | 1,14,398 | 1,986 |



# 7

# వ్యావహారిక దృక్పథము

పోచంపల్లిలో నాటబడిన భూదాన యజ్ఞ విత్తనము నేడు ఒక విశాల వటవృక్షముగా రూపొందింది. ఆ వృక్షమునకు ఎన్నో కొమ్మలు వచ్చాయి. అది పుష్పించి ఫలించింది. ఈశాఖల గురించిన పరిచయం కొంతపొంది తద్వారా మనం భూదాన యజ్ఞపు వ్యావహారిక దృక్పథమును అధ్యయనం చేద్దాము.

ఈ ఉద్యమమందు స్వీకరించబడు దానములు ఈ క్రింది విధముగా నున్నవి: భూదానము, సంపత్తిదానము, శ్రమ దానము, సాధనదానము, కూపదానము, ఆభరణదానము, బుద్ధిదానము మరియు జీవన దానము.

భూదానము నందు ఉత్పత్తి సాధనముల యాజమాన్యము ఉత్పత్తిదారున కిచ్చు ప్రక్రియయు, ఉత్పత్తి చేయనివాని కా సాధనలపైగల యాజమాన్యమును తొలగించు ప్రక్రియయు గలవు. భూఖామందు భూదాన సేవకుని యొద్దగాని, బహిరంగ సభలోగాని, లేక ఉత్తరము ద్వారాగాని భూదాన మివ్వవలె నను తన సంకల్పమును ప్రకటించును. దానితోనే భూదానము

యొక్క ప్రత్యక్ష ప్రక్రియ ప్రారంభమగును. సాధారణంగా భూఖామందు ఒక దానపత్రము వ్రాసి సంతకంచేసి యిస్తాడు. ఈ దానపత్రపు నమూనా ఈ పుస్తకము చివర రెండవ అనుబంధముగా యివ్వబడినది. దానమిచ్చు చున్నట్లు ప్రకటించు సమయమున దాన పత్రములో కొన్ని స్థానములు నింపుట మిగిలిపోయిన తర్వాత నింపవచ్చును. దానపత్రము నింపి యిచ్చి, నప్పటికీ, భూమి పంపిణీ జరగనంత వరకు దాత ఆ భూమిపై పూర్వంవలె స్వయముగానే సేద్యము చేయును. పంపిణీకిముందు ఆ భూమిలో దాత సేద్యము చేసినప్పుడు తన ఖర్చులు పోగా మిగిలిన దానిని దాత భూదాన సమితికి యివ్వగలడు. దాన పత్రము నింపిన తర్వాత దాత ప్రత్యేకంగా చేయవలసిన దేమీ ఉండదు. అయితే అతను భూదాన సాహిత్యం పఠిస్తూ యుండ గలడనీ, యితరులనుండి కూడ దానము యిప్పించుటకు ప్రయత్నించ గలడనీ తప్పక ఆశిస్తాము. భూమి పంపిణీ ఎలా జరుగుతుందనే విషయం ఇదే అధ్యాయంలో ముందు వివరంగా వర్ణించబడింది.

సంపత్తిదానము డబ్బును దానమిచ్చుట కాదు. ఇందు దాత తన సంపాదననుండి ప్రతి సంవత్సరము ఒక నిశ్చితభాగమును ఇచ్చుటకు సంకల్పించుకుంటాడు. ఈ భాగ మొత్తము వినోబాకిగాని, భూదాన సమితికిగాని యివ్వబోడు. దాత ఆ మొత్తమును తనవద్దే వేరుచేసి ఉంచి, వినోబా ఆదేశానుసారము ఖర్చు చేస్తాడు. ప్రస్తుతము సంపత్తిదానము మూడు పద్దులుగా ఖర్చు చేయవచ్చును.

(1) భూమిలేని వారికి ఉపాధి కల్పించుటయందు, పనిముట్లు మొదలగునవి కొనుటకును,

(2) త్యాగము చేసిన సేవకుల జీవిత నిర్వహణకును,

(3) సాహిత్య ప్రచారమునకు సహాయముగాను.

సంపత్తిదానమందు అపరిగ్రహము, అర్థపారిశుధ్య మను సంకేతములు గలవు. ఈ విషయమై ఎక్కువ వివరము శ్రీకృష్ణ దాస్ జాజూ వ్రాసిన 'సంపత్తిదానము' నందు కలవు. సంపత్తి దాన పత్రముయొక్క నమూనా మూడవ అనుబంధములో యివ్వబడినది.

భూమిగాని, సంపదగాని యివ్వలేనివారు శ్రమదానము చేయగలరు. భూమిలేని వారికి బంజరు భూములు యివ్వబడి నప్పుడు వాటిని సేద్యమునకు అనుకూలముగా చేయుటకు శ్రమ అవసరముగదా. బావులు, చెరువులు త్రవ్వుటకు కూడ శ్రమ కావలెను. నేటి వరకూ ఎంతోమంది భూమిలేనివారు, విద్యార్థులు, మధ్యతరగతివారు శ్రమదాన యజ్ఞమందు పాలొన్నారు. శ్రమదాన యజ్ఞమందు శ్రమకు, శ్రామికునికి ప్రతిష కలిగించుట యను సంకేతమున్నది. ఇందు గురించిన ఎక్కువ వివరములు శ్రీ శివాజీ భావే రచించిన 'శ్రమదానము' అను పుస్తకమున గలవు.

భూమిలేని పేదలకు భూమి యివ్వగానే వారు పని ప్రారంభించుటకు ముందుగా నాగలి, ఎడ్లు, విత్తనములు మొదలగు సాధనములు అవసరమగును. ఇందుకు సహకరించుటకు గాను సాధన దానము యివ్వబడు చున్నది. సాధారణముగా

ఈ సాధన దానములు కూడ దానపత్ర రూపములలోనే స్వీక రించబడును. భూమి పంపిణీ జరుగు సమయమున "మీసాధన దానము నాగలిగా (లేక యితర సాధనముగానో) ఈ భూమి లేని పేదకు యివ్వండి" అని చెప్పడం జరుగుతుంది. కొన్ని భూదాన సమితులు సాధన దానముగా రొఖ్ఖమును కూడ స్వీకరించుచున్నవి. అయితే ఇది ప్రత్యేక పరిస్థితేగాని, నియ మముకాదు.

భూమి యివ్వబడిన భూమి హీనుల పొలములందు బావులు త్రవ్వించుట కూడ భూదాన యజ్ఞమున నవనిర్మాణ కార్యములందు ఒక అంశము. బావులకొరకుగాను ప్రజలనుండి ప్రత్యేకముగా దానము తీసికొనబడును. దీనిని *కూపదానము* అందురు. యదార్థమునకు దీనిని సాధన దానముగానే జమకట్ట వచ్చును. కూపదానములు మూడు రకములుగా స్వీకరించ బడును. ఇనుము, సిమెంటు మొదలగు వస్తువుల రూపములోనూ, నగల రూపంలోనూ (వీటిని తర్వాత అమ్మి, ఆ వచ్చు ధనమును బావుల నిర్మాణమునకు వినియోగించుదురు), ధనరూపము గానూ స్వీకరించబడును.

కూపదానముకొరకు *ఆభరణదానము* గురించి యిప్పుడే చెప్పాము. ఈ యజ్ఞమందు విశేషముగా స్త్రీలు పాల్గొనగలరు. ఈ కార్యమందు స్వర్గీయ జమన్‌లాల్ జీ బజాజ్ ధర్మపత్ని శ్రీమతి జానకీదేవి బజాజ్ ఎక్కువ శ్రద్ధతో పనిచేయుచున్నారు. "ఆడవారిని ఆభరణాలు అణచివేశాయి; ఆభరణదానంద్వారా

వారిని భయముక్తులు చేయదలచాను'' అని వినోబా లాక్షణి కంగా అంటూ ఉంటారు.

ఈ వివరములవల్ల భూసేకరణకంటె భూవితరణ కష్ట మైనదనీ, భూవితరణకంటెను నవనిర్మాణమందు ఎక్కువ జాగ్రత్త, ధైర్యము అవసరమనీ పాఠకులకు తెలిసి యుంటుంది. ఐదుకోట్ల ఎకరములభూమిని సేకరించుట ఏమంత పెద్ద పని కాదు. దానిని న్యాయపూర్వకంగా భూమిలేని పేదలకు పంచుటే కష్టమయిన పని. దేశమంతటా భూమిపై పనిచేయు టకు వలయు సాధనములను సేకరించుట, నీటివనరులు ఏర్పర చుట, క్రొత్తగ్రామములు నిర్మించవలసిన ప్రదేశములందు అందు కవసరమగు సదుపాయములు చేయుట, గ్రామపరిశ్రమలు, నవీన విద్య, గ్రామ ఆరోగ్యము, న్యాయవ్యవస్థ మొదలగునవి ఏర్పర చుట అంటే భగీరథ ప్రయత్నమే. నేడు దేశం ఎదుట నవ నిర్మాణమను మహాకార్య మున్నది. అది కష్టతరమైనది కనుకనే ఉత్సాహపూరితమైనది.

*బుద్ధిదానము, జీవనదానముల* మహత్వము మనకు యిక్కడే తెలియగలదు. బుద్ధిదానంగురించి చెబుతూ కొన్ని చోట్ల వినోబా ప్లీడర్లకు భూమిహీనులగు పేదలవ్యాజ్యములను ఉచితముగా వాదించమని సలహాయిచ్చారు. ఇది బుద్ధిదానమున ఒక విధానము. అంతేగాని ఇంతటితో బుద్ధిదానము అంతమై పోదు; అలాఅని వినోబాకూడ చెప్పరు. నవనిర్మాణమను మహా కార్యమందు ప్రతి బుద్ధిమంతుడు తన బుద్ధిని ఉపయోగించవలసి యున్నది. అలా చేసినవ్యక్తే యదార్థానికి విజ్ఞుడు కాగలడు.

గ్రామ ఇంజనీరు అవసరము ఎంతేని కలదు. అదేవిధముగా ఉపాధ్యాయుడు, వైద్యుడు, చట్టములు తెలిసినవారు మొదలగు వారి అవసరమున్నది. ఈ అందరి బుద్ధిదానము 'బుద్ధిదానము' క్రిందకు వచ్చును. బుద్ధిదానమందు శ్రమజీవి, బుద్ధిజీవి అను తేడాను తొలగించు సంకేతము యిమిడియున్నది.

ఈ మహాకార్యమునకుగాను తన పూర్తిజీవితమును సమర్పించుటనే *జీవనదాన* మందురు. దీనిని గురించి ఎక్కువ వివరములు తెలుసుకొనుటకు పాఠకులు శ్రీ జయప్రకాశ్ నారాయణ్ రచించిన 'జీవనదానము'అను పుస్తకమును చూడగలరు.

## భూమి పంపిణీ

ఏ ప్రదేశమందైనా భూదానమందు తగినంతగా భూమి లభించిన తదుపరి భూమిపంపిణీ కార్యము తీసుకొనబడును. సాధారణంగా ఎక్కువగా భూమి దొరికినస్థానములలోనే ముందు భూపంపిణీ కార్యము ప్రారంభించబడును. ఇంతవరకూ భూదాన యజ్ఞమందు భూసేకరణకే ఎక్కువ ప్రాధాన్యత ఈయబడినది. ఇకనుంచి భూమి పంపిణీకూడ ప్రముఖముగా తీసుకొనబడును. భూపంపకం జరగవలసిన గ్రామంలో, పంపకం చేయుటకు ఒక వారం ముందుగానే పంపకం చేయబడు నను సూచన యివ్వబడుతుంది. పంపకమునకు ముందుగా దానముగా వచ్చిన భూమి చూడడం జరుగుతుంది. పంపిణీకార్యమందు భూదానసమితి సభ్యులు సాక్షులుగా ఉండడం తప్ప ప్రత్యేకంగా చేయవలసినది ఉండదు. నిర్ణయాలు చేయవలసిన బాధ్యత అంతా గ్రామీణు

లదే. ఆ గ్రామభూమి ఒక్కొక్క కుటుంబానికి ఎన్ని ఎకరాలు యివ్వవలెను అను విషయం మొదట నిర్ణయిస్తారు. ఆపైన భూపంపిణీ నియమానుసారంగా (నియమాలు ముందు యివ్వబడ్డవి) భూమిహీనులు వడబట్ట బడతారు. భూమి తక్కువ ఉండి, భూమి పొందవలసిన భూమిహీనులు హెచ్చుగా ఉన్నప్పుడు ఎవరెవరికి భూమి యివ్వాలి అనే విషయాన్ని భూమిహీనులే నిర్ణయిస్తారు. అలా నిర్ణయం జరగని పక్షంలో చీట్లువేసి నిర్ణయం తీసుకోబడుతుంది. భూపంపిణీ సమయమున సేవకులు ఎన్నో పవిత్ర సన్నివేశములను తమ కళ్ళతో చూస్తూ ఉంటారు. భూమి తక్కువ ఉండి, భూమిలేనివారు ఎక్కువ ఉంటే ఆ సన్నివేశమును చూచి ప్రజలు క్రొత్తగా భూమినిచ్చెదరు. భూమిహీనులు స్వీయ ప్రేరణపొంది, తమకే భూమి రావలె నను పట్టుదలవీడి, యితరులకా భూమి నిచ్చెదరు. ప్రేమలో పోటీ పడ్డట్లుగా ఉంటుంది.

ఇవ్వబడే భూమిని స్వీకరించిన రైతు, దానిని అమ్మవీలు లేదు ; తాకట్టు పెట్టకూడదు; దానిపై అప్పులు చేయకూడదు; దానిని బంజరుగా ఉండనివ్వ కూడదు.

భూమి పంపిణీ నియమాలు ఈ క్రింద విధముగా నున్నవి:

(1) ఏ గ్రామంలో భూమి పంపిణీ చేయవలసి యుంటుందో, ఆ గ్రామమునకు ఒక తేదీ నిశ్చయించేసి ఒక వారం ముందుగానే గ్రామస్తులకు ఆ తేదీని తెలుపవలెను. దండోరా వేయించుట ద్వారానూ, కరపత్రముల ద్వారానూ ఈ పని

చేయించవచ్చును. ఆ గ్రామంలోని ప్రతి ఇంటికీ ఈ విషయం తెలియ వలెను.

(2) పంపిణీ ఒకరోజు ముందుగా కూడ మరునాడు పంపిణీ జరుగ నున్నట్లు తెలియ జేయవలెను. భూపంపిణీ కార్యక్రమ వివరములను జిల్లా కలెక్టరుకు, తత్సంబంధముగల ముఖ్య అధికారులకు ముందుగా తెలియజేయవలెను. దానివలన భూపంపిణీ సమయమున అధికారులు కూడ రాగలుగుదురు.

(3) పంపిణీ చేయవలసిన భూమి గురించిన వివరములు పంచాయితీబోర్డు అధ్యక్షునినుండి, గ్రామమునసబు, కరణముల నుండి ముందుగానే తెలుసుకొనవలెను. ఆ భూమి ఎటువంటిది, ఎక్కడుంది, స్థితి ఏమిటి మొదలైనవి వెళ్ళి చూడగలరు.

(4) మొత్తం గ్రామమంతటినీ బహిరంగ సభకు పిలిచి గామంలో భూమిలేనివా రెవరెవరో తెలుసుకొనవలెను.

(5) భూమి పంపిణీ కూడ గ్రామమందు బహిరంగ సభలోనే జరగవలెను. ఆ సమయమున తహసీల్దారు కూడ హాజరు కావలెను. తహసీల్దారు స్థానంలో జిల్లా కలెక్టరు మరి యొకరిని కూడ నియమించ వచ్చును. వారుకాక గ్రామ మునసబు, కరణములు ఉండుట అవసరము.

(6) వీలైనంత వరకూ భూపంపిణీ ఏకగ్రీవాభిప్రాయంతో జరుగవలెను. అభిప్రాయ భేదములందు ఎవరెవరికి భూమి నివ్వవలెను అను విషయం భూమిహీనులు ఏకగ్రీవంగా నిర్ణయించగలరు. అదికూడ కాని పక్షములో, మన ప్రతినిధియే

అంత్య నిర్ణయం చేయవలసిన పక్షంలో 'బొమ్మ-బొరుసు' వేసి గాని, చీట్లు లాటరీ వేసిగాని నిర్ణయించవలెను.

(7) పంపిణీ సమయమున గ్రామ పెద్దలు, షావుకార్ల సహాయము తీసుకొనవలెను. దానివలన ముందు ముందు క్రొత్తగా భూసేకరణకు, భూమి పొందిన పేదలకు సాధనము లిచ్చుటయందు వారు తోడ్పడగలరు.

(8) వీలైనంత వరకూ వచ్చిన భూమిలో మూడింట ఒక భాగము హరిజనుల కివ్వవలెను.

(9) వీలైనంతవరకూ ఏగ్రామంలో దానంగా వచ్చిన భూమిని ఆ గ్రామంలోని భూమిలేని పేదలకే పంచవలెను. గ్రామంలోని భూమిలేని వారందరికీ యిచ్చిన తర్వాత కూడ దానంగా వచ్చిన భూమి ఎక్కువ మిగులుతే, ప్రక్క గ్రామస్థులకు యివ్వవచ్చును. పెద్ద భూఖండములు దానముగా వచ్చిన చోట క్రొత్త గ్రామములు నిర్మించవచ్చును.

(10) క్రొత్త గ్రామములు ఏర్పరచవలసినచోట భూదాన సమితి ప్రత్యేకంగా నియమాలను ఏర్పరచుకోవాలి. అందు పురుషోత్తమదాస్ టాండను ప్రణాళికను అమలు జరుపవచ్చు. సంక్షిప్తంగా ఆయన ప్రణాళిక యిది: ప్రతి యింటికీ నాలుగువైపులా కొంత ఖాళీస్థలం ఉంటే అందు కూరగాయలు పండించుకొనుటకు, మలమూత్రములను ఎరువులుచేయు గోతులు తీసుకొనుటకు వీలుండగలదు.

(11) సాధారణంగా వ్యవసాయం చేయుట తెలిసియుండి, అది చేయగోరుతూ, వేరేవృత్తి లేనట్టి భూమి హీను

లకే భూమి నివ్వవలెను. క్రొత్త గ్రామములను నిర్మించు నప్పుడు గ్రామాలు స్వయం పోషకంగానూ, అందంగానూ ఉండునట్లు చూడాలి. అప్పుడు అవసరముబట్టి నియమాలలో మార్పు చేసు కొనవచ్చును.

(12) ఐదుగురు వ్యక్తులుండే కుటుంబానికి సాధార ణంగా ఒకఎకరం పల్లం, లేక 2½ నుండి 5 ఎకరాల వరకు మెట్ట భూమిని ఇవ్వగలరు. ప్రత్యేక పరిస్థితులలో భూసారము చూచి 5 ఎకరముల కంటె ఎక్కువ కూడ యివ్వవచ్చును.

(13) దానంగా వచ్చిన చిన్నచిన్న ఖండములను పరటాయించి వీలున్నంత వరకు ఒకే ఖండముగా చేయుటకు ప్రయత్నించగలరు. చిన్నచిన్న ఖండములుగా భూమి ఉండి, భూమిలేని వారికి యివ్వ వీలులేనప్పుడుగాని, లేక ఆ గ్రామ మందు భూమిహీనులు లేని స్థితిలోగాని కొద్దిగా భూమి కలిగిన వారికి ఆ ఖండముల నివ్వవచ్చును. లేదా గ్రామ సమిష్టి ఉప యోగములకు (కంపోస్టు ఎరువు చేయుటకు, మరుగుదొడ్లు గాను) వినియోగించ వచ్చును.

(14) ఎవరికైతే భూమి యివ్వబడిందో వారు దానిని పది సంవత్సరములవరకూ అమ్మ వీలులేదు.*

---

* మొదట్లో చేయబడిన ప్రభుత్వభూదానచట్టమందు ఈ నియమ మున్నది. తర్వాత అసలు అమ్ముటకు వీలులేదని మార్చబడి నది. — అనువాదకుడు.

(15) భూమి పంపిణీ చేయబడిన దినమునుండీ అం
సేద్యముచేయు స్థితిలో భూ గ్రహీతయే నాటినుండి ప్రభుత్వ
నకు పన్ను చెల్లించవలెను.

(16) భూమిని తీసుకున్న గ్రహీత రెండుసంవత్సరము
వరకూ దానిపై సేద్యము చేయకపోతే, ప్రభుత్వము అత
నుండి ఆ భూమిని స్వాధీనపరచుకొని మరియొక భూమిలే
పేదవానికి దానిని నియమముల అనుసారంగా యిచ్చుట
అధికారము కలిగియుండును.

(17) భూపంపిణీ జరిగినచోట మిగిలిన భూమిలేని పే
వారికొరకు, కొద్దిభూమి కలిగినవారికొరకు క్రొత్తగా భూమి
సేకరించుటకు నాటినుండే ప్రయత్నించవలెను.

(18) ఇంతకుముందు దున్నకుండా ఉండినభూమి
క్రొత్తగా సేద్యములోనికి తేవలసిన భూమి పంపిణీ చేయబ
ప్పుడు, అట్టిదానిని సేద్యములోనికి తెచ్చుటకు గడువు మూ
సంవత్సరము లుండగలదు.

## భూదాన చట్టము

భూమిపంపిణీ సులభముగా జరుగుటకుగాను చ
రాష్ట్రములలో భూదానచట్టములు చేయబడినవి. ఈ చట్ట
లందు విభిన్నమైన పరిస్థితుల కనుగుణంగా కొంతకొంత వైవి
మున్నది. అయితే ఈ చట్టములద్వారా క్రొత్తగా భూ
యివ్వబడ్డ భూమిహీనులకు వారి స్వామిత్వ అధికారముయొక
అంగీకారము యివ్వబడుతుంది. భూమి హస్తాంతరితము చేయ

యందు అగు ప్రభుత్వ రిజిస్ట్రేషన్ ఖర్చులు రద్దుచేయబడుతవి. ఈ వ్యవస్థకంతకు భూదానచట్టమందు ఒక బోర్డు ఏర్పరచబడు తుంది. ఆ బోర్డులో సభ్యులను వినోబా నియమిస్తారు. నేటి వరకూ హైద్రాబాదు, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, వింధ్య ప్రదేశ్, రాజస్థాన్, బీహార్, ఒరిస్సా మరియు సౌరాష్ట్రము లందు భూదాన చట్టములు చేయబడినవి.

## దేశంలో భూదాన ఉద్యమం

విప్లవము తనతోపాటు కార్యకర్తలను వెంటతీసుకు వస్తుంది. యుగవాంఛ పూర్తి అయ్యేసమయమందు మూల మూలల దాని ప్రతిధ్వని వినవస్తూ యుంటుంది. ఐదు సంవత్సర ముల క్రిందట ఏ వినోబా కొద్దిమందికి మాత్రమే పరిచయస్థుడో ఆ వినోబా వెంట యాత్రచేయుటకు నేడు దేశవిదేశములనుండి వచ్చుచున్నారు. మనదేశపు దౌర్భాగ్యమువల్ల ఇందు పాల్గొన వలసినంతమంది పాల్గొనలేదు; అయినప్పటికీ రాజకీయపక్షాలన్నీ తీర్మానములద్వారా భూదానోద్యమమును సమర్థించియున్నవి. ఇందులో పాల్గొన్నవారు తమ శక్తివంచనలేకుండా దీనిని సఫలీ కృత మొనరించుటకు ప్రయత్నిస్తున్నారు. భూదానయజ్ఞ సంరంభం కలగని ప్రాంతమంటూ నేడు దేశంలో ఎక్కడాలేదు. దేశంలో భూదానోద్యమమును ఒకసారి స్థూలంగా పరికిద్దాము.

భూదానోద్యమ వ్యవస్థను నడిపించుబాధ్యత సర్వసేవా సంఘం తనపై వేసుకొన్నది. దాని మార్గదర్శకత్వంలో

ప్రాంతీయ కార్యకర్తల సలహాతో వినోబా నియమించిన భూదానసమితులు వివిధప్రాంతాలలో పనిచేయుచున్నవి. ఈ భూదాన సమితులకగు ఖర్చులో అధికభాగం సర్వసేవాసంఘమునకు గాంధీస్మారకనిధినుండి వచ్చుచున్నది. అఖిల భారత రంగమందు వినోబాకాక, పనిచేసిన కొంతమంది పేర్లు ప్రత్యేకంగా తెలుసుకొన దగినవి. సర్వసేవాసంఘమునకు కార్యదర్శిగానున్న రెండు సంవత్సరములు (1952-54) శ్రీ శంకరరావుదేవు తన పూర్తి శక్తినంతా భూదానయజ్ఞమునకే వినియోగించిరి. సాధారణంగా వారు రాష్ట్రాలలో పదయాత్రే చేసేవారు. వీరియాత్ర కారణంగానే చాలారాష్ట్రములకు, ముఖ్యంగా దక్షిణ భారత వాసులకు, గాంధీ తత్వజ్ఞానము యొక్క నూతన ప్రేరణ లభించినది. శ్రీ జయప్రకాశనారాయణ భూదానయజ్ఞమందు కొంత ఆలస్యముగా ప్రవేశించినా, ఆయనవెళ్ళిన ప్రతి ప్రదేశమందు నవక్రాంతి శంఖమును పూరించారు. రాజకీయాలను విడనాడి, సర్వోదయకార్యక్రమమునకు ఆయన తన జీవితాన్ని సమర్పించారు. ఈ సంఘటనకు దేశచరిత్రలో విశిష్టస్థాన మేర్పడగలదు.

దేశంలోని మూలమూలల వ్యాపించియున్న కార్యకర్తలకు సర్వోదయ తత్వముయొక్క సైద్ధాంతిక భూమికను తెలియజెప్పు కార్యము దాదా ధర్మాధికారి పర్యటనవల్ల జరిగింది. సోదరి విమలాఠక్కర్ యాత్రలవల్ల చాలా ప్రాంతములలోనూ, ముఖ్యముగా పట్టణములలోనూ నవసంచలనం కలిగింది. కీ. శే. శ్రీకృష్ణదాస్ జాజూజీ యాత్రలు వృద్ధులనుకూడ యువ

కులుగాచేయు సంజీవనీశక్తి భూదానయజ్ఞమందు గలదని నిరూపించినవి.

స్థలాభావంచేత దేశమంతటా తమ పూర్తి సమయాన్నీ, శక్తినీ వెచ్చించి కృషిచేయుచున్న కార్యకర్త లందరినీ పరిచయం చేయ సాధ్యంకాదు. తమతమ రంగములపై భూదానయజ్ఞ ప్రభావాన్ని వీరందరూ ప్రసరింపజేసి, ఆ పని ద్వారా స్వీయ శక్తిని కూడ పెంచుకున్నారు.

సర్వసేవా సంఘం అధ్యక్షులు శ్రీ ధీరేంద్ర మజుందార్ కార్యదర్శి శ్రీ అన్నా సాహెబ్ సహస్రబుద్ధే, సహాయ కార్య దర్శులు శ్రీ సిద్ధరాజ్ డఢ్ఢా, శ్రీ వల్లభస్వామి కార్యకర్తలకు అఖండమగు ప్రేరణ కలిగించు స్థావరములని వేరుగా చెప్ప నవసరము లేదుగదా.

కొంచెం హెచ్చు తగ్గులలో భూదాన యజ్ఞపు వ్రేళ్ళు అన్ని ప్రాంతములకు ప్రాకి యున్నవి. కాశ్మీర్‌ను వదలిన భారతదేశమందు కొద్దో గొప్పో భూదానంగాని, సంపత్తి దానంగాని చేయని ప్రాంతమంటూ లేదు.

ప్రప్రథమంగా వినోబా తెలంగాణలో భూదాన యజ్ఞ మును ప్రారంభించారు. హైద్రాబాదు సరిహద్దులలో మంచిర్యా లలో తొలి సమ్మేళనం జరిగింది. అందు అందరూ కలసి ఒక లక్ష ఎకరములు సేకరించవలెనని నిశ్చయించారు. ఆ నిశ్చయాన్ని ఏనాడో సాధించడమే కాక, నేడు ఆ ప్రాంతంలోని కార్యకర్త లందరూ శీఘ్రగతిని పనిచేస్తున్నారు. హైద్రాబాదు మూడు విభాగములు— మరాఠ్వాడా, కర్నాటకం, తెలంగాణ. మూడు

భాగములలోనూ పని జరుగుతూంది. వెనువెంటనే భూపంపిణీ కూడ చక్కగా సాగుతూంది. తెలంగాణలోని పోచంపల్లి గ్రామంలో ఎవరికైతే భూములు పంచబడ్డాయో వారిస్థితి నేడు చాల బాగుపడింది. వారికి సాధనములు కూడ సమకూర్చబడ్డాయి. అచట శ్రీ కేశవరావు, శ్రీరామానందతీర్థ మొదలగు వారు ఈ పనిలో నిమగ్నమై యున్నారు.

ఆ తర్వాత వినోబా మధ్య ప్రదేశ్, రాజస్థాన్, మధ్య భారత్, వింధ్యప్రదేశ్ పర్యటించి ఢిల్లీ చేరారు. ఈ ప్రాంతములన్నిటా నేడు భూదాన కార్యము సాగుతూంది. ఢిల్లీ ప్రాంతమందు సంపత్తిదాన కార్యము తీవ్రంగా సాగుతూంది. రాజస్థాన్ భూసేకరణయందు తన కోటా పూర్తి చేసింది. మధ్య ప్రదేశమందు తరుణ కార్యకర్తలదళం చక్కగా పనిచేస్తూంది. ఈ ప్రాంతములలో భూ సేకరణతోపాటు పంపిణీ కార్యముకూడ శీఘ్రగతిని జరుగుతోంది. కొన్ని ప్రాంతములలో నిర్మాణము కూడ సాగుతూంది. శ్రీయుతులు దాదాభాయి నాయక్, గోకులభాయిభట్టు, ఖోడేజీ, చతుర్భుజపాఠక్ మొదలగు కార్యకర్తలు ఈ ప్రాంతములలో పనిచేయుచున్నారు.

ఢిల్లీ తర్వాత వినోబా ఉత్తర ప్రదేశ్, హిమాచల ప్రదేశ్ లలో యాత్రచేశారు. హిమాచల ప్రదేశ్‌లో శ్రీ ధర్మదేవ శాస్త్రి ప్రయత్నములవల్ల ఒక పూర్తి జాగీరును, ఉత్తర ప్రదేశ్‌లో శ్రీ దివాన్ శత్రుఘ్నసింహ ప్రయత్నములవల్ల ఒక మొత్తం గ్రామము దానములుగా లభించాయి. ఉత్తర ప్రదేశ్

తన కోటా 5 లక్షల ఎకరముల సేకరణ పూర్తిచేసి నేడు పంపిణీ కార్యమందు నిమగ్నమై యున్నది. ఉత్తర ప్రదేశ్‌లోని ప్రతి జిల్లాలోనూ వినోబాయాత్ర సాగింది. ప్రతిచోటా భూదాన సందేశం వినిపించ బడింది. లక్షలకొద్దీ ఎకరాల సేకరణ జరిగింది. ఉత్తర ప్రదేశ్‌లోని రాజకీయ నాయకులు కూడ పూర్తిగా సహకరించారు. ఈ ప్రాంతంలోని ప్రముఖ నిర్మాణ కార్యక్రమ సంస్థ, గాంధీ ఆశ్రమం, ఎక్కడి కక్కడ ఏర్పాట్లు చేయుట యందును, భూసేకరణ యందును ఎంతో సహాయ పడుటేకాక, తన కార్యకర్తలను ఈ ఉద్యమానికిచ్చింది. సోషలిస్టుపార్టీ కూడ సహకరించింది. బాబా రాఘవదాసు, అక్షయకుమార కరణ్ వంటివారి తపశ్చర్య ఈ ప్రాంతమును ప్రకాశవంతము చేయుచున్నది. ఈ ప్రాంతంలోని సాహితీ వేత్తలు కూడ తమ కలాన్ని కదిపి, భూదానంతో కలిపారు. వినోబా ఉత్తర ప్రదేశ్‌లో యాత్ర పూర్తిచేసుకుని ఆ ప్రాంతమును వదులు సమయమున నాటి ముఖ్యమంత్రి శ్రీ గోవింద వల్లభపంత్ "ఈ ప్రాంతపు వాతావరణాన్నే మీరు మార్చివేశారు" అని వినోబాతో అన్నారు. పూరీ సమ్మేళనానంతరం బాబా రాఘవదాసు ఉత్తర ప్రదేశంలో అఖండ పదయాత్ర సాగిస్తున్నారు.

బీహారులో వందలకొద్దీ చిన్న, పెద్ద కార్యకర్తలు దీక్షతో ఈ కార్యమందు నిమగ్నమై యున్నారు. వారిలో సంథాల్ పరగణాకు చెందిన అంధ కార్యకర్త శ్రీ మోతీలాల్; పూర్ణియాకు చెందిన వైద్యనాథబాబు, గయా జిల్లాకుచెందిన

శ్రీ గౌరీబాబు; ఖాదీగ్రాం, సుఖదేవరా ఆశ్రమం, సమన్వయ ఆశ్రమ కార్యకర్తలు ప్రత్యేకంగా పేర్కొన దగినవారు.

పశ్చిమ బెంగాలులో భూసేకరణ తక్కువగానే జరిగినా, భావబీజములు చక్కగా నాటబడ్డవి. అచటి నిష్ఠాపూరితులగు సేవకులు ఏ విధమయిన నిరుత్సాహమూ లేకుండా, ప్రభుత్వ సహాయం లేకపోయినా, ఎంతో దీక్షతో కృషిచేసి సత్ఫలితాలు సాధిస్తున్నారు. చారు బాబు వంటివారు మూడేసి వేలమైళ్లు పదయాత్రలుచేసి ప్రచారం చేశారు.

ఉత్కళమందు నాయకులు, కార్యకర్తలు అందరూ కూడ ఈ కార్యమందు నిమగ్నమైనారు. ఇచట భూక్రాంతి జ్యోతిని వినోబా వెలిగించారు. 100 మందికి పైగా కార్యకర్తలు తమ పూర్తిసమయాన్ని వెచ్చించి ఇందు పనిచేస్తున్నారు. ఇక్కడ వెయ్యికిపైగా గ్రామదానాలు లభించాయి. రోజు రోజుకూ క్రొత్తవి లభిస్తూనే ఉన్నాయి. నేపథ్యంలో కోరాపుట్‌లోని మౌనసేవకులు విశ్వనాథ పట్నాయక్ తపశ్చర్య ఉన్నది. భూదాన చరిత్రలో ఒరిస్సా క్రాంతిని సాధించే లక్షణాలు కనబడుతున్నవి. "రణోన్మత్తుడయిన అశోకుని ధర్మనిష్ఠుడగు అశోకునిగా మార్చిన భూమి యిది" అని వినోబా చెప్పనే చెప్పారు. ఈ ప్రాంతమందు పూజ్యులగు నాయకులు గోపబాబు, రమాదేవి, మాలతీదేవి, ఆచార్య హరిహరదాసు మొదలగు వారు పూర్తిగా లీనమైనారు.

మిగిలిన ప్రాంతములలో తిరువాన్కూర్ - కొచ్చిన్, గుజరాత్ బాగాపని చేయుటలో ముందంజవేశాయి. ఈ రెండు

ప్రాంతములందు ఉన్న యువకార్యకర్తల సంఘములు తమకు తామే సాటియైనవై, విప్లవాగ్నిని ప్రజ్వలింపజేస్తున్నవి. శ్రీ థామస్ చెరియన్, సోదరి రాజమ్మ తిరువాన్కూరు - కొచ్చిన్‌లో పనిచేస్తున్నారు. రవి శంకర మహారాజ్ వంటి శ్రేష్ఠతములు గుజరాత్‌కు కీర్తి తెస్తున్నారు. మరే ప్రాంతమూ దీనికి సాటిరాదు. ప్రేమమూర్తియగు మహారాజ్ ఇంతటి వృద్ధావస్థలోకూడ అఖండ పదయాత్ర చేస్తున్నారు. గుజరాత్ వాసులకు దాని ఫలితం లభించకపోదు.

పంజాబులో లాలా అచింతరామ్ భూదానకార్యమును శ్రద్ధతో చేస్తున్నారు. సోదరి సత్యాబాల దేశమందు ప్రత్యేకంగా పేర్కొనదగిన యువతీమణులలో ఒకతె. ఆమె పదయాత్రలు తాత్విక ప్రచారమునకు ఎంతగానో తోడ్పడుతున్నవి. భూసేకరణ తక్కువగానే జరిగినా క్రాంతిచిచ్చును ప్రజ్వలింపచేయుట యందు పంజాబు వెనకపడదని మాకు పూర్తి నమ్మకము.

మహారాష్ట్రం గురించి ఒక్కవాక్యం చాలు. అప్పాసాహెబ్ పట్వర్ధన్ వంటి అసామాన్య సేవకులున్న ప్రాంతం, శంకరరావు దేవు తపశ్చర్య పరిపక్వమైన ప్రాంతం, వాతావరణంలో సానేగురూజీ భావాలు నిండియున్న ప్రాంతం - అట్టిచోట భావ ప్రసారంతోనే భూక్రాంతి వేళ్లు తన్నుకుంటూంది. ఇక్కడ భూసేకరణ తక్కువ జరిగినమాట వాస్తవమే. అయితే ఇక మహారాష్ట్రను వెనకపడనివ్వమని కార్యకర్తలు దీక్ష పూనారు. అస్సాం, ఆంధ్రలలో చెప్పుకోదగినంతగా పనిజరగలేదు. అయినా తమతమ శక్త్యానుసారం దీక్షతో కార్యకర్తలు కృషిచేస్తున్నారు.

కర్నాటకంలో యువజన కార్యకర్తలు ఉత్సాహంతో పనిచేస్తు న్నారు. పదయాత్రలుచేస్తూ భూమిపంపిణీకూడజరుపుతున్నారు. మైసూరు కర్నాటకంలోని భాగమే. అచట కూడ మంచిపని సాగుతోంది.

తమిళనాడులో ఉత్సాహవంతుడైన ప్రజాసేవకుడు శ్రీజగన్నాథన్ ఏకాకిగానే పని ప్రారంభించినా, నేడు ఆ ప్రాంతంలోని యిద్దరు ప్రముఖనాయకులు, శ్రీరాజాజీయొక్క ఆశీర్వాదంతోకూడిన ప్రోత్సాహంతోనూ శ్రీ కామరాజ నాడార్ చేస్తున్న సక్రియాత్మక సహకారంతోనూ, పని త్వరిత గతిని సాగుతూంది. ఏ దీక్షతోనూ, శ్రద్ధతోనూ ఈ ప్రాంత మందు పనిజరుగుతోందో అది ఇతర ప్రాంతములకు ఒక ఉదా హరణ కాగలదు.

సౌరాష్ట్రమును గుజరాతులోని అంశముగానే పరిగ ణించవచ్చును. అయినా రాజకీయదృష్ట్యా అది వేరుప్రాంత మైంది. బాపూ పవిత్రభూమియగు సౌరాష్ట్రము - కచ్ఛ తమ తొలికోటాను పూర్తి చేశాయి.

నేటివరకూ వివిధరాష్ట్రములలో లభించిన భూమి వివర ములు అనుబంధములో యివ్వబడినవి.

వినోబా యాత్ర సాగిన ప్రదేశములందు ఎక్కువగా భూమి లభించి యుండుట సహజమే. అయితే వినోబా పర్య టించని ప్రాంతములందు పని జరగలేదనుట సరికాదు. ఉత్కళం (వినోబా పర్యటనకు ముందుకూడ ఈ ప్రాంతమందు ఎక్కువగా

పని జరిగియుండెను). కేరళ, గుజరాతు మొదలగు ప్రాంతములలో జరిగిన పనివల్ల, అచట భూమి వినోబా యాత్రచేసిన ప్రాంతములతో పోలిస్తే తక్కువే లభించినా, తాత్విక పునాదులు లోతుగా నున్నవని స్పష్టముగా తెలియగలదు.



# 8

# అందరికీ ఆహ్వానము

మన 36 కోట్లమంది అన్నదమ్ములకు సేవచేయమని భరతమాత మనలను పిలుస్తూంది. అందరూ యిందు పాల్గొనుటకు వీలైన ఉద్యమం భూదానోద్యమం. ధనిక తత్వము-పేదరికములను రూపుమాపుటకు ధనికుల సహకారము, పేదల పురుషార్థము అవసరమగు విప్లవమిది. ఆలోచించే ప్రతి వ్యక్తికీ, భావుకుడగు ప్రతివ్యక్తికీ యిందు దుముకుటకు స్వతహాగానే ప్రేరణ కలుగునట్టి ఉద్యమమిది. తనలో వచ్చి చేరమని నేడు భూదానోద్యమం మనలనందరనూ పిలుస్తోంది.

## భూ ఖామందులు

నేడు ఇక ఈ ఉద్యమం భూఖామందుల ఉద్యమంగా రూపొందవలసిన పరిస్థితులు ఎన్నో ప్రాంతాలలో తయారైనాయి. అంటే భూఖామందులు స్వయంగా తమ భాగాన్ని ఎలాగు యివ్వాలి ? అంతేకాక యితరులచే యిప్పిస్తూ, వారు సహాయపడాలి. ఈ ఉద్యమం తమ మేలును కోరుతూందని భూఖామందులు తెలుసుకోవాలి. యుగవాంఛను మనలో చాల

మంది గుర్తించాము. అయినా మనం భూమినిమాత్రం యివ్వ లేకున్నాము. మనం ఒకవిషయాన్ని అర్థంచేసుకోవాలి. ఈ ఉద్యమమువల్ల యాజమాన్యం తొలగిపోనుంది. ప్రతిష్ఠనీ, గౌరవాన్నీ మించి ప్రపంచంలో మరొకటి ఉండబోదు. కూడు, గుడ్డ లేక అలమటిస్తున్న కోట్లాది సోదరుల ఆర్తనాదం మన చెవిని సోకడంలేదా ? త్యాగంలోఉన్న రుచి ఏమిటో ఒకసారి చేసి చూడండి. శిబి, దధీచి, హరిశ్చంద్రుల వంటివారి రక్తం మీనాళాల్లో ప్రవహిస్తోంది. మీరు ఈ ఉద్యమంలో పాల్గొనక పోతే అది మిమ్ములను విశ్రాంతి తీసుకోన నివ్వదు. ఉత్తర ప్రదేశ్, బీహార్ ప్రాంతాలలోని భూఖామందులవలె మీరుకూడ భూదానసైన్యంలో భర్తీకండి. "నేను ఉదారవంతుల సైన్యాన్ని నిర్మిస్తున్నాను. నా యీ యజ్ఞంవల్ల రెండు రకముల మనుష్యులు వేరు వేరుగా కనబడతారు. ఉదారవంతులు ఒకవేపు, లోభులు రెండవవేపు కనబడతారు," అని వినోబా చాలాసార్లు చెబుతూ ఉంటారు. మరి మీరు సజ్జనుల సైన్యంలో చేరదలచుకొనరా ?

మీరీ ఉద్యమంలో ఎన్నో విధాల సహాకరించగలరు.

(1) మీ భూమినుండి ఉచితభాగ మివ్వండి.

(2) మీ బంధువులు, మిత్రులు, తదితరులనుండి భూమి నిప్పించండి.

(3) స్వయంగా పదయాత్రలు చేయండి. లేదా ఇతర భూదాన సేవకులు చేస్తున్న యాత్రలలో మీరు కూడ పాల్గొనండి.

(4) మీరు మీ భూమిని భూదాన యజ్ఞమునకు ఎందు కిచ్చారో రోజూ కనీసం ఒక వ్యక్తికైనా తెలియజెప్పండి.

(5) భూమి పంపిణీ సమయమందు మీరిచ్చిన భూమి ఎవరికి యివ్వబడుతుందో వారికి సాధనములు మీరు స్వయంగా యివ్వండి, లేదా యిప్పించండి.

(6) ఎవరికైతే భూమి యివ్వబడిందో వారికి వ్యవసాయ విషయమై సలహాయివ్వండి. అతని సేద్యం చెడకుండా చూచు బాధ్యత మీమీద ఉండగలదు.

భూఖామందులకు సంజీవనీ ఔషధమిస్తున్నారనే ఆరో పణకు వినోబా సమాధానం చెబుతూ "నేను భూఖామందులకు సంజీవని యిస్తున్నాను గాని, వారి యాజమాన్యమునకు కాదు" అని అన్నారు. వాస్తవానికి సరియైన విప్లవమునకు యిదే లక్ష్యంకావాలి. రోగం పూర్తిగా తొలగి పోవాలి. రోగిమాత్రం చెక్కుచెదరకుండా రక్షింపబడాలి. "గౌరవ ప్రతిష్ఠలతో మీరు జీవించాలనుకుంటే ఈ ఉద్యమాన్ని మీదిగా చేసుకోండి," అని వినోబా భూఖామందుల నుద్దేశించి చాలాసార్లు చెప్పారు. హింసాయుత విప్లవమందును, శాసనంద్వారా వచ్చు విప్లవ మందును - రెండింటిలోనూ భూఖామందుల భూములు తీసుకొన బడినా, తీసుకొనబడకపోయినా, వారి గౌరవ ప్రతిష్ఠలు మాత్రం నశించిపోతాయి. ఆపైన వారు అభివృద్ధి నిరోధ కులుగా మారి ప్రతీకారేచ్ఛతోనైనా ఉంటారు, లేదా సమసిపోతారు. ప్రజాస్వామ్యమందు ఇక భూస్వాముల ఆటలు

సాగవు. అయితే భూదానయజ్ఞమువారినుండీ భూములను తీసుకుని వారిని గౌరవ ప్రతిష్ఠలతో ఉంచగోరుతూంది. వారి హృదయాన్ని, మనస్సును మార్చి భూమి తీసుకొనబడుతుంది కనుక ఇందు స్వీయయాజమాన్యం తొలగిపోయినా స్వీయగౌరవము, ప్రతిష్ఠ పెరుగుతవి. రాగల విప్లవపరిణామం మరేమార్గం ద్వారానూ ఈ విధంగా ఉండజాలదు. అందుచేత ఈ ఉద్యమ బాధ్యతను భూఖామందులు తమపై వేసుకుంటే అందు దేశానికీ, వారికీ - యిద్దరికీ లాభముంటుంది. రాగలయుగం వ్యక్తిగత యాజమాన్యమునకు వ్యతిరేకముగా ఉండగలదు. విప్లవ ఛాయలు ప్రపంచమంతటా అతిత్వరగా అలముకొంటున్నవి. అందుచేత వ్యక్తిగత యాజమాన్య విసర్జనకు ఉత్తమమైన మార్గమేదో భూస్వాములు చూచుకొనవలసి యున్నది. ఇందుకుగాను భూదానయజ్ఞమార్గం తనను పరీక్షించమని భూస్వాములను ఆహ్వానించుచున్నది. తమశక్తినీ, వివేకాన్ని, భూమినీ ఇందు మీరు అర్పించండి; ఆపైన నాయకత్వం వహించండి. వ్యక్తిని చులకనచేసి, అసమర్థునిగాచేసి గాక, అతనిని ప్రతిష్ఠ కలిగిన వానినిగాచేసి అతనికి నాయకత్వ మిచ్చి భూమిని తీసుకొనాలని కోరే ఈ విప్లవము ఎట్టిస్థితిలోనైనా శాసనముకన్న శ్రేష్ఠమయినదే. అందుచేత యుగప్రవాహాన్ని గమనించి చిన్న-పెద్ద భూఖామందులంతా వ్యక్తిగతయాజమాన్యమును స్వేచ్ఛగా విసర్జించగల ఈ ఉద్యమమందు చేరి నాయకత్వం వహించవలెనని వినోబా భూఖామందులను కోరుచున్నారు.

శ్రామికులు

ఈ విప్లవమందు మీరుకూడ భాగస్వామ్యము వహించ వలసి యున్నది. నిష్క్రియులై ప్రేక్షకులుగా మీరుండకూడదు. భూమిని అడుగుతున్నపుడు తాను భూమిలేనివారి హక్కునే కోరుతున్నానని భూస్వాములతో వినోబా చెబుతున్నారు. మన సాత్వికమగు ఆచరణలతో మన హక్కుని మనం నిరూపించు కుని, అందుకు తగినవార మనిపించుకోవాలి. శ్రామికులు ఈ క్రింది కార్యక్రమములను ఆచరించగలరు :

(1) మీ బాహు బలము నుపయోగించి యితరులకు సహాయపడండి. అంటే శ్రమదానం చేయండి. భూమిహీనుల కివ్వబడిన భూమిని దున్నుటయందు, సాగుకు లాయకుగా చేయుటయందు తోడ్పడండి. బావులు త్రవ్వుటయందు సహాయ పడండి.

(2) తమ జీవితమును పరిశుద్ధమైనదిగా ఉంచుకొను టకు దురలవాట్లను త్యజించెదమని ప్రతిన బూనండి.

(3) భూదాన సాహిత్యం చదవండి. తమ నిరక్ష రాస్యులగు సోదరీ సోదరులకు చదివి వినిపించండి.

(4) దున్నేవాని వద్దనే భూమి ఉండగలదని గ్రామ గ్రామంలో భూమిలేనివారి ఇంటింటికీ చెప్పండి.

(5) మీ గ్రామంలోని భూఖామందుల వద్దకువెళ్ళి సవినయంగా 'మీరు భూదాన యజ్ఞమున ఎంత భూమి యిచ్చారు?' అని అడగండి. 'భూమి నిచ్చుటకు దేవుడు మీకు

ప్రేరణ కల్పించగలడని మా గట్టి నమ్మకము' అని కూడా చెప్పండి.

(6) భూదాన గీతాలు నేర్చుకోండి. అవసరం వచ్చినప్పుడు వాటిని పాడండి. మీ నృత్యాది కార్యక్రమాలలో భూదాన గీతములను చేర్చవచ్చును.

(7) భూదాన జన్మదినం ఏప్రియల్ 18, భూజయంతి సెప్టెంబరు 11 మొదలగు క్రొత్త పండగలు జరుపండి.

(8) గ్రామంలోని భూఖామందులను నిందించబోమని ప్రతిన బూనండి. కూలి చేయుటయందు బద్ధకించకండి.

(9) మీలో ఎవరినైనా భూఖామందులు పొలాలనుండి తొలగమంటే, మీరు తొలగకుండా మీమీ పొలాలను అంటిపెట్టుకునే ఉండండి.

(10) భూమి పంపిణీ జరుగునప్పుడు ఎవరికైతే ముందు భూమి అవసరమో అట్టివారినే ఎంచుకోండి. 'ముందు వానికి, చివర నాకు' అనే సూత్రాన్ని మనం మరువరాదు.

## విద్యార్థులు

శాంతియుత ఉద్యమాలలో విద్యార్థులు గొప్పగా పాత్రవహించని దేశం ప్రపంచంలో ఎచ్చటా లేదంటే అతిశయోక్తి కాదు. ప్రతీ దేశస్వాతంత్ర్య సంగ్రామమందును విద్యార్థులు ఉత్సాహంతో పాల్గొన్నారు. తుపాకి గుండ్లను, లాఠీలను కఠిన శిక్షలను యువకులు చిరునవ్వుతో స్వీకరించారు. అయితే ఇంతవరకూ వచ్చిన విప్లవోద్యమాలకు, ఈ విప్లవానికి ఒక తేడా

వున్నది. నేటివరకువచ్చిన ఉద్యమాలలో ఇతరులను చంపి, తాము మరణమునకు సిద్ధపడ వలసినది. కాని ఈ ఉద్యమం తాను జీవిస్తూ యితరులను జీవింప జేయునది. అందుచేత ఈ ఉద్యమంలో పాల్గొనగోరు విద్యార్థులకు ప్రతీకారంతో కూడిన యుద్ధ కార్యక్రమాలు లభించవు; వారు దీని లోతులకు వెళ్ళి చూడవలసి యున్నది. నేటి వరకూ ఈ ఉద్యమంలో పాల్గొన్న వేలాదివిద్యార్థులగాథ భూదాన సేవకులకు ప్రేరణ నిచ్చునది కాగలుగుతుంది. బీహారులో పదేళ్ళ పసివాడు భూమినడుగ బయలు దేరాడు. మొదట ఆపసివాడు తన తండ్రివద్దకు వెళ్ళి 'మీరు ముందు ఆరవభాగం యివ్వండి, ఆపైన నేను ఇతరులను అడగ గలుగుతాను' అని పట్టుపట్టాడు. ఇట్టి సుపుత్రుని కోర్కెను ఏతండ్రి కాదన గలడు ? ఆ బాలుడు కొద్ది రోజుల లోనే వందలకొద్ది ఎకరాల దానపత్రాలు తెచ్చాడు. ఆ చిన్ని సంఘమిత్ర తన ఆభరణములను ఈ ఉద్యమమునకు యిచ్చుటే కాక తన తల్లివద్ద, నాయనమ్మవద్ద నున్న ఆభరణాలను కూడ యిప్పించి వేసింది. అంతేకాక, ఇకముందు నగలు పెట్టుకొన బోనని శపథం చేసింది. ఆ పిల్లకు చదువురాదు. అయినా భూదాన సాహిత్యం అమ్ముతూ డబ్బు లెక్కపెట్టుట నేర్చు కుంది. గుజరాత్‌కు చెందిన ఆ బాలుడు ప్రతివారం ఒక భూస్వామి వద్దకు నిర్భయంగా వెళుతూ ఉండేవాడు. మొదటి వారం తిట్లు తగిలితే, వినివచ్చేవాడు. రెండవవారం భూదాన పత్రిక యిచ్చివచ్చేవాడు. మూడవవారం ఒక అణాపుస్తకం అమ్మి వచ్చేవాడు. ఇలా చేస్తూ చివరకు సుమారు 18 ఎకరాల

దానం సంపాదించాడు. చాలామంది విద్యార్థుల జీవితంపై ఈ ఉద్యమ ప్రభావం పడింది. చిన్నచిన్న వానరులలో సముద్ర మును దాటగల శక్తి వచ్చినప్పుడే విప్లవం వచ్చింది. చిన్నచిన్న గోపాల బాలలు గోవర్ధన పర్వతమును ఎత్తినప్పుడే విప్లవం వచ్చింది. వానరసైన్యం ఉప్పుచేసినపుడే విప్లవంవచ్చింది. సాధార ణంగా పెద్దలు చేయలేనట్టి ఈపనులను చిన్నిబాలలు చేసినప్పుడే విప్లవంవస్తుంది. నేడు చిన్నచిన్న విద్యార్థులుకూడ భావపరివర్తన కార్యము చేయుచుండుటచేతనే నేడు విప్లవం రానున్నది.

విద్యార్థులు ఈ క్రింది కార్యక్రమముల ననుసరించగలరు:

(1) స్వయంగా భూదాన సాహిత్యమును అధ్యయనం చేయండి.

(2) భూదానసాహిత్యం అమ్మండి. భూదానపత్రికలకు చందాదార్లను చేర్పించండి.

(3) తమ జీవితాలలో శ్రమనిష్ఠను పెంపొందించుకొను టకు ప్రయత్నించండి. బట్టలుతుక్కొనుట, మీ పాత్రలు శుభ్ర పరచుకొనుట మొదలగు పనులు స్వయంగా చేసుకొనండి.

(4) పెద్దవిద్యార్థులు 1957 వరకూ కాలేజీలు వదలి ఈపనియందే పూర్తిగా నిమగ్నం కండి.

(5) ఇతరులు శలవులలో భూదాన యాత్రలలో పాల్గొంటూ భూదాన గీతాలు పాడుట, భూమిహీనుల లిస్టులు తయారుచేయుట మొదలగు కార్యములు నిర్వహించగలరు.

(6) భూదాన కళాసమితులను ఏర్పరచి గ్రామగ్రామాన ప్రచారం చేయండి.

(7) సర్వోదయ జిజ్ఞాసాసమితులను స్థాపించి సర్వోదయ తత్వమును అధ్యయనం చేయండి.

(8) భూదానముతో సంబంధించిన యితర కార్యక్రమాలతో — స్వచ్ఛభారత ఉద్యమం, ఖాదీ - గ్రామపరిశ్రమల ఉద్యమం వంటివాటితో సహకరించండి.

## మహిళలు

మన రాజ్యాంగము మనదేశస్త్రీలకు పౌరస్వత్వ అధికారముల నిచ్చియున్నది. ఇక వారు పురుషులకు అర్ధాంగిగా మాత్రమో, లేక వీరపుత్రుల మాతలుగా మాత్రమో ఉండబోరు. సంకల్పించుకుంటే పురుషులవలెనే స్త్రీలుకూడ నేడు దేశ నిర్మాణమందు భాగస్వాములు కాగలరు. బాపూ భారతీయ మహిళను మేల్కొలిపారు. ఇక యిప్పుడు వినోబా వారికి పరాక్రామరంగమును తెరిచారు. ఈ ప్రపంచంలో ఇంతవరకూ ప్రవేశించిన స్త్రీల పనినిచూస్తే మనం ఆశ్చర్యపోతాము. హృదయ పరివర్తన మనే సన్నివేశములను వారు ఒక ప్రవాహం వలె ప్రవహింపజేశారు. సాంఘిక జీవనంలో స్త్రీలపాత్ర చాల మహత్వపూర్ణమయినది. అందుచే ఈ విప్లవమందు అధికసంఖ్యాకులుగా స్త్రీలు పాల్గొన్నప్పుడే ఇది సఫలమౌతుందని అనుకుంటున్నాము.

స్త్రీలు ఈక్రింది కార్యక్రమములను అనుసరించగలరు :

(1) తమ భూమినిచ్చుట, తమ కుటుంబమునుండిగాని, సంబంధీకులనుండిగాని యిప్పించుట.

(2) ఆభరణములను దానముగా యిచ్చుట.

(3) భూదానయాత్రలు చేయుట. ముఖ్యంగా ఇంటిం టికీ వెళ్ళి స్త్రీలలో భూదాన తత్వమును ప్రచారముచేయుట.

(4) "మన యిండ్లలో ధన సంచయం చేయకండి. స్వల్పఖర్చుతోనూ, శ్రమనిష్ఠతోనూ జీవితాన్ని గడుపుకుందాం" అని తమ యిండ్లలోని పురుషులకు నచ్చజెప్పుట.

(5) భూమిహీనుల కుటుంబములకు వెళ్ళి వారి స్త్రీలతో పరిచయము పొంది, వారితో స్నేహము పెంచుకోవాలి.

(6) భూదాన సాహిత్యమును ప్రచారంచేయుట. పురు షుల కంటె స్త్రీలే ఈపని ఎక్కువగా చేయగలరని అనుభవం ద్వారా తెలుతోంది.

## పార్టీలు, సంస్థలు

భారతదేశంలో రాజకీయ పార్టీలలోనున్న ప్రముఖు లలో కాంగ్రెసు, సోషలిస్టుపార్టీలలో బాపూ గొప్పదనం వార సత్వంగా ఏదో కొంత లభించినవారున్నారు. ఆపార్టీలలోని ప్రముఖులు చాలామంది బాపూతో భుజం భుజం కలిపి స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నారు. ఇట్టి మహిమాన్విత మైన పరంపరలలో పెరిగిన పార్టీలనుండి పూర్తి సహకారమును పొందుహక్కు భూదానయజ్ఞమున కున్నది. ఎందుచేతనంటే ఈ ఉద్యమ నాయకులుకూడ బాపూ సాన్నిధ్యంలో అదే లక్ష్య పథంపై యానం చేశారు. నేటివరకూ ఈ రాజకీయనాయకులతో కలిసి ఒకే రంగంలో పనిచేశారు. ఇట్టి స్నేహభావంతో పని చేసిన

వారు తిరిగి భూదానయజ్ఞముద్వారా ఒక రంగముపైకి వస్తు న్నారు. రాజకీయాధికారం వచ్చిన తర్వాత ఈమధ్య ఈరెండు పక్షములు ఎంతగానో విడిపోయి, చివరకు ఒకప్పుడు సోదరుల వలె కలిసియున్నది వీరేనా అని ఆశ్చర్యం గొలుపునంతగా నేడు విడిపోయారు. ఈ అఖాతము నేడు ఒక్కసారిగా పూడ్చ బడడం సాధ్యం కాదు; అయినా స్వరాజ్య సాధనానంతరం తొలిసారిగా ఒక రంగంపై భూదానయజ్ఞంద్వారా వీరు కలుసు కుంటున్నారు. ప్రతీ ప్రాంతంలోనూ యిట్టి పవిత్రదృశ్యాలు కనబడుతున్నవి. లక్ష్యసమానత్వం వారిని మరింత సన్నిహితంగా తీసుకు వచ్చింది. ఈ పార్టీలు తమ విప్లవాత్మక ధ్యేయంగా సోషలిస్టు సమాజ నిర్మాణమును పేర్కొంటున్నవి. జనశక్తి ద్వారా ఆ ధ్యేయమును చేరుటకు ఆచరణయుత మార్గమును భూదానయజ్ఞం చూపుచున్నది. దీనిద్వారా పరస్పరం కలుసు కుంటూ పరస్పర సమాలోచనలు - సంప్రదింపులు - సహకార మునకు వాతావరణము తయారగుచున్నది.

సౌభ్రాత్రము - ధ్యేయసిద్ధి అను సమ్మిళితమార్గమును చూపుచూ భూదానయజ్ఞము రాజకీయపార్టీలను ప్రత్యక్ష సహ కారమునకు ఆహ్వానించుచున్నది. కాంగ్రెసు నాయకులు తమ హృదయపూర్వక సానుభూతిని చూపుచూ సహకరిస్తున్నారు. ప్రజాసోషలిస్టుపార్టీకి చెందిన ముఖ్యులు ఈపనిని తమ స్వంత పనిగా ఎంచుకుంటున్నారు.

ఈ పార్టీలనుండి అత్యధికమైన సహకారము రావలెనని భూదానయజ్ఞము కోరుచున్నది. 1957 దగ్గరపడుతోంది.

మొత్తం శక్తినంతా యింధు కేంద్రీకరిస్తే ఈ పక్షముల ఆర్థిక విప్లవ లక్ష్యముకూడ నెరవేరగలదు. రాజకీయాధికారంద్వారా ఏమి చేయవలసివచ్చినా అందు ఎవరి ఆటంకమూ ఉండబోదు. అయితే ప్రజాస్వామ్యముద్వారా చేయవలెనంటే, స్వాతంత్ర్య సమరమందు భుజం భుజం కలిపి పనిచేసినట్లుగా నేడు కృషి చేయుటకు యిది ఒక్కటే కార్యక్రమము. ఇలా కృషి చేస్తూ ఉంటే ఒకే ధ్యేయంగల రాజకీయపార్టీలు సన్నిహితంగా వస్తూ యుండగా పార్టీరహిత రాజకీయ వ్యవస్థకు బలమైన పునాదులు ఏర్పడగలవు.

నేడు దేశంలోని ఆంతరంగిక పరిస్థితి ఎంత బాధా కరంగా ఉందంటే మనమందరం భుజం భుజం కలిపి దేశహిత కార్యములలో పనిచేయకపోతే భవిష్యత్తు అంధకారమయంగా కనబడుతోంది. అన్ని పార్టీలు యిందుకు మార్గమును వెతుకు తున్నవి. లక్ష్య మంత్రంతోపాటు శాంతియుత కార్యక్రమాన్ని కూడా ప్రజానీకమునకు అందించకపోతే పరిస్థితి చాల క్లిష్టం కావచ్చు. రాజ్యాధికారము ద్వారా జరుగుచున్న కార్యములు జనశక్తి ద్వారా రాగల విప్లవమునకు రూపురేఖలు దిద్దగలవిగా లేవు. భూదానయజ్ఞం ప్రారంభంనుండి ఈ విషయాన్నే నొక్కి చెబుతూంది. ఇందుకే అన్నిపార్టీలు సహకరించాలని కోరు తూంది. అందుచేతనే వినోబా కాంగ్రెసు అధ్యక్షునితో సత్యా గ్రహ భాషలో మాట్లాడి హృదయ స్పర్శియగు విజ్ఞప్తి చేశారు. ఈ రెండు పెద్ద పార్టీలు ఈ విజ్ఞప్తిని అనుసరించ గలవని ఆశిస్తున్నాము.

ఉత్తర ప్రదేశ్‌లో రాష్ట్రీయ స్వయంసేవక సంఘం భూదానంతో సహకరించింది. భూదాన ఉద్యమం భారతీయ సంస్కృతిని పునరుద్ధరించు ఉద్యమం. దీనివల్ల భారతీయ సంస్కృతి యొక్క ప్రకాశం అత్యధికంగా మెరయగలదు. ఇట్టి స్థితిలో భారతీయ సంస్కృతిని ఉద్ఘోషించే రాష్ట్రీయ స్వయం సేవక సంఘమును ఈ కార్యమందు సహాకరించ వలసిందిగా భూదాన యజ్ఞము పిలుపు నిచ్చుచున్నది.

కమ్యూనిస్టుపార్టీ తాను పేదలకొరకు పనిచేస్తున్నానని చెప్పుకుంటూంది. ఎవరినైనా హత్యచేయ నవసరంలేకుండానే పేదరికం తొలగిపోతే దానిని కమ్యూనిస్టు సోదరులు వాంఛించరా? భూదానోద్యమం అహింసాత్మక విధానంలో పేదరికాన్ని తొలగిస్తానంటూంది. అందుచేత పేదల మేలునుకోరే కమ్యూనిస్టు సోదరులను కూడ ఈ ఉద్యమము ఆహ్వానించుచున్నది.

పార్టీలకు, సంస్థలకు ఈ క్రింది కార్యక్రమ మివ్వబడుచున్నది :

(1) తమ ప్రతీ సభ్యునినుండీ ఆరవభాగం భూమినీ, సంపదనీ దానంగా కోరవలెను.

(2) ప్రతీ సభ్యుడూ ఏదో కొంత సమయమును భూదాన కార్యమునకు వెచ్చించునట్లు చూడవలెను.

(3) తమ యిరుగు పొరుగున ఉండు భూదాన సేవకులకు పూర్తిగా తోడ్పడమని సభ్యులను ఆదేశించవలెను.

(4) సంవత్సరంలో ఏదో కొంత నిర్ణీత సమయము భూదాన కార్యమున వెచ్చించుటకు నిశ్చయించండి.

(5) తమ కార్యక్షేత్రంలో భూసేకరణ, పంపిణీ బాధ్యతలను మీద వేసుకొనవలెను.

(6) ఒక కోటాను నిశ్చయించుకుని దానిని పూర్తి చేయుటకు తమ తదితర కార్యములను ప్రక్కకు పెట్టి తీవ్రకృషి చేయవలెను.

(7) 1957 వరకూ తమ సంస్థ ఈ కార్యమందే నిమగ్నమగునట్లు చేయవలెను.

ఇట్టి రాజకీయ, సాంఘిక సంస్థలన్నిటి సహకారమునకు విజ్ఞప్తిచేస్తూ, ఈ ఉద్యమములోనికి దూకి పనిచేయమని భూదాన ఉద్యమము కోరుచున్నది. దేశహితమునకుగాను సహకరించండి; అయితే పార్టీ దృష్టితో కాదు. పార్టీ దృష్టికి అతీతంగానే వారిందు పాల్గొనాలి. ఎందుచేతనంటే పేదవారి మేలుకొరకు జరుగు కార్యములందు, విప్లవ కార్యములందు మతము, కులము, జాతి మొదలగు భేదములు చూడబడవు గదా. గ్రామంలో నిప్పుముట్టుకుంటే అన్ని పార్టీలవారు అగ్ని నార్పుటకు పరుగెత్తెదరేగాని, తాము ఫలానా పార్టీ సభ్యులుగా నిప్పునార్పుటకు వెళుతున్నామని భావించరుగదా. దేశంలో భూదానయజ్ఞం తీసుకురా దలచిన విప్లవమందు అందరూ సౌభ్రాత్ర సూత్రముతో బంధింపబడి యిందు పాల్గొనాలని షరతు పెడుతూంది. భూదానోద్యమం అధికార కాంక్షతో కూడినదికాదు. అందుచేత ఈ షరతు యెడల ఎవరికీ ఆటంకం ఉండబోదు. పేదవారికి మేలు చేకూర్చు ఈ కార్యమందు అందరూ పార్టీ భేదములను వీడి సహకరించాలనీ, లక్ష్యం

సిద్ధించేవరకూ సహకరించాలని హృదయ పూర్వకంగా భూదానోద్యమం విజ్ఞప్తి చేయుచున్నది. ఈ కార్యము ఇప్పుడు వినోబాది కాదు. ఇది దేశమంతటిదీను.

## కార్యకర్తలు

ఏ ఉద్యమానికైనా సజీవంగా నడుపు శక్తి కార్యకర్తలలోనే ఉంటుంది. భూమి యిచ్చేవారు, పుచ్చుకునేవారు సిద్ధంగానే ఉన్నారు. కాని అడుగుటకు, పంచుటకు కార్యకర్తలు సిద్ధంగా ఉండకపోతే విప్లవం ఎలా సఫలం కాగలదు? కార్యకర్తలు ఉద్యమానికి వెన్నెముకలు. భూదానోద్యమం భూసేకరణ ఉద్యమంగా మాత్రమే ఉన్నంతకాలం సరిపోయింది. కాని భూ పంపకం ప్రారంభమైన నాటినుండి కార్యకర్తలు అధికం కావలసిన అవసరం తెలియ వచ్చింది. సేకరణ కార్యము మాత్రమే ఉన్నప్పుడు కార్యకర్తలను ఒక సంవత్సరం సమయమివ్వమని కోరారు. పరంధామ ఆశ్రమంలోని కార్యకర్తలను యిందు నిమగ్నంచేసి, నిర్మాణ కార్యకర్తలను అధిక సమయం దీనికొరకు వెచ్చించమని వినోబా కోరారు. కొద్ది రోజుల అనంతరమే వినోబా చేసిన విజ్ఞప్తిని సర్వ. సేవాసంఘం స్వీకరించి, అందరినీ ఆహ్వానించింది. చివరకు బోధగయ సమ్మేళనంలో శ్రీ జయప్రకాశ నారాయణ్ జీవనదాన మను ప్రేరణ కలిగించి పూర్తి సమయమును వెచ్చించగల కార్యకర్తలకు పిలుపు నిచ్చారు. శ్రీ జయప్రకాశ్ పిలుపు నందుకుని శ్రీ రవి శంకర మహారాజ్ వంటి సాధు పుంగవులు జీవనదానం చేశారు.

"వామనావతారమునకు మూడడుగు లున్నవి. భూదానయజ్ఞం మొదటి అడుగు, రెండవ అడుగు సంపత్తి దానముగా రూపొందింది. మూడవ అడుగే ఈ ఆరంభమైన జీవనదానము" అని తెలంగాణలో వినోబా అన్నారు. "నేను అందర్నీ పేదలసేవలో నిమగ్నం చేయ వచ్చిన వాడిని" అని వినోబా జీవనదానంగురించిచెబుతూఉంటారు. 'భూదానయజ్ఞం ఇక యిప్పుడు అభిమన్యునిస్థితికి వచ్చింది. ఈ పద్మవ్యూహ మును భేదించనైనా భేదించాలి, లేనిచో స్వయంగా నాశనం కావాలి'అని బీహారులో ఇస్లాంపూరు సభలో వినోబాఅన్నారు. సంవత్సరం, ఆరుమాసములకని కార్యకర్తలు ఈ ఉద్యమంలోనికి వచ్చి ప్రయోజన ముండదు. సంవత్సరం, ఆరుమాసాలు తమ సమయ మిమ్మని సంస్థలను, రాజకీయ పార్టీలను, విద్యార్థులను కోరుతున్నాము. ఉద్యమానికి పట్టుగొమ్మలైన కార్యకర్తలను తమ పూర్తి జీవితమంతా అర్పించమని వినోబా కోరుతున్నారు. అందుచేతనే దీనిని వారు 'ఉద్యమము' అనక 'ఆరోహణము' అంటున్నారు.

జీవనదానం అని చెప్పుకున్నా, చెప్పుకొనక పోయినా ఈ ఉద్యమంలో తమ పూర్తి జీవితాలను నిమగ్నంచేయు కార్యకర్తల అవసరం నేడు ఎంతైనా ఉన్నదను విషయము సుస్పష్టము. దీనికొరకే పూర్వకాలంనాటి వానప్రస్థాశ్రమ వ్యవస్థను పునరుజ్జీవింప జేయాలని నిరంతరం ప్రయత్నిస్తూ వచ్చారు, ప్రయత్నిస్తున్నారు. ఈ కార్యము కేవలము, భూసేక కరణ, భూవితరణాల వరకే పరిమితమై యుంటే అదేమంత

గొప్పవిషయంకాదు. కానీ, సర్వోదయ సమాజ నిర్మాణమునకు గాను, రామరాజ్యం నమూనాలను నిర్మించవలసి యున్నందున, ఇందు తమ జీవిత సర్వస్వమును ఆహుతిచేయగల కార్యకర్తలు అవసరమవుతున్నారు.

గాంధీజీ శిక్షణలో తయారైన కార్యకర్తలు ఈకార్య భారమును స్వీకరిస్తే, గాంధీజీ సమయాన్ని తిరిగి జ్ఞాపకంచేయు రీతిలో ఉద్యమం సచేతనమై, సజీవమౌతుందని, నిర్మాణ కార్య కర్తలు, గాంధీ సేవకులు హెచ్చుపని చేయగలరని వినోబా ఆశిస్తు న్నారు. గాంధీ చూపిన బాటనే భూదానయజ్ఞం పురోగ మిస్తూంది. కనుకనే నిర్మాణ కార్యకర్తలు యిందు సంలగ్నం కాగలరని ఆశింపబడుతూంది. అధికార వ్యామోహములకు దూరంగా ఉంటూ సంవత్సరాల తరబడి నిర్మాణ కార్యములందే నిమగ్నమైయున్న గాంధీ సేవకులను ఈ ఉద్యమం గాంధీజీ పేర ఆహ్వానించుచున్నది. గాంధీజీ సిద్ధాంతాలు నేడు ఈ యుగపు ఒరిపిడి రాయిపై పరీక్షింపబడుతున్నవి. రాజకీయ విప్లవానంత రము గాంధీజీ మార్గముననే వెళ్ళి, జనశక్తి ద్వారా సాంఘిక, ఆర్థిక విప్లవములను కొనసాగించకపోతే అహింస ద్వారా వాంఛించే శక్తి ఉద్భవించ జాలదు.

యుగవాంఛతోపాటు వాంఛిత పురుషార్థం సమైక్య మైతే విప్లవం ఆరంభమౌతుంది. ఈ విప్లవమందు యుగవాంఛ స్పష్టముగా కనబడుతోంది. ఇక మిగిలినదల్లా వాంఛిత పురు షార్థమే. ఇందుకు మూడు విషయాలు కావాలి: యోగ్యమైన నాయకత్వము, కార్యకర్తల సహకారము, ప్రజల అండ.

భూదాన ఆరోహణమందు వినోబాయొక్క యోగ్యమైన నాయకత్వమున్నది. లక్షలకొద్దీ రైతులు తమ హృదయంనుండి భాగమిచ్చినట్లుగా భూమినిచ్చి ఈ విప్లవమునకు ప్రజల అండ గలదని నిరూపించారు. ఇక ఈ విప్లవ గమనంలో ఒకే అంగం మిగిలింది—అదే కార్యకర్తల సహకారము.

విప్లవ సాధనకు మిగిలిన అంగమును పూర్తిచేయ మీరు రండి! పంటపండి సిద్ధంగా ఉంది. దానిని కోసేవారే తక్కువైనారు. రండి! భూదాన యజ్ఞపు పంటను యింటికి జేర్చుటకు మన సర్వ శక్తులనూ వినియోగిద్దాము.



భూదానయజ్ఞము జీవన పరివర్తన కార్యము, జీవితమును పరిశుద్ధిచేసుకొను కార్యము. యదార్థమాలోచిస్తే ఇది ఏదో ఉద్యమముకాదు. ఉద్యమమందు ఇటూ-అటూ ఊగిసలాట ఉంటుంది; ఇది ఆరోహణము. పైకి, పైపైకి ఆరోహించుటే. ఇందు భూమిలెక్కలు ముఖ్యంకాదు; ప్రధానమైనది మానవుడెంత ఆరోహించాడు అనునదే. ఇది హృదయశుద్ధి కవసరమగు ఉపకరణము. ఈశ్వరుడెవరికైతే హృదయశుద్ధికి ప్రేరణ కలిగించునో, వారిద్వారానే రూపం మారగలదు.

—వినోబా

అనుబంధము—1

## భూదాన సేకరణ, పంపిణీ, సంపత్తి దానము, జీవనదానీల

# అఖిల భారతీయ వివరములు

### ఏప్రియల్ 1956 వరకు

| ప్రాంతం | సేకరింపబడిన ఎకరాలు | దానపత్రముల సంఖ్య | పంచిన భూమి | భూమి ఇవ్వబడ్డ కుటుంబాలు | సంపత్తిదానము: దాతలు | సంపత్తిదానము: మొత్తము రు. | అ. | పై | జీవన దానీల సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. అస్సాము | 5,000 | — | 42 | — | — | 2,500 | 0 | 0 | — |
| 2. ఆంధ్ర | 50,754 | — | — | — | — | — | — | — | — |
| 3. ఉత్తరప్రదేశము | 5,81,403 | 25,241 | 72,323 | 35,920 | 1,656 | 36,393 | 15 | 0 | 176 |
| 4. ఒరిస్సా | 2,55,029 | 92,715 | 41,378 | 12,640 | 3,718 | 35,233 | 7 | 0 | 106 |
| 5. కర్నాటకము | 3,720 | 746 | 533 | 188 | 41 | 1,212 | 2 | 0 | 10 |
| 6. కేరళ | 28,535 | 4,401 | 1,441 | 472 | 373 | 5,549 | 7 | 4 | 109 |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 7. గుజరాతు | 44,252 | — | 10,886 | 3,477 | 27 | 7,672 | 0 | 0 | 1 | 9 |
| 8. తమిళనాడు | 47,092 | 12,998 | 4,582 | 1,748 | 907 | 17,271 | 2 | 0 | 50 | |
| 9. ఢిల్లీ | 9,388 | 222 | 151 | 15 | — | 14,899 | 2 | 0 | 6 | |
| 10. పంజాబు-పెప్సూ | 15,614 | 3,602 | 1,026 | 253 | 771 | 56,635 | 13 | 0 | — | |
| 11. బెంగాలు | 11,617 | 6,608 | 2,202 | 1,807 | 789 | 21,085 | 8 | 6 | 41 | |
| 12. బొంబాయి | 614 | 18 | — | — | 529 | 1,29,932 | 4 | 0 | 2 | |
| 13. బీహారు | 24,42,238 | 2,99,796 | 1,00.490 | 52,814 | 1,888 | 13,979 | 0 | 0 | 1,349 | |
| 14. మధ్యప్రదేశ్ | 1,44,969 | 34,818 | 43,838 | 8,412 | 700 | 18,831 | 8 | 3 | — | |
| 15. మధ్యభారత్ | 55,509 | 6,737 | 2,378 | 534 | — | — | — | — | — | |
| 16. మహారాష్ట్ర | 13,084 | 7,335 | 3,983 | 1,072 | 3 | 42 | 0 | 0 | 50 | |
| 17. మైసూరు | 9,065 | 3,536 | 100 | 20 | — | — | — | — | — | |
| 18. రాజస్థాన్ | 3,78,927 | 6,316 | 20,308 | 3,504 | 1,966 | 52,190 | 15 | 9 | 52 | |
| 19. వింధ్యప్రదేశ్ | 8,498 | 1,723 | 982 | 368 | 36 | 4,393 | 8 | 6 | 25 | |
| 20. సౌరాష్ట్ర | 61,045 | — | 6,557 | — | — | — | — | — | — | |
| 21. హిమాచలప్రదేశ్ | 1,568 | 121 | 21 | 8 | 1 | 1,050 | 0 | 0 | — | |
| 22. హైద్రాబాదు | 73,964 | 10,533 | 37,044 | 7,610 | 1,204 | 42,498 | 8 | 9 | 15 | |
| మొత్తం | 43,01,916 | 5,17,366 | 3,5[illegible],265 | 1,30,912 | 14,6[illegible]9 | 4 59,380 | 3 | 1 | 2,013 | |

అనుబంధము—2

# భూ దా న ప త్ర ము

## శ్రీ ఆచార్య వినోబాభావేగారిచే

ప్రారంభింపబడిన "భూదానయజ్ఞ" నిమిత్తమై

జిల్లా................తాలూకా.................గ్రామము..................

లోగల సర్వే నెం ........ఎకరములు..................సెంట్లు

.........................................................................

నా యొక్క భూమిని భూవసతి లేనివారికి పంచి యిచ్చుటకు దానముగా యిచ్చితిని. ఈ భూమిపై ఇకముందు నాకు ఎట్టి హక్కు ఉండబోదు. ఇది సమ్మతితో పూర్తిచేసి ఇచ్చిన దాన పత్రము.

పత్రం వ్రాసిన

స్థలము..................

తేది.................. దాత సంతకము

దాత పేరు..................తండ్రి పేరు..................

నివాసము..................టప్పా..................జిల్లా..................

సాక్షులు

1

2

..................స్వీకృతి..................

అనుబంధము—3

# సంపత్తి దాన పత్రము

శ్రీ వినోబాజీ భారతీయ సాంప్రదాయానుసారము ఆర్థిక క్రాంతిని సంపూర్ణముగ అహింసా ప్రక్రియతో రూపొందించుటకు భూమియేగాక సంపత్తి (ఆదాయము) లోని ఆఱవభాగమును ఇచ్చుటకు ప్రజలను కోరుచున్నారు. ఇందువల్ల భూమి లేక పోవడంనుంచి భూదాన యజ్ఞములో పాల్గొనలేనివారికికూడ ఈపవిత్ర కార్యములో భాగస్వాములగుటకు అవకాశం లభించినది. కాబట్టి దరిద్రనారాయణుని సేవకొరకు యివ్వబడిన ఈ ఆహ్వానాన్ని పురస్కరించుకొని నేను సంపత్తిదాన యజ్ఞముయొక్క విధానము ననుసరించి నాభాగమును సమర్పించి, దానియొక్క వినియోగము చేయుచుండగలను. మరియు వ్యయ వివరముల వార్షిక లెఖ్ఖలు ప్రాంతీయ భూదాన సమితికి పంపుచుండగలను.

నా ఈ సంకల్పమునకు అంతర్యామి రూపములో, నేనేసాక్షిని, నేను నా అంతరాత్మకు విశ్వాసపాత్రుడనై ప్రవర్తించగలను. ఈశ్వరుడు నాకు శక్తి నిచ్చుగాక !

నాయొక్క ప్రస్తుత ఆదాయము సుమారు

సంవత్సరమునకు / నెలకు (            )

నా ఆదాయములో ప్రస్తుతం ఇవ్వగల భాగప్రమాణం (            )

తేది..... ..............................

______________________

దాత సంతకము.

పూర్తి పేరు, విలాసము ..........................................

.........................................................

సూచన : దానపత్రమును నింపి, భూదానసమితి కార్యాలయమునకు పంపవలెను.

# సర్వోదయ సప్త గ్రంథములు

*గాంధీజీ ఆత్మకథ*

*మంగళ ప్రభాతము*

గాంధీజీ రచన. ఆశ్రమజీవిత వ్రతములపై గాంధీజీ అభిప్రాయాలు ఇందు వివరించబడ్డవి.

*హింద్ - స్వారాజ్యము*

తన దృష్టిలో స్వరాజ్యమంటే ఏమిటో 1908 లో గాంధీజీ ఊహించిన చిత్రమిది. అయిననూ నేడుకూడ విప్లవకారులగు యువకులు దీనినుండి ప్రేరణ పొందగలరు.

*'జడమూల్ సే క్రాంతి' (అమూలాగ్ర పరివర్తనము)*

శ్రీ కిశోర్‌లాల్ మశ్రూవాలా రచించిన ఈ పుస్తకములోని మౌలిక తాత్త్వికాభిప్రాయములు అతిరథ మహారథులకుకూడ అంతర్నిరీక్షణ చేసికొను అవసరములను కల్పించగలవు.

*గీతాప్రవచనములు*

వినోబాజీయొక్క సంపూర్ణ జీవితతత్వమును హృదయంగమమగు శైలిలో ఇందు చూడగలము.

స్వరాజ్యశాస్త్రము

వినోబారచన. ఆధునిక రాజకీయములపై వినోబా అభిప్రాయములిందు గలవు. పార్టీ రహిత లోకనీతికి యిందు పునాదులు గలవు.

సర్వోదయము

గాంధీజీ మరియు ఇతరుల వ్యాసములు. సర్వోదయ సంబంధమైన వ్యాసముల సంకలనము.

[సర్వోదయముగురించి అధ్యయనము చేయుటకు ఈ ఏడు గ్రంథములు పఠించుట అత్యవసరము. ఇందు 'గాంధీజీ ఆత్మకథ', 'గీతాప్రవచనము' మాత్రము ఇంతవరకు తెలుగులోనికి వచ్చినవి. హిందీలో అన్ని పుస్తకములు దొరకగలవు.]



# సర్వోదయ భూదాన సాహిత్యము

| | | |
|---|---|---|
| గీతాప్రవచనములు | వినోబా | 1—0—0 |
| వర్తకులకు పిలుపు | ,, | 0—1—0 |
| గిరిప్రవచనము | ,, | 0—1—0 |
| మనఐక్యత-గ్రామ ఆరోగ్యము | ,, | 0—3—0 |
| పవిత్ర సన్నివేశములు | మృదుల మూందడా | 0—8—0 |
| వినోబాజీ జీవితం | లవణం | 0—3—0 |
| విద్యార్థులారా రండి ! | ,, | 0—2—0 |
| వినోబా సన్నిధిలో | నిర్మల దేశపాండే | 1—4—0 |
| సంపత్తిదానము | కృష్ణదాస్ జాజూ | |
| జీవనదానము | జయప్రకాశ్ నారాయణ్ | |
| సామ్యయోగపథముపై | దాదా ధర్మాధికారి | |
| భూక్రాంతి వెల్లువ | మనమోహన చౌదరీ | |
| సర్వోదయ చరిత్ర - శాస్త్రము | శంకరరావ్ దేవ్ | |
| శ్రమదానం | శివాజీభావే | |
| శిక్షణవిచారధార | వినోబా | |
| సాహిత్యం - సాహితీవేత్తలు | ,, | |
| కాంచీపుర సందేశం | ,, | |

*ధరలు వేసిన పుస్తకములు అచ్చు అయిఉన్నవి. మిగిలినవి త్వరలోనే వెలువడ నున్నవి.*

సర్వోదయ సాహిత్య ప్రచార సమితి

*భూదాన కుటీరం, హైదరాబాదు - 1.*